# పద్యకావ్యములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| అచ్చ తెనుగురామాయణము | ... | 2 | 8 |
| అనంతునిఛందము, (ఛందోదర్పణము) | ... | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము, అబ్బయామాత్యునిది | ... | 1 | 0 |
| అనుభవసారము, పాలకురికి సోమనాథ ప్రణీతము | ... | 1 | 0 |
| అంబరీషోపాఖ్యానము, సటీక | ... | 0 | 8 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) సటీక | ... | 8 | 8 |
| ఆంజనేయదండకము, హనుమద్దండకము | ... | 0 | 4 |
| అన్యవాదకోలాహలము, ద్విపద, లఘుటీక | ... | 1 | 12 |
| ఆంధ్రమహాభారతము:— | | | |
| ఆదిపంచకము | ... | 11 | 8 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వం | ... | 7 | 8 |
| శాంతిసప్తకము | ... | 7 | 8 |
| ఆది సభాపర్వములు | ... | 4 | 0 |
| అరణ్యపర్వము | ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | ... | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | ... | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 4 | 0 |
| శాంతిపర్వము | ... | 4 | 0 |
| అనుశాసనిక అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | ... | 4 | 0 |
| ఆనందరంగరాట్ఛందము | ... | 2 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, మూలము | ... | 0 | 4 |
| ,, టీకతో | ... | 0 | 10 |
| ఆంధ్రభాషాభూషణము, విమర్శతో | ... | 0 | 6 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు కాలికో | | 2 | 0 |
| ఆంధ్రశ్రీమద్రామాయణము—జనమంచి శేషాద్రిశర్మగారిది, 3 సంపుటములు | ... | అచ్చు | |
| ఆంధ్రభాషార్ణవము | ... | 2 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక | ... | 1 | 4 |
| ఉత్తరరామాయణము, చక్కనిహార్పు | ... | 6 | 0 |
| ఉత్తరహరివంశము | ... | 3 | 0 |

శ్రీ ర స్తు

# హ ర వి లా స ము

శ్రీనాథమహాకవిప్రణీతము



చె న్న పు రి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వా రి చే ప్ర క టి త ము

1958



[Price 2—8—0.

# పీఠిక

శ్లో. ఇదమన్ధం తమః కృత్స్నం జాయేత భువనత్రయమ్,
యది శబ్దాహ్వయం జ్యోతి రాసంసారం న దీప్యతే.

అజ్ఞానగాఢాంధతమఃపటలంబుఁ బటాపంచలు సేసి ముల్లోకంబుల విశుద్ధదివ్యజ్ఞానతేజఃపుంజంబు వెలయించి సకలపదార్థస్వరూపంబు నిరూపింప నసాధారణం బగు సాధనంబు శబ్దజ్యోతి.

ఇయ్యది నిత్యమై దోషరహితమై పరమానందరసైకాస్పదమై పరబ్రహ్మాత్మకం బనఁదగి యున్నది.

ఋగాదిచతుర్వేదంబులును, శిక్షాదిషడంగంబులును, మన్వాద్యష్టాదశస్మృతులును, శాతాతపాద్యష్టాదశాగమములును, విష్ణ్వాద్యష్టాదశపురాణములును, వాయవ్యాద్యష్టాదశోపపురాణములును, భాట్టాది షడ్దర్శనంబులును, భారతాదీతిహాసంబులును, దక్కఁగల సకలశాస్త్రంబులు నీశబ్దబ్రహ్మముదివ్యావతారంబులు. ఈ శబ్దబ్రహ్మము నుపాసించియే మనపూర్వాచార్యు లగు వ్యాసపరాశరాది మహర్షిసత్తములు నిత్యానందరసైకాశ్రయం బగు మోక్షమార్గము నెఱింగి కృతకృత్యులైరి.

ఇట్టి పరమోపకారకంబగు శబ్దం బిహపరసుఖానందకందం బని నొక్కి వక్కాణించుట సాహసంబు గాదు. కానిచో నివృత్తతర్షులై యరణ్యంబుల వాతాంబుపర్ణాశను లగు మహర్షులుగూడ శ్రీరామాయణాదిదివ్యప్రబంధంబుల రచించి రేయుఁబవలు నా శబ్దసుధాప్రవాహమధ్యంబున మునుఁగుచుం దేలుచు నేల యుందురు? దివ్యప్రబంధకవితామృతరసానుభవంబువలనఁ దాము నిత్యానందంబు నొందుటయె కాక, భావివిబుధులు పఠితలును శ్రోతలును విషయవైలక్షణ్యము నెఱింగి యుత్కృష్టపదవి నొందు మార్గము గనుఁగొందురుగాత యనియె మహర్షుల ముఖ్యోద్దేశము.

అట్టి మహానుభావు లగు ఋషిపుంగవుల గ్రంథములు కేవలము భావగర్భములును, బరోక్షమోక్షానందమును బొందించునవియు నగు

టచేఁ బ్రతిమనుజునకుఁ దొలుదొలుత సామాన్యముగా వ్రాసియుండుఁ బ్రవృత్తి గలుగుట దుర్లభము, కాఁబట్టియే ప్రాచీనులగు మహాత్ములసంప్రదాయము నెఱింగినవారు గావున నర్వాచీను లగు కాళిదాసాదిమహాకవులు సంచితము రామాయణాదికావ్యరత్నంబుల వెలుంగు దివ్యకవితారసంబుఁ గ్రోలిక్రోలి మహానందంబునొందుచుఁ దనివిసనక, యందఱు నిట్టికావ్యానందంబు ననుభవింతురుగాత మని దయాపరవశులై సులభముగ నా మహర్షికృతిరత్నంబులరసానుభవంబుఁ జేయఁదగిన యోగ్యత వలవఱుచునవియు, నించుమించుగఁ బ్రాచీనర్షికృతుల ననుకరించు రఘువంశశాకుంతలకాదంబర్యాదిప్రబంధంబుల లోకోపకారకంబులుగ రచించి, కవితారసమాధుర్యం బేకాంతంబున ననుభవించి, నిత్యతృప్తహృదయులై కీర్తిశేషులైరి.

సంస్కృతభాషావిలాస మిట్లుండ సంస్కృతజన్యము లగు కర్ణాటద్రావిడాదివైకృతదేశభాషలలోపల "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యను పండితవచనానుసరణిగ నుత్తమభాష నాఁబడు నాంధ్రభాషయందుఁగూడ ననేకులు నన్నయభట్ట తిక్కనాది మహాకవిసార్వభౌములు కావ్యరత్నంబుల లోకంబున వెలయించి యభిరూపశిఖామణులహృదయంబుల నలరించి కీర్తిశేషులై నెలకొని యున్నారు. కాఁబట్టి యిట్టి యాంధ్రభాషాకవుల దివ్యచారిత్రసుధారసమును గ్రోలి యానందానుభవము సేయుట యవశ్యకర్తవ్యమయినందునఁ, బ్రకృత మీ హారవిలాసప్రబంధనిర్మాత యగు శ్రీనాథుని చారిత్రామృత మించుక చవిచూతము.

# శ్రీనాథుఁడు

అనవద్యహృద్యకావ్యకల్పనాధురీణుం డగు మహాకవిసార్వభౌముఁడు, ఈ మహాకవి జన్మస్థానమును గుఱించి

కాశీఖండములో—

సీ. "చిన్నారిపొన్నారిచిఱుతకూఁకటినాఁడు రచియించితి మరుత్తరాట్చరిత్ర
నూనూఁగుమీసాలనూత్నయౌవనమున శాలివాహనసప్తశతి నొడివితి
సంతరించితి నిండుజవ్వనంబునయందు హర్షనైషధకావ్యమాంధ్రభాషఁ
బ్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁ గొని యాడితి భీమనాయకుని మహిమఁ

తే. ప్రాయ మింతకు మిగులఁ గైవ్రాలకుండఁ, గాశికాఖండ మనుమహాగ్రంథ మేను
దెనుఁగుఁ జేసెద గర్ణాటదేశకటక, పద్మవనహేళి శ్రీనాథభట్టకవిని."
అను పద్యమునందు "కర్ణాటదేశకటక పద్మవనహేళి" (కర్ణాటదేశపట్టణము లను కమలములకు సూర్యుఁడు) అను విశేషణమును శ్రీనాథుఁడు దనకుఁ గూర్చుకొనియున్నందునను,

భీమేశ్వరఖండములో—

గీ. "ప్రౌఢి పరికింప సంస్కృతభాషయందు, పలుకునుడికారమున నాంధ్రభాషయందు
రెవ్వరేమన్న నందురు నాకేమి కొఱఁత, నాకవిత్వంబు నిజము కర్ణాటభాష."
అను పద్యములో "నాకవిత్వంబు నిజము కర్ణాటభాష" యని తనకుఁ గర్ణాటభాషయందుఁ గల ప్రేమను సూచించి యున్నందునను,

ఆ భీమఖండములోనే—

మ. "కనకక్ష్మాధరధీరు వారిధితటీకాల్వట్టణాధీశ్వరున్
ఘనునిం బద్మపురాణసంగ్రహకళాకావ్యప్రబంధాధిపున్
వినమజ్జ్యాంతరసార్వభౌముఁ గవితావిద్యాధరుం గొల్తు నా
యనుఁగుందాతఁ బ్రదాత శ్రీకమలనాభామాత్యచూడామణిన్."
అను పద్యమునందు శ్రీనాథుని పితామహుఁడును బద్మపురాణగ్రంథ నిర్మాణాలంకర్మీణుఁడును కవితావిద్యాధురంధరుండును నగు కమలనాభామాత్యగ్రామణి పశ్చిమసముద్రతీరమునఁ గర్ణాటదేశములోఁ జేరిన *కాల్వపట్టణమునకుఁ బ్రభువుగా నున్నట్లు చెప్పియున్నందునను,

శ్రీనాథుని వీథినాటకములో

శా. "కుళ్లాయుంచితిఁ గోక సుట్టితి మహాకూర్పాసముం దొడ్గితిన్
వెల్లుల్లిన్ దిలపిష్టమున్ బిసికితిన్ విశ్వస్త వడ్డింపఁగాఁ
జల్లాయుంబలి త్రావితిన్ రుచులు దోసంబంచుఁ బోనాడితిన్
దల్లీ! కన్నడరాజ్యలక్ష్మి! దయ లేదా నేను శ్రీనాథుఁడన్."
అను పద్యమునఁ "దల్లి!" యని కర్ణాటదేశమును సంబోధించినందునను, ఈతని కవిత్వమునం బ్రాయికముగాఁ గన్నడపదములు గనఁబడుచున్నందునను,

---

* శ్రీనాథుఁడు కర్ణాటదేశస్థుఁడు కాఁడు. కాల్వపట్టణము తూర్పుతీరము నందలి కాళీపట్టణమని పెక్కండ్ర యాశయము.

శ్రీనాథునిజన్మస్థానము కర్ణాటదేశ మనుట సమంజస మనియు, నీతఁడు కర్ణాటదేశమున జన్మించినను శైశవముననే యీతని తల్లిదండ్రులుద్యోగవశముననో మఱి యేకారణముననో కొండవీటిసీమకు వచ్చియుండు రనియు, నింటిలోఁ దలిదండ్రులతో మిశ్రకర్ణాటము మాట్లాడుచున్నను బాల్యమునుండి తెలుఁగుదేశములోఁ దెలుఁగువారితోఁ గలసి మెలసి యున్నందునఁ దెలుఁగువానివలెఁ దోఁచుచున్నాఁ డనియుఁ బల్నాటివీరచరిత్రపీఠికాకారుల వాదము.

ఈ వాదమునకుఁ బ్రతికోటి ననుసరించి యాంధ్రులచరిత్ర మూఁడవభాగములో—"కర్ణాటకటకపద్మవనహేళి" అను విశేషణము కర్ణాటదేశాధీశుని (దేవరాయల) నిండోలగంబునఁ బాండిత్యశౌండీర్యంబున నుద్దండుఁ డగు డిండిమభట్టారకు నోడించి ప్రభుపండితసమ్మానపూర్వకంబుగఁ గవిసార్వభౌమబిరుదమున నలరారుటయ కాక, యక్కవిసూర్యుఁడు కర్ణాటరాజధాని (యందలి విబుధరాజి) యను కమలవనమునకు సూర్యుఁడై యుండె నను నభిప్రాయమును దనకుఁ గూర్చుకొనియెఁ గాని కర్ణాటదేశాభిమానమునం గాదనియు,

"నాకవిత్వంబు నిజము కర్ణాటభాష" అనుపద్యము రాజమహేంద్రవరాధీశుమంత్రి బెండపూఁడి యన్నయామాత్యునకుఁ గృతి యిచ్చిన భీమఖండములోనిది గాన, కోమటి వేమభూపాలుమరణానంతరము కొండవీటిరాజ్యము కర్ణాటాధీనము కాఁగా, శ్రీనాథుఁ డన్నామాత్యుబాంధవ్యమునుబట్టి రాజమహేంద్రవరమున కేతెంచి తద్రాజాస్థానకవీశ్వరుఁడుగ నున్నకాలమగుటచేఁ గాకతీయరాజ్యమంతరించినపిదప నాంధ్రదేశమున దక్షిణభాగము (పాకనాటిసీమవఱకుఁ గలదేశము) కర్ణాటరాజ్యమనఁ బరఁగుచున్నందున నచ్చటివాఁడగు శ్రీనాథుని గుఱించి రాజమహేంద్రవరపుఁగవులు కొందఱీతని కవిత్వము సంస్కృతమనియుఁ గొందఱు కన్నడమనియు వంకలుపెట్ట "నెవ్వరేమన్న నండ్రు నాకేమి కొఱఁత, నాకవిత్వంబు నిజము కర్ణాటభాష" యని యుత్తరము చెప్పియుండు ననియు,

"తల్లీ! కన్నడరాజ్యలక్ష్మీ" యను కర్ణాటదేశ మాతృసంబోధనము తన కాశ్రయులగు కొండవీటిరెడ్లు, రాజమహేంద్రవరపు రెడ్లు,

తెలుఁగురాయఁడు, మైలారెడ్డి మున్నగువారు స్వర్గస్థులయినపిదప వార్ధక్యములోఁ గన్నడరాజ్యమున కేగినప్పుడాకాలస్థితిని బట్టి వారు తన్నాదరింపకుండఁగ, "తల్లీ! దయలేదా? నేను డిండిమభట్టారకు నోడించిన శ్రీనాథుఁడ" నని తన్నేలుకపఱచుకొని యుండవచ్చు ననియు,

"కాల్పట్టణాధీశ్వరుఁ" అనుచో నా కాల్పట్టణము కర్ణాటరాజ్యములోని దైనట్లు నిదర్శనములు లేనందున నాయుక్తి విశ్వాసపాత్రము గాదనియు, నిట్లు పై కారణముల ఖండించి శ్రీనాథుఁడు పాకనాఁడు జన్మస్థానముగాఁ గల యాంధ్రుఁడని చెప్పఁబడి యున్నది.

ఈ యుభయవాద హేతువులందును బలవత్తర మగునినిగమనము కనఁబడక పోయినను మఱికొన్ని కారణములవలనను, జనశ్రుతివలనను నాంధ్రచరిత్రకారుల యభిప్రాయమే సమంజస మని తోఁచుచున్నది.

ఇద్దాని కుపబలముగా శ్రీనాథుని బంధువు లందఱు నాంధ్రదేశములోని యాంధ్రులుగనే యున్నారు కాని, కర్ణాటకుఁ డొక్కరుఁడైన నున్నట్లు తెలియఁబడదు.

నాచికేతోపాఖ్యానమును రచించి యుదయగిరిదుర్గాధీశుఁడగు చిట్టి గంగామాత్యునకుఁ గృతియిచ్చిన దగ్గుపల్లి దుగ్గయామాత్యుఁడు శ్రీనాథుని భార్యకుఁ దోఁబుట్టువు. శ్రీనాథునకుఁ శిష్యుఁడు. ఈ గ్రంథమును ఓరియంటల్ లైబ్రరిలో నేఁ జదివి యున్నాఁడను. ప్రౌఢముగా రసవంతముగానే యున్నది.

రాజమహేంద్రనాధిపతి యగు వీరభద్రభూపాలుని మంత్రి బెండపూడి యన్నామాత్యుఁడు—

"వినిపించినాఁడవు వేమభూపాలున, కఖిలపురాణవిద్యాగమములు

... ... ...

తే. "పాకనాటింటివాఁడవు బాంధవుఁడవు, కమలనాభునిమనుమఁడ వమలమతివి
నాకుఁ గృపసేయు మొక ప్రబంధంబు నీవు, కలితగుణధన్య శ్రీనాథకవివరేణ్య."

అని పలికె నని భీమఖండమున శ్రీనాథుఁడే వచించి యున్నాఁడు. ఇందు "కమలనాభునిమనుమఁడ" వనియుఁ బేర్కొనినందున, శ్రీనాథుఁడే కాక యితనితాత యగు కమలనాభుఁడు గూడ నన్నయమంత్రికిఁ జుట్టమని తేటపడుచున్నది.

మఱియు నాంధ్రభాగవతము రచించి శ్రీరామున కర్పణము సేసినభాగవతోత్తముఁడగు బమ్మెర పోతరాజునకును శ్రీనాథునకును సంబంధించిన శిష్టపరంపరాగతములగు గాథలను బట్టి చూడఁ గొన్ని గాథలు సత్యాసత్యములుగ నున్నను, వేంకటగిరివంశావళివలన సర్వజ్ఞ సింగమనాయనికాలములో నీకవులు సమకాలికులుగ నున్నట్లు తెలియుచున్నందునఁ గింవదంతి కనుకూలముగ నుభయులు బావమఱఁదులు నై యుండ వచ్చును గదా!

ఇఁకఁ గవిత్వములోఁ గన్నడపదములు ప్రాయికములుగాఁ గనఁబడుచున్న వనుటకుఁ దిక్కన సోమన మున్నగువారి కవిత్వమునఁ గూడఁ గలవు. కావున వారిం గర్ణాటు లని యనఁదగదు గదా! ఒకవేళ శ్రీనాథుఁడు కర్ణాటదేశీయుఁడై యా దేశభాషయందుఁ బ్రేమ గలిగిన వాఁడైన నెన్నియో కర్ణాటగ్రంథముల రచింప కుండునా! ఏదీ యొక పద్యమయినం గానరాదే?

ఇంతియ కాక యీతనితాత కమలనాభుఁడు పద్మపురాణము దెలిఁగించె ననుటవలన నీతనివంశ మాంధ్రవంశ మనియు, నితని దేశభాష లాంధ్రదేశభాష లనియును దృఢపడుచున్నవి. తద్జ్ఞులు ప్రమాణము. శ్రీనాథుఁడాంధ్రకర్ణాటులలో నెవ్వండైనను గవితామాధురికి లోపము గల్గదు గదా!

శ్రీనాథుఁడు పాకనాటి నియోగిబ్రాహ్మణుఁడు, భారద్వాజసగోత్రుఁడు, అపస్తంబసూత్రుఁడు, కమలనాభునిపౌత్రుఁడు, మారనకు భీమనకుఁ బుత్రుఁడు. ఈ విషయము హరవిలాసము పీఠికలోని "కమలనాభునిపౌత్రు" అను ౮-వ పద్యమువలన స్పష్టము.

ఇక్కవిసార్వభౌమునివలననే కొండవీటిరెడ్లు, రాజమహేంద్రవరపురెడ్లు వన్నెకెక్కిరి. ఈ కవీంద్రుఁడు జీవించి యుండుకాలముం గుఱించి విచారణీయాంశము లనేకము లున్నను విస్తరభీతిచే సంగ్రహముగ వివరించెద.

శ్రీనాథుఁడు క్రీ. శ. 1397 సం. మొ. 1412 సం. వఱకు రాజ్యము చేసిన ఫిరోజిషా కాలమునను, 1382 సం. మొ. 1399 సం. వఱకు రాజ్యమొనర్చిన కుమారగిరి వసంతభూపాలుకాలమునను, 1379 సం.

మొ. 1401 సం. వఱకు కర్ణాటసింహాసనాధిష్ఠితుఁడైన హరిహర రాయలకాలమునను, 1422 సం. మొ. 1435 సం. వఱకు కల్బరిగి రాజ్యమును బాలించిన యహమ్మదుషాకాలమునను, అల్లాడభూపతి పుత్రులును, 1426 సం. మొ. 1450 సం. వఱకు రాజ్యముఁ బాలించిన వేమారెడ్డి వీరభద్రారెడ్లకాలమున నున్న ట్టీకవి గ్రంథములవలనఁ దెలియుచున్నది. ఈ వీరభద్రారెడ్డియు వేమారెడ్డియు మరణించిన పిదపఁ గొంతకాలమునకుఁ గృష్ణాతీరములోని బొడ్డుపల్లె యనునొక గ్రామమును గుత్తచేసి నదీప్రవాహమునఁ బైరుగొట్టుకొనిపోఁగా, రాజునకు గుత్తధనముఁ జెల్లింపలేక వారిచేఁ బలుబాధల నొంది యవసానకాలమున మిక్కిలి బీదతన మనుభవించె నని మెకన్జీదొర యుదాహరించిన స్థానికచరిత్రలోని శ్రీనాథకృతము లగు నీ రెండు పద్యములవలనఁ దెల్లమగుచున్నది.

సీ. "కవిరాజుకంఠంబుఁ గౌఁగిలించెను గదా పురవీథి నెదురెండ బొగడదండ
సార్వభౌమునిభుజాస్తంభ మెక్కెను గదా నగరివాకిట నుండు నల్లగుండు
ఆంధ్రనైషధకర్తయంఘ్రియుగ్మమునఁ దగిలి యుండెను గదా నిగళయుగము
వీరభద్రారెడ్డివిద్వాంసుముంజేత వియ్యమందెను గదా వెదురుగొడియ
తే. కృష్ణవేణమ్మ కొనిపోయె నింతఫలము, బిలబిలాక్షులు దినిపోయెఁ దిలలు పెసలు
బొడ్డుపల్లెను గొడ్డేఱి మోసపోతి, నెట్లు చెల్లింతుఁ డంకంబు లేడు నూర్లు.
సీ. కాశికావిశ్వేశుఁ గలిసె వీరారెడ్డి రత్నాంబరంబు లేరాయఁ డిచ్చుఁ
గైలాసగిరిఁ బండె మైలారువిభుఁ డేగి దినవెచ్చ మేరాజు తీర్పఁగలఁడు
రంభఁ గూడెఁ దెనుంగురాయరాహుత్తుండు కస్తురి కేరాజుఁ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁ డయ్యె విస్సనమంత్రి మఱి హేమపాత్రాన్న మెవ్వనిపంక్తిఁ గలదు
తే. భాస్కరుండు మున్నె దేవునిపాలికరిగెఁ, గలియుగంబున నికనుండఁ గష్టమనుచు
దివిజకవివరుగుండియల్ దిగ్గురనఁగ, నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి."

పై కారణములఁబట్టి శ్రీనాథుఁడు క్రీ. శ. 1384 సం. ప్రాంతమున జన్మించి 1455, సం. ప్రాంతమువఱకు 70 సంవత్సరములు జీవించి యుండవచ్చు నని యూహింపవలసియున్నది—

మహారాజాస్థానములఁ గవిసార్వభౌముఁడై మహాభోగముల ననుభవించినవాఁడయ్యును నవసానదశయందుఁ బలుకష్టములపా లగుట యౌవనదశలో శృంగారనాయకుఁ డయి స్త్రీలోలుఁడై విశృంఖల

ప్రవృత్తిచే ధనమెల్ల వెచ్చపెట్టి దేహమును సైతము చెఱుచుకొన్న పాపఫలముగాని యన్యముగాదని కొంద అందురు.

శ్రీనాథుఁడు లాక్షణికోత్తముఁ డగుమహాకవి. ఈకవి బ్రహ్మా కావ్యప్రపంచకల్పనాచాతుర్య మవాఙ్మానసగోచరము. వర్ణనాసందర్భముల నర్థగంభీరము లగు మృదుపదములఁ బొందుపఱచి రసమును విడనాడక మనోహరంబుగఁ గవనమల్లు ననల్పకౌశల మీతని కలవడినట్లు మఱియొక్కకవి కలవడ లేదు. 'కాశీఖండ మయఃపిండం నైషధం విద్వదౌషధమ్' అని కొనియాడఁబడు నీరెండుగ్రంథముల భాషాంతరీకరణమువలననే యీకవిపాండిత్య మనర్గళ మని తెల్లము కాఁగలదు. ఈతనికవిత్వము మొత్తముమీఁద సంస్కృతపదభూయిష్ఠమై మనోహరమై యుండును. లోకములో నాంధ్రభాషాసాహిత్యఁ బడయఁగోరు విద్యార్థులు శ్రీనాథునిగ్రంథములఁ జక్కఁగఁ జదివిన మఱియొక గ్రంథముఁ జదువవలసిన పని యుండ దనిరే నా నమ్మకము.

ఇతఁడు మహాకవియై యుండియుఁ బారలౌకికచింతమై భగవంతున కొక కృతియైన నీయక, తనగ్రంథము లన్నియు నర్థలోభమున మనుజుల కిచ్చుట చూడ నెంతయు విచిత్రముగ నున్నది,

ఈయన పండితారాధ్యచరిత్ర, మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి, శృంగారనైషధము, భీమఖండము, కాశీఖండము, హరవిలాసము, నందనందనశతకము—అనుగ్రంథముల రచించి జగద్విఖ్యాతిఁ బడసెను. ఇతఁడు పల్నాటివీరచరిత్రముసుగూడ రచించినట్లు చెప్పఁబడి యున్నది. కాని ప్రాసము లేనియట్టి తక్కిరిబిక్కిరి ద్విపదకవిత్వ మల్లి యుండునా యని సంశయము. ఉండిన నుండుఁగాక. వీథినాటకము గూడ నీ కత్యలోనిదే.

ఈగ్రంథములలోఁ బండితారాధ్యచరిత్రమును వేమారెడ్డిసేనానాయకుఁడగు మామిడి ప్రెగడయ్యకును, నైషధము నాతని తమ్ముఁడగు సింగనమంత్రికిని, భీమేశ్వరఖండమును వీరభద్రారెడ్డి మంత్రి యగు బెండపూఁడి యన్నయ్యకును, కాశీఖండమును వీరభద్రారెడ్డికి నంకితము చేసెను. ఈగ్రంథముల పౌర్వాపర్యమును విచారించి కాశీఖండములోని

'చిన్నారి పొన్నారి చిఱుతకూఁకటినాఁడు, రచియించితి మరుత్తరాట్చరిత్ర' అను పద్యమువలనను, శృంగారనైషధములోని—

క. "జగము నుతింపఁగఁ జెప్పితి, ప్రెగడయ్యకు నాయనుంగుఁ బెద్దనకున్ గృతుల్
నిగమార్థ సారసంగ్రహ, మగు నారాధ్యచరితమాదిగఁ బెక్కుల్"

అను పద్యమువలనను జిన్నప్పాటినుండి మహాకవియై 18 సం. వయస్సున మరుత్తరాట్చరిత్రయు, 20 సం. న శాలివాహనసప్తశతియు, 24 సం. న పండితారాధ్యచరిత్రయు, 30-35 సం. ల శృంగారనైషధమును, 40 సం. న భీమఖండమును, 44 సం. న కాశీఖండమును రచించియుండు నని తోఁచుచున్నది.

# హా ర వి లా స ము

ఇది 7 ఆశ్వాసముల ప్రబంధము. పై గ్రంథములలో నెయ్యెడ నిది పేర్కొనఁబడనందునఁ గాశీకాఖండమునకుఁ బిదప రచింపఁబడె నన వలసియున్నది. అన్ని గ్రంథములకన్న స్వాభావిక మగు కవితాశైలియు నీ విషయమునే బలపఱుచుచున్నది. ఇయ్యది క్రీ. శ. 1380సం. మొ. 1391సం. వఱకుఁ గొండవీటిసీరుఁ బాలించిన వేమారెడ్డి కాలములో బాల్యుఁడై వేమారెడ్డి పుత్త్రుం డనపోతరెడ్డి సేనాధిపతియై యుద్ధములో మడియుటచే నాతని యనంతరము నసే రాజ్యమునకు వచ్చిన కొమరగిరి భూపాలుని సుగంధద్రవ్యభాండాగారాధ్యక్షుఁడైన యవచి తిప్పసెట్టి కంకిత మీఁబడినది. హారవిలాసములో నీతఁడు 'మంటి బహువత్సరంబులు' అని చెప్పుకొనుటచేఁ గృతినందునాఁటికి 65 సం. వయసువాఁడై యుండును. ఇతనికి బాల్యసఖుఁ డగు శ్రీనాథుఁడును 50 సం. వయసు వాఁడై యుండును.

తిప్పసెట్టి వైశ్యుఁడు (బెరిసెట్టి); తండ్రి దేవయసెట్టి; తల్లి మాచమ్మ. జామిసెట్టి, తిరుమలనాథసెట్టియుఁ దమ్ములు. భార్య అన్నమ్మ. మాచన, విశ్వనాథుఁడు, చినమల్లన కుమారులు. ఇతనికిఁ ద్రిపురారి యను సంస్కృతనామము గలదు. ఈతని వంశచరిత్రమంతయు హార విలాస పీఠికవలనం దేటపడుచున్నది.

ఈ కావ్యమునందు 1, 2 ఆశ్వాసముల సిరియాళచరిత్రమును, 3, 4 ఆ. గౌరీకళ్యాణమును, 5-వ ఆ. పార్వతీపరమేశ్వరులదారుకా విహారంబును, 6-వ ఆ. హాలాహలభక్షణంబును, 7-వ ఆ. కిరాతార్జు

నీయమును వర్ణింపఁబడినవి. 5-వ యాశ్వాసము తుదిఁ గొన్ని పద్యము లశ్లీలము లుగ నుండుటచే విడువంబడినవి. పూర్వకవిసంప్రదాయాను సారముగ నితరగ్రంథముల నుభయభాషాకవిస్తుతి చేయఁబడియున్నను నిందుఁ గవిస్తుతి కాని కుకవినింద గాని చేయఁబడమికి కారణము దెలి యదు. ఇయ్యది నైషధాదులవలె సంస్కృతపదప్రచురము గాక సమ సంస్కృతాంధ్రపదవిలసితమై రసభావాలంకృతంబై యలరారుచున్నది. నైషధ, కాశీఖండములవలె సంపూర్ణసంస్కృతగ్రంథభాషాంతరీకరణము గాదు కాని యిందలి గౌరీకల్యాణము కాళిదాస కుమారసంభవమున కాంధ్రీకరణముగానే యున్నది. స్థాలీపులాకన్యాయంబుగ నుదా హరించెద.

శ్లో. "తా మేకపత్నీవ్రతదుఃఖశీలాం లోలం మనశ్చారుతయా ప్రవిష్టామ్,
నితంబినీ మిచ్ఛసి ముక్తలజ్జాం కంఠేస్వయంగ్రాహనిషక్తబాహుమ్.
కుమా. సర్గ-3-శ్లో. 7.

తే. ఏకభర్తృవ్రతస్థయై యేలతాంగి, నీకుఁ జేయాడుధర్మంబు నిలువరించె
నెది వినిర్ముక్తలజ్జయై యమరరాజుఁ, జేయుఁ గాత స్వయంగ్రహాశ్లేషణంబు.
హర. ఆ-3. ప-45.

శ్లో. కయాఽపి కామిన్ సురతాపరాధా త్పాదానతః కోపనయాఽవధూతః,
తస్యాః కరిష్యామి దృఢానుతాపం ప్రవాళశయ్యాశరణం శరీరమ్.
కుమార. సర్గ-3. శ్లో-8.

తే. ప్రణయకోపప్రశాంతికై పాదపతితు, నిన్ను నేపువుఁబోఁడి మన్నింపదయ్యె
నాలతాంగిఁ బ్రవాళశయ్యా శరణ్య, దేహఁ గావింతు విడువు సందేహ మింద్ర.
హర. ఆ-3. ప-46.

శ్లో. "స్థితాః క్షణం పక్ష్మసు తాడితాధరాః పయోధరోత్సేధనిపాతచూర్ణితాః,
వలీషు తస్యాః స్ఖలితాః ప్రపేదిరే చిరేణ నాభిం ప్రథమోదబిందవః.
కుమార. సర్గ-5. శ్లో-24.

వ. వర్షాకాలంబునఁ బక్ష్మపాలీక్షణస్థితంబులును దాడితాధరంబులును బయోధరో త్సేధనిపాతచూర్ణితంబులును ద్రివళీవలయస్ఖలితంబులును నాభిగహ్వరప్రణష్టం బులునగు జలధరజలబిందుధారలం దోఁగియు. హర. ఆ-4. ప-14.

శ్లో. దివం యది ప్రార్థయసే వృథా శ్రమః పితుః ప్రదేశా స్తవ దేవభూమయః,
అథోపయంతార మలం సమాధినా న రత్నమన్విష్యతి మృగ్యతే హి తత్.
కుమార. సర్గ-5. శ్లో-4. 5

వ. దేవలోకనివాసంబున కాసపడెదేని వృథాశ్రమంబు. నీపుట్టినిల్లు దేవభూమియ కదా! తగినవరునిం గామించి సమాధివహించితి వేని నదియు నీకుం దగదు. రత్నం బోరునిచే నన్వేషింపబడుఁగాని యొరు నన్వేషించునే.' హర. ఆ. 5. ప-25.

ఇట్లే దారుకావనవిహారము, హాలాహలభక్షణము, కిరాతార్జునీయము ప్రాయికముగా భారవికృతినుండియుఁ దక్కినకథలు పురాణములనుండియు గ్రహింపఁబడినవి. అచ్చటచ్చట నౌచితికిఁ దగినట్లు 'చంక దుడ్డును శరణార్థి,' (ఆ-6. ప-19.) మున్నగులోకోక్తుల నిమిడ్చియున్నాఁడు. చాగు, ఉక్కెవడి, గగ్గోడువడు, చాయగోసులు, కుండవర్ధనములు, తోరహత్తము, గజ్జులాఁడు మున్నగు క్రొత్త పదములఁ జెక్కంటిఁ బ్రయోగించియున్నాఁడు. 'వాగ్వివాదము. (ఆ. 4. ప-10.) అంతర్వాణిసంస్తూయమాన, (పీఠిక ప. 34)' యనుప్రమాదికప్రయోగములు కనఁబడుచున్నవి. 6-వ ఆశ్వాసము 5, 6 పద్యము లేకార్థబోధకములై పునరుక్తములుగ నున్నవి.

ఇట్లే దోషము లున్నను నల్పజ్ఞు లగు లేఖకులవిగానె యుండును గాని, సకలశాస్త్రపారంగతుఁడును మహాకవిసార్వభౌముఁ డగు శ్రీనాథునివై యుండవు. ఇట్టి జగత్ప్రసిద్ధంబగు ప్రౌఢపండితకవికవితానుతల్లిం గుఱించి శాఖాచంక్రమణ మనవసరంబ కాఁ దలంచి యింతటితో విరమించుచున్నాఁడను.

శ్రీమాన్ ఉత్పల వేంకటనరసింహాచార్యులు.

## విజ్ఞప్తి

ఈ ప్రబంధ మిదివఱకు పలువురిచేఁ బలుసార్లు ప్రకటింపఁబడినది. మేమును రెండుసార్లు ప్రకటించితిమి. ఈసారి ప్రకటించునపుడు పాఠకుల సౌకర్యమునకై సుప్రసిద్ధవిద్వాంసులు శ్రీబులుసు - వేంకటరమణయ్యగారి లఘుటీకతోఁ గూడి ప్రకటించుచున్నాము. భాషాభిమానుల ప్రోత్సాహమున్నచో నింక ముందు నిట్లు టీకలతోఁ బ్రబంధములను ప్రకటింపఁగల మని మనవిచేయుచున్నాము.

ప్రకాశకులు.

# అనుకరణములు



## ప్రథమాశ్వాసము

క. కరుణింపు సమాశ్రితభయహరణ!... కథాప్రారంభము. (1-6)

క. కరుణింపుము సంశ్రయభయ, హరణధురీణా... భార. ఉద్యోగ. (3-408)

## తృతీయాశ్వాసము

మారేడుపండ్ల గారాముఁ జెఱుచు, మెఱుఁగు గుబ్బయిఱుచన్నులును. (3-23)

మారేడుపండుల గారాము సెఱచు, నీ, యొలచన్నుఁగవ వేడుకల నొనర్చె.

భార. అనుశా. (1-50)

ఆమని యేడ్చె నా వఱచినట్లు. (3-83)

ఆ వఱచిన ట్లఱచెన్... భార. ఆది. (6-168)

ఐరావణకుంభికుంభస్ఫాలనకర్కశం బగుకరంబున. (3-53)

పీవై రావణకుంభాస్ఫాలనకర్కశకరము ల. ఆరణ్య. (1-356)

ఉ. భాగ్యముగాదె యశ్రమమ పన్నగకంకణుచేఁ దపఃక్రియా
యోగ్యతఁజేసి విశ్వభువనోపకృతి ప్రతిపాదనైకసౌ
భాగ్యధురంధరం బయిన పాశుపతాస్త్రము గాంచి తింక వై
రాగ్యము పుట్టుఁగాక కురురాజుపయి న్నిజరాజ్యలక్ష్మికిన్. (7-106)

ఉ. భాగ్యము గాదె కౌరవనృపాలభవన్ముఖమిష్టసత్క్రియా
యోగ్యత నిర్వికల్పముగ నొందె సమాప్తినశేషధాత్రియుఁ
భోగ్యము నీకు నింక రణభూమిఁ బృథాసుతులన్ జయించి స
మ్యగ్యమశాలివై భువనమాన్యయొనర్పుము రాజసూయమున్.

ఎఱ్ఱాప్రెగడ భా. ఆ. (6-92)

ఉ. ఏనును బ్రహ్మచారిఁ దరళేక్షణ! నీవును గన్యవింతకా
లానకు నీకుఁ బెండ్లియ ఫలం బగునేని విచార మేల స
స్నానముతోడ నన్ను మునిమాన్యవివాహము గమ్ము లెమ్ము కా
దేనిఁ దపంబులోని సగ మిచ్చెద మాను తపోభిమానమున్. (4-25)

ఉ. నీవును బ్రహ్మచారివి వినీతుఁడ వేను కన్యకన్ మహా
దేవకులావతంస రవితేజ వివాహము నీకు నాకు మున్
భావజశక్తి నైనయది పన్నుగ నన్నుఁ బరిగ్రహింపు సం
జీవనితోడ శుక్రు దయఁ జేగొనుము నాకుఁ బ్రియంబు నావుడున్.
(ఆది. 3 ఆ. 129 ప.)

## పంచమాశ్వాసము

ఉ. ఎంచి నుతింప శక్యమె...శితశైలమున్. (22 ప.)

ఈపద్యము పినవీరన శృంగారశాకుంతలమున మార్పులేక యున్నది.

సీ. తని పండ్లరసమాని తమలోనఁ జెలఁగుచుఁ
[తనిపండ్లు బాగుగాపండిన పండ్లు.] (47 ప.)

బలికెడురాచిల్క పదువురంగు. భార. అను. (1-181.)

వ్రాఁతప్రతిలో నాశ్వాసాంతభాగ మిట్లున్నది.

వ. ఇట్లు పరమధూర్తవర్తనంబునం బ్రవర్తిల్లు నయ్యష్టమూర్తి యిష్టాపూర్తధర్మకర్మాధ్యు లగునమ్మతపతులు......కట్టినకౌపీనంబు దలంగవైచి ప్రాచీనబర్హిఃకుంభికుంభాదండసన్నిభం బైన మదనధ్వజదండంబు నిగుడించి, యమ్మహనీయసాధనంబున నమ్మహీసురోత్తముల యుత్తమాంగంబు...మెడకడఁత అడంచియుఁ, జెవుల కొడంకలొత్తియు మొగంబులు...ముక్కులు నొక్కియు, బరులువ్రేసియు వీపులు చఱచియుఁ, బండ్లురాల్చియు, నురంబులుతాఁచియుఁ, ద్రికంబులు దాకించియు, జంఘలు పొడిచియు, జానువులు తాటించియు, బడలువఱచియుఁ దోలి తోప్పుఱం బెట్టి యార్చి, పేర్చి యమ్మహాలింగంబు నింగి దాఁకం బెరిగించి నక్షత్రమండలం బను ముత్యాలగొడుగునకుం బసిఁడికామ భంగి నంగీకరింపఁజేసి సోమార్కమయమహాసోపానంబుల డిగ్గువియద్గంగాప్రవాహంబున నభిషేకం బాపాదించి, బ్రహ్మాండకర్పరం బప్పళింపఁజేసిన.

క. సురగరుడఖచరవిద్యా, ధరకిన్నరసిద్ధసాధ్యదానవముఖ్యుల్
పురహరుఁడు చాఁచిపట్టిన, యురులింగంబునకు మ్రొక్కి యుపచితభక్తిన్.

వ. సంస్తుతింపఁ దొడంగి రప్పుడు, బ్రహ్మ బ్రహ్మలోకంబునకు నిగిడిన యమ్మహాలింగంబునకుం గరకమండలంబు తీర్థంబు వారిధారాసహస్రంబుల నభిషేకం బాపాదించి గంధపుష్పధూపదీపనైవేద్య......ద్యుపచారంబుల నుపాసించి ......కంబుగా నిట్లని స్తుతియించె.

జయ జయ శివలింగ జ్యోతిర్మహాలింగ లింగోద్భవ శ్రీమహాలింగ వేదత్రయీలింగ నిర్లింగ సంస్ప...గ క్షమాలింగ సద్భావలింగ స్వభావైకలింగ ...కాలవ్యవచ్ఛేద రాహిత్య లింగస్వయంభూమహాలింగ పాతాళలింగ క్రియాలింగ పంచాక్షరీలింగ పంచప్రకాశోపదీప క్రియాలింగ వారాణసీక్షేత్ర సింధూగయా......న శోణాచల వ్యాఘ్రపుర్యాదినానావిధస్థానసం సిద్ధలింగ ప్రమాణాప్రమేయప్రథాలింగవిద్యాకళాలింగ షట్తర్కలింగాగమామ్నాయలింగా ప్రతిష్ఠాకళాలింగమూ...కోణత్రయీ గేహ గేహ ప్రథాలేఖికాన్యూతి నిధ్యానవట్ప్రష్కరీ నిమ్నటంక్రోడవిష్కంభ నిష్కంపశంపాలతా లంఘిత బ్రహ్మరంధ్రప్రవచ్చాంద్రసాంద్రామృత స్యందనస్పందితానంద లింగాదిమధ్యాంత శూన్యస్వరూపాభిధాలింగ ఖట్వాంగలిం గాహిలింగాభ్ర గంగాసరిల్లింగ సారంగలింగాత్మభూలింగ, ఐంలింగ ఈంలింగ ఓంలింగ దివ్యాత్మ నానావిరూపాత్మలింగ నమస్తే నమస్తే నమః.

క. అని సంస్తుతించె వెండియు, వనరుహసంభవుండు దాను వాగ్భామినియుఁ
గనకారవిందముల న,ర్చనసేసిరి నీలగళుని సాధనమునవన్.

వ. ఇట్లు పూజించి విరించి కరకమలంబులు మొగిడ్చి యి ట్లనియె.

సీ. ఉపసంహరింపుము త్రిపురదైత్యధ్వంస! యూర్ధ్వాండకర్పరం బొలయకుండ
బింకం బడంపుము సంకల్పసంసిద్ధ! యుడువీథి గగ్గోడుపడకయుండ
బిరుసుమాన్పుము జలంధరదైత్యమర్దన! యేడుగాడుపులు బిట్టెరియకుండ
దర్పంబు సడలింపు తరుణేందుశేఖర! యొరసి యాశాభిత్తు లురలకుండ

తే. తివియుశర్వ! మహాదేవ! ధిక్కరింపు, ముడుపుమహిరాజకంకణ! యడఁపురుద్ర!
వాల్పు ఖట్వాంగపాణి! వదల్పు యభవ!, మోహనం బైన నీమహామోహనంబు,

చ. అనినఁ బ్రసన్నుఁడై కహకహధ్వని నవ్వి లలాటనేత్రుఁ డి
ట్లని భువనంబులెల్ల వినునట్లుగ నోపరమర్షులార! యో
యనిమిషులార! తక్కఁగల యట్టిసురాసురులార! మీకు నా
యనుపమదివ్యలింగ మిది యర్చన కర్హము నేఁట నుండియున్.

క. లింగార్చనాపరుఁ డగు, మంగళహృదయునకు నేను మక్కువతోడన్
సాంగత్యముఁ గృపసేయుదు, నంగీకృత...తి...తోన్.

వ. అని శంభుండు నిఖిలబ్రహ్మాండసంభారభక్తింభరి యగునిజమహాలింగ స్తంభంబు స్తంభింపఁజేసె నప్పుడు ముకుళితహస్తారవిందులై దేవదారువనదివ్యాశ్రమస్థ

అనుగ్రహాస్థ లీర్ష్యాదోషంబు లుజ్జగించి యాశేషాహిభూషణుని బహువిధంబుల భక్తివిశేషంబుల భజియించిరి. భోగమోక్షంబులు గాంచిరి. ఇద్దేవవారు వనవిహారంబు వ్రాసినఁ బఠియించిన విన్నను వర్ణించినను నభినందించినను జనులకు నభీప్సితార్థసిద్ధి యగు.

## షష్ఠాశ్వాసము

వికటభ్రూకుటిఫాలభాగుఁడును బ్రస్వేదాంబుపూర్ణాఖిలాంగకుఁడున్.(6-16)
వికటభ్రూకుటి ఘోరఫాలఘటితస్వేదోద్భవుండున్. భార. విరా. (3-24)

## సప్తమాశ్వాసము

క. వైరిమదకుంభికుంభవి, దారణదారుణకృపాణధారలు. (7-18)
క. ఘోరారిమదకుంభికుంభవి, దారణదారుణకృపాణదక్షిణహస్తా.
భా. అరణ్య. (2-1)
క. మండెడు బలునారసమున, గుండియపగులంగ... (7-54)
క. మండెడు బలునారసమున, వెండియు నారజ్జులాని... భార. ద్రోణ. (4-245)
ఆ. తాటి యంతవిల్లు ధరియించినాఁడవు. (7-62)
తాటి యంతవిల్లు... భార. కర్ణ. (8-61)
క. శరధులు యుగాంతవేళా, శరధులునుంబోలి నయ్యె... (7-74)
క. నా కిచ్చిన యక్షయశరధు లిప్పుడు యుగాంతకాలరిక్తంబు లైన
శరధులుంబోలె నున్నయవి. భార. అరణ్య. (1-35)
వ. విశాలలవలీలవంగలుంగలతాలాస్యవిభవంబును. (7-155)
మ. లవలీలుంగలవంగసంగతలతాలాస్యంబు వీక్షించుచున్. భార. ఆది. (1-30)
ఉ. ద్రోణుఁడు భీష్ముఁడున్ గృపుడు ద్రోణసుతుండును గర్ణుఁడున్ రణక్షోణి.
(7-191)
ఉ. ద్రోణుఁడు, కర్ణుఁడున్ గృపుఁడు ద్రోణసుతుండును. భార. ద్రోణ. (5-23)



శ్రీరస్తు

# హరవిలాసము



## పీఠిక




మహిళాపయోధరహరిన్మణిహారము హస్తిభూధర
స్వామి పయోజసంభవునిజన్నముఁ గాచినవేల్పు దేవతా
గ్రామణి కంచిశ్రీవరదరాజు మనోహరపుణ్యకోటిపీ
ఠీమణిమండితుం డవచి దేవయతిప్పఁ గృతార్థుఁ జేయుతన్. 1

ఉ. మావిడిమోకక్రింద నిగమత్రితయార్థసమృద్ధి పార్వతీ
దేవికుచంబులం బదనుదీర్పని కస్తురిముద్ర గా జగ
జ్జీవనకారణం బయినశ్రీనిధి కంచిపురీశ్వరుండు మా
దేవయసెట్టినందనునిఁ దిప్పఁ గృతార్థునిఁ జేయుఁ గావుతన్. 2

సీ. ఏదేవితుఱుముపై నేఁడుగాలముదాఁకఁ గసుగందకుండుఁ జెంగలువదండ
యేదేవి సేవింతు రేకామ్రనాథుండుఁ గరిగిరీశ్వరుఁడు కింకరులువోలె
నేదేవిమణిదివ్యపాదుకాయుగళంబుఁ బాతాళపతి మోముఁ బడగలందు
నేదేవిఁ గొల్చి మత్స్యేంద్రనాథాదులు యోగసంసిద్ధికి నొడయు లైరి
తే. యమ్మహాదేవి కామాక్షి యఖిలవంద్య, దేవతాదిమశక్తి సందీప్తమూర్తి
యవచిదేవయత్రిపురారి కర్థి నొసఁగు, భాగ్యసౌభాగ్యవైభవప్రాభవములు. 3

క. వాణికిఁ జరణానతగీ, ర్వాణికి నేణాంక శకలరత్నశలాకా
వేణికిఁ బుస్తకవీణా, పాణికి సద్భక్తితో నుపాస్తి యొనర్తున్. 4

సీ. కలితశుండాదండగండూషితోన్ముక్త సప్తసాగరమహాజలధరములు
వప్రక్రియాకేళివశవికీర్ణ సువర్ణమేదినీధరరత్నమేఖలములు
పక్వజంబూఫలప్రకటసంభావనాచుంబితభూభృత్కదంబకములు
వికటకండూలగండకదేహమండలీఘట్టితబ్రహ్మాండకర్పరములు

---

సర్వ ల. తి. పా. (శబ్దప్రకరణము)

తే. శాంభవీశంభులోచనోత్సవకరములు, వాసవాద్యమృతాశనవందితములు
విఘ్నరాజమదోల్లాసవిభ్రమములు, మించి విఘ్నోపశాంతిఁ గావించుఁ గాత. ౬

సీ. వేదండవదనశుండాదండగండూషకాండసిక్తాప్సరోమండలములు
కంఠావలంబితకనకసౌగంధికమాలికాలగ్నషాణ్మాతురములు
నందీశ్వరక్షిప్తనారంగఫలపాకతరళవిద్యాధరీస్తనభరములు
గరుడలీలావతీకస్తూరికాపంకపిహితనిశ్శేషాంగభృంగిరిటులు

తే. వీరభద్రవితీర్ణకర్పూరచూర్ణ, ధవళితాకాశచరవనితాముఖములు
శాంభవీశంభుమధుకేళిసంభ్రమములు, పాదలి వాసించుగాఁత నాహృదయవీథి.

వ. అని ప్రార్థించి త్రిపురాంతకదేవదివ్యశ్రీపాదపద్మారాధకుండును బరమసాధకుం డును గమలభవోరుసంభవవిమలవంశావతారుండును ధర్మద్రావిడబిరుదాధారుం డును సుజనవిధేయుండును గర్పూరవసంతరాయుండును గీర్తివనితావల్లభుం డును బ్రతిదినసమారాధితపరమేశ్వరుండును మాణిక్యసింహాసనాధీశ్వరుండును నంగీకృతభూసురాశీర్వాదుండును దానధర్మపరాయణుండును నిమ్మడిగరుడ నారాయణుండును నిజకీర్తిశాసనస్తంభాయమానదిగంతదంతావళదంతుండును నభయద్రావిళుండును గిష్కింధాచలక్రీడావినోదుండును వశీకృతనిఖిలభూభు జుండును సతతత్యాగధ్వజుండును వినిర్మలకులశీలుండును బాండ్యరాయకందుక క్రీడావిలోలుండును గవిజనస్తోత్రపాత్రుండును గౌండిన్యగోత్రపవిత్రుం డును జతుష్షష్టివిద్యాజన్మభూమియు నయోధ్యానగరస్వామియో యనఁ బరఁగి జంబూద్వీపభూభువనమండలీమకుటమండనాయమానంబగు కొండవీడుపురంబు రాజధానిగాఁ గీర్తిలతాధిష్ఠితాష్టాదశద్వీపాంతరాళుండు నగు కోమరగిరివసంత నృపాలువలన నాందోళికాఛత్రచామరతురంగాదిరాజ్యచిహ్నములు వడసి యమ్మహారాజునకుం బ్రతిసంవత్సరోత్సవంబునకుం దగిన కస్తూరీకుంకుమఘన సార సంకుమదహిమాంబు కాలాగురుగంధసారప్రభృతి సుగంధద్రవ్యంబు లొడఁగూర్చియుఁ జీని సింహాళ తవాయి హురుమంజి జలనోగిప్రభృతి నానా ద్వీపనగరాకరంబులగు ధనకనకవస్తువాహనమాణిక్యగాణిక్యంబులు తెప్పిం చియుఁ గవిగమకివాది వాంశికవైతాళికాదు లగునర్థిజనంబులకు నర్థంబులు గుప్పించియు ధీరుండును నుదారుండును గంభీరుండును సదాచారుండును నన విఖ్యాతిగాంచిన యవచిదేవయతిప్పప్రభుండు డొక్కనాఁ డాస్థానమంటపం బున సుఖోపవిష్టుండై. 7

సీ. కమలనాభునిపౌత్త్రుఁ గవితామహారాజ్యభద్రాసనారూఢుఁ బరమపుణ్యుఁ
బౌత్రు నాపస్తంబసూత్రు భారద్వాజగోత్రు సజ్జనమిత్రుఁ గులపవిత్రు

ధీమాంబికామారనామాత్యనందను నఖిలపురాణవిద్యాప్రవీణు
నధ్వర్యువేదశాఖాతిథినిష్ణాతు నంధ్రభాషానైషధాబ్జభవుని
తే. నుభయభాషాకవిత్వప్రయోగకుశలు, బాలసఖు గారవించి తాత్పర్య మొప్ప
నవచిదేవయత్రిపురారి యశ్వరాజు, హితమితోక్తులఁ బెలయఁగ నిట్టు లనియె. 8

క. కంటిని విశుద్ధసంతతి, వింటిఁ బురాణములు పెక్కు విశ్వము పొగడఁగ
మంటి బహువత్సరంబులు, గొంటియశోధనము సుకవికోటి నుతింపన్. 9

సీ. కట్టించె నొకతాత కంచి హర్మ్యంబులు హరిణాంకమౌళి కేకామ్రపతికి
బాలార్కు మనియెడి పద్మరాగముఁ దాచె నొకతాత కంచినాయకుని నాభి
నొకతాత గట్టించె యోజనత్రయుదీర్ఘతరతటాకాంభోధి తిరువళూరఁ
గావేరిఁ గట్టించెఁ గార్పాసరాసుల నుబ్బి చోడఁడు మెచ్చ నొక్కతాత
తే. ప్రతిదినమ్ముఁగ పురపుదీపములు వేయు, వ్రతముగా నొక్కతాతయీశ్వరునకొసఁగె
నిఖిలలోకప్రసిద్ధవాణిజ్యవంశ, ధరులు మా తాత లుభయగోత్రములయందు. 10

తే. శైవవైష్ణవసమయదీక్షావిశేష, ధన్యమానసు లుభయగోత్రముల వారు
నాయభీష్టం బొకఁడు పిన్ననాఁటనుండి, పరమమాహేశ్వరాచారభక్తిపథము.

తే. ఆగమజ్ఞాననిధివి తత్త్వార్థఖనివి, బహుపురాణజ్ఞుఁడవు శుభభవ్యమతివి
బాలసఖుఁడవు శైవప్రబంధ మొకటి, యవధరింపుము నాపేర నంకితముగ.

వ. అనిన నేనును శుభముహూర్తమున నిజాంతరంగమంగళాయతనకుమారాచల
త్రిపురాంతకుం డవచిదేవయ త్రిపురారి కృతిసామిగా హరవిలాసం బను
ప్రబంధంబు సెప్పం దొడంగి యమ్మహాప్రబంధముఖతిలకాయమానం బగు
తదీయవంశం బభివర్ణించెద. 13

సీ. ముయ్యేడువాసరంబు లకాలవర్షంబు జడివట్టి కురియఁ బర్జన్యుఁ బనిచి
శివుఁడు తా నొకవృద్ధశివయోగి యై గుడ్డి యవ్వైనతనజలజాక్షితోడఁ
గడువేడ్కఁ జనుదెంచి కొడుకుమాంసముతోడి భోజనంబునకు విభూతి యొసఁగి
పుత్త్రుఁబాకముఁ జేసి బోనము వెట్టినఁ గుడువం నొల్లక పెడము వెట్టి
తే. వీరమాహేశ్వరాచారవీథియందు, నిజముగా నిల్పె నెవ్వాని నియతిపరుఁడు
వాఁడు పాత్రుండు కాఁడె కైవారమునకు, దురితదూరుండు శ్రీచిరుతొండనంబి.

సీ. అర్ధరాత్రంబున నల్లాడనాథుండు దానెయెవ్వనికిఁ గైదండ యిచ్చెఁ
బదకంపుఁబచ్చను బై వేయవచ్చిన దనుజారి నిల్పె నెవ్వని నిజంబు
అలిగి పోయిన వేంకటాచలంబున కేగి కొనివచ్చె నెవ్వని కుధరధరుఁడు
వైకుంఠనాథుఁ డెవ్వనిసేవకును మెచ్చి యాత్మసత్కారకళ్యాణ మొసఁగె[డు
తే. నతఁడుభాగవతోత్తముండతఁడుశుద్ధుఁ,డతఁడువైరాగ్యసంపన్నుఁడతఁడుఘనుఁ

పరమవైష్ణవసభ నుతింపంగఁ దగఁడె, కాంచినగరికుటుంబి శ్రీకంచినంబి. 15

వ. అందు. 16

తే. సింహవిక్రమపట్టణశ్రేష్ఠుఁడైన, సెట్టి జగజెట్టి పావాణిసెట్టివిభుఁడు
ఘనుఁడు నగరేశచంద్రశేఖరపదాబ్జ, వందనానందితాత్ముండు వంశకరుఁడు. 17

క. శ్రీపర్వతసోపాన, స్థాపకుఁ డగు రెడ్డివేమజగతీపతికిన్
బ్రాపైనయవచిదేవయ, యాపావాణికి జనించె నభ్యుదయముతోన్. 18

ఉ. విశ్వజగత్ప్రసిద్ధుని వివేక నిరంజన రామనాథ యో
గీశ్వరపాదసేవకు నహీనదయాగుణశాలి వీరమా
హేశ్వరచక్రవర్తిఁ దరుణేందుకళాధరభక్తిభావనా
శాశ్వతచిత్తు మాయవచిసత్కులు దేవయ నెన్న శక్యమే. 19

ఉ. ఆతతభక్తిసంపద నహర్నిశమున్ ఘృతఖండశర్కరా
పాతముతో నపూపములు పాయసమున్ గదళీఫలంబులున్
స్ఫీతము గాఁగ నన్నములు పెట్టును శంకరభక్తకోటి కా
సేతుహిమాచలం బవచిసెట్టికి నెవ్వరు సాటి యిమ్మహిన్. 20

వ. ఆయవచిదేవయకు మాచాంబయందుఁ ద్రిపురారియు తిరుమలనాథుండు జామి
సెట్టియు నను మువ్వురు తనయులు పుట్టి రందు. 21

మ. ఖుసి మీఱన్ సురధాణ నిండుకొలువై కూర్చున్నచో నీకరా
భ్యసనంబు న్నుతియించు రా యవచితిప్పా చంద్రసారంగనా
భిసముత్పాదితతాళవృంతపవనప్రేంఖోలనప్రక్రియా
వసరోదంచితసారసౌరభరసవ్యాలోలరోలంబముల్. 22

క. తిమ్మథనార్థుల పట్టుం, గొమ్మ వివేకాది సకలగుణరత్న నిదా
నమ్మఁ ద్రిపురారి యనుఁగుం, దమ్ముని బుధజనము సంతతమ్ము నుతించున్. 23

చ. హరిహరరాయ ఫేరొజసహా సురధాణగజాధిపాదిభూ
వరులు నిజప్రభావ మభివర్ణన సేయుఁ గుమారగిర్యధీ
శ్వరుని వసంతవైభవము సర్వము నొక్కఁడ నిర్వహించు మా
తిరుమలనాథసెట్టికిని ధీగుణభట్టికి నెవ్వ రీడగున్. 24

శా. చామున్ వైశ్యకులాబ్ధిసోము విలసత్సౌందర్యలీలాకళా
కామున్ దానకళాభిరాము సుమనఃకల్హారవాటీసుధా
ధామున్ కోమలయామినీశధవళోత్తంసప్రశంసారుచి
శ్రీమన్మానసశైవయోగివిహితక్షేము న్నుతింపం దగున్. 25

సీ. పంజాబుకర్పూరపాదపంబులు తెచ్చి జలనోగి బంగారుమొలక దెచ్చి
సింహళంబున గంధసింధురంబులు తెచ్చి హురుమంజిబలు తేజిహరులు దెచ్చి
గోవసంశుద్ధసంకుమదద్రవము దెచ్చి యాపగ నాణిముత్యాలు దెచ్చి
చోటంగిఁ గస్తూరికాటంకములు దెచ్చి చీనిచీనాంబరశ్రేణి దెచ్చి
తే. జగదగోపాలరాయవేశ్యాభుజంగ, పల్లవాదిత్యభూదానపరశురామ
కొమరగిరిరాజదేవేంద్రుకూర్మిహితుఁడు, జాణ జగజెట్టి దేవయచామిసెట్టి. 26

తే. తమ్ములిద్దఱుఁ దనయాజ్ఞ దల ధరించి, యన్నిదీవులఁ దెచ్చులాభార్థకోటి
యర్థులకు నిచ్చి కీర్తి బేహార మాడు, నవచి త్రిపురాంతకుండు వంశాబ్ధివిధుఁడు.

మ. తరుణాచీనితవాయిగోవరమణాస్థానంబులం జందనా
గరుకర్పూరహిమాంబుకుంకుమరజఃకస్తూరికాద్రవ్యముల్
శరధిం గప్పలిజోగులన్ విరివిగా సామాన్లఁ దెప్పించు నే
ర్పరి యావైశ్యకులోత్తముం డవచితిప్పం డల్పుఁడే యిమ్మహిన్. 28

తే. పండువాఢిల్లిరాడాదిపట్టణముల, యధిపతులు మౌళిఁ దాల్చురత్నాంకురంబు
లవచిత్రిపురాంతకానీతయానపాత్ర, సింహళద్వీపమండితక్షేత్రజములు, 29

ఉ. పిన్నటనాఁడు సత్కరుణఁ బిల్లలమఱ్ఱిమహాప్రధాని పె
ద్దన్నగురూత్తముండు తగనక్షరశిక్షయు దైవమార్గసం
పన్నతయున్ వివేకపరిపాటియునుం గృపసేసె నర్థి నే
యన్నకు నట్టిసెట్టి త్రిపురాంతకునిం దగుఁ బ్రస్తుతింపఁగన్. 30

ఉ. ధీచతురుల్ సహోదరులు తిర్మలసెట్టియు జామిసెట్టియున్
మాచన విశ్వనాథ చినమల్లకుమారులు వీర లాత్మజుల్
శ్రీ చెలువంబుఁ గైకొనినచేడియ యన్నమదేవి భార్యగా
గోచరమే నుతింప నయకోవిదునిం ద్రిపురాంతకాధిపుల్. 31

## షష్ఠ్యంతములు

క. ఆపుణ్యశ్లోకునకు ను,మాపతి పాదారవిందమధుకరమునకున్
ద్వీపాంతరమండలికా, భూపాలకమాననీయపురుషార్థునకున్. 32

క. సంధాభార్గవునకుఁ, గి,ష్కింధాచలపతికి దానకేళీభరధా
రంధర్యనియతమతికి యు,గంధరచాణక్యనీతిగతినిపుణునకున్. 33

క. మాచాంబానందనునకు, వాచాగోచరవివేకవైయాత్యునకున్
వాచాలవిబుధగంగా, వీచీగంభీరవాక్యవిన్యాసునకున్. 34

క. వాణిజ్యచణున కంత, ర్వాణీసంస్తూయమానభాసురమతికిన్
వాణీనఖముఖముఖరిత, వీణానిక్వాణనిభకవిత్వఫణితికిన్. 35

క. త్రిపురాంతకదేవమనో, విపులకృపావర్ధితాభివృద్ధికిఁ బాండ్యా
ధిపసఖున కవచిదేవయ, త్రిపురాంతకునకు వితీర్ణదీక్షానిధికిన్. 36

---

# ప్రథమాశ్వాసము

---

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాచెప్పం బూనినహరవిలాసం బనుప్రబంధంబునకుఁ బ్రథమవిలాసం బైనకృతినాయకునివాణిజ్యవంశంబునకుఁ గూటస్థుం డైనకిరాటకులశ్రేష్ఠుం డగుచిఱుతొండనంబిచరిత్రంబుఁ జెప్పెద నది యెట్టి దనిన.

## కథాప్రారంభము

తే. బదరికాశ్రమభూమిఁ దాత్పర్యనిష్ఠఁ, దపము సేయుచునుండె శాంతత వహించి
క్రోధసంవర్ధమానతపోధనుండు, ఘనుఁడు దుర్వాసుఁ డను మహామునివరుండు. 2

వ. ఒకనాఁ డమ్మునీంద్రుండు మధ్యాహ్నకాలంబునఁ గృతస్నానుం డై పితృదర్పణంబుఁ జేసి సంధ్యావందనం బొనర్చి వైశ్వదేవబలిహరణంబులు దీర్చి దేవతార్చనం బనుష్ఠించి పర్ణశాలవాఁకిట హవిశ్శేషం బైనహవిష్యనీవారపాయసాన్నం బల్లనల్లన లేడిపిల్లలకు మేఁపుచుండె నయ్యవసరంబున నంబరమార్గంబున దుంబురుం డనుప్రమథుండు దననితంబినియుం దానును విమానం బెక్కి హేమకూటంబుననుండి గోకర్ణవాసి యగు దృక్కర్ణభూషణు సేవింపం బోవువాఁ డయ్యాశ్రమంబునడుచక్కి నుండి యమ్మునీంద్రుండు హరిణవత్సంబులకుం జేయువాత్సల్యంబునకు నద్భుతంపడి యంగుళిస్ఫోటనంబు సేసె నచ్చిట్టిడికి నాలేడిపిల్లలు బిట్టు బెదరి చెదరి చేయీక పఱచిన నిది యేమి చప్పుడొకో యని గగనమార్గంబునకు దృష్టిపఱపి యాదూర్వాసుండు. 3

శా. హుంకారం బొనరించి తుంబురునితో నోరీ! దురాచార! నా
జింక ల్భుక్తి గొనంగ నేమిటికిరా చేచిట్ట మ్రోయించి యా
తంకంబుల్ ఘటియించి తిట్టియపరాధం బేను సైరింతునే?
యింక న్మర్త్యుఁడవై జనింపు మహిలో నింకంగ నీగర్వమున్. 4

తే. అని శపించినఁ దుంబురుం డతిభయమున, డిగ్గనంగ విమానంబు డిగ్గనుఱికి

యతనిపాదాబ్జములకు సాష్టాంగ మెఱఁగి, యెంతయును భక్తినమ్రుఁడై యిట్టులనియె.

క. కరుణింపు సమాశ్రితభయ, హరణ ! సురాసురకిరీటహరిహయరత్న
స్ఫురణామధుకరవరివృత, చరణా ! యత్యంతదాంతిశాంత్యాభరణా ! 6

తే. హరిణవత్సంబులకు మీరు కరుణతోడఁ, బాయసాన్నంబు గుడిపింప భార్యఁ జూచి
సర్వభూతానుకంపకు సంతసిల్లి, చిట్టమిడిచితి నిది నాకుఁ జెట్ట యయ్యె. 7

వ. నీవచనం బమోఘంబు గావున నాకు మర్త్యత్వం బవశ్యభోగ్యంబుగాఁ బురాకృతఫలం బనుభవింపక పోవచ్చునే నాయపరాధం బల్పంబ దీనికిం దగ శివభక్తగృహంబున జన్మించునట్లుగా ననుగ్రహించి శాపాంతంబు కృప సేయు నీ కృపావిశేషంబునం గ్రమ్మరం బారిషదపదవి కలుగునందాక మద్భార్య నీకుం గోడలు నీపాదచర్య సేయుచు నీయాశ్రమంబున నుండఁగలయది యని పల్కిన దాక్షిణ్యంబు వహించి యవ్విరూపాక్షదివ్యాంశభవుం డగుదుర్వాసుండు. 8

ఉ. ఇద్దురవస్థ రాఁదగినయింతటి తప్పొనరించినాఁడవే
ప్రొద్దు గుణంబున న్నెగులు వొందిన నేమి యనంగ వచ్చు నీ
ముద్దియ నాదుకోడ లిటముందట నావగ నెమ్మినుండనీ
నిద్దురమేలుకొన్నగతి నీవును గ్రమ్మరి రమ్ము పొమ్మిఁకన్. 9

వ. అనియె ననంతరంబ తుంబురుండు దూర్వాసుశాపాక్షరంబులు ప్రేరేపఁ దక్షిణంబ జంబూద్వీపంబున ద్రవిడభూమండలమండలాయమానంబును గంపాతరంగిణీప్రవాహనదీమాతృకాయమాన విశ్వంభరాభరితకలమశాలిశిరాముఖ షష్టికపతంగహాయనప్రముఖ బహువిధవ్రీహిభేదసంపత్సంపన్నంబున బంకజాసనహయమేధయాగస్థానంబును హస్తిగిరిశిఖరశృంగాటకాఘాటకహాటక ఘటనావాసవరదరాజాభిధాన వైకుంఠవిహారప్రదేశంబును గామాక్షీకౌతుకాగారంబును నేకామ్రనాథదేవదివ్యావసథంబునునైన కాంచీనగరంబున వణిగ్వంశంబున నుద్భవించి. 10

మ. చిఱుతొండం డను పేర వైశ్యకుల మార్జిత్యంబునం బొంగఁగాఁ
గఱకంఠుం దరుణేందుశేఖరుని షట్కాలంబు పూజించు నెం
దఱుభక్తు ల్దను వేఁడిన న్బ్రియముదముల్ దాత్పర్యము న్భక్తియు
న్వెఱపుం గల్గి తదీప్సితార్థములు గావించు న్నిరాలస్యతన్. 11

వ. అతనిపురంధ్రి తిరువెంగనాంచి తుంబురునిభార్య యగునప్సరోంగన నిజాంశంబునం గాంచీనగరంబునందు వణిగ్వంశంబునఁ గౌశికగోత్రంబున నవతరించి చిఱుతొండనంబికి భార్యయై సిరియాలుం డనుకుమారునిం గనియె నాపుణ్య

దంపతు లిరువురు షట్కాలలింగార్చనంబులను సంతతజంగమారాధనంబులను గాలంబు గడపుచుండిరి. 12

తే. కంచిలో నేఁడువాడలు గలసియుండ్రు, ప్రకృతిబంధులు సంబంధబంధులు నయి
పాఁడి1పంటయు వైభవప్రాభవములు, తగవు ధర్మంబు గలిగి యుత్తమవణిజులు.

వ. చిఱుతొండండును బూర్వజన్మవాసనావిశేషంబునఁ దుషారగిరికన్యకాకరకమలకిణాంకితుం డగుటంజేసి వలయాంకుం డనం బ్రసిద్ధి వహించి యేకామ్రనాథు నారాధించుచు శుద్ధవీరశైవాచారపరాయణుండై జంగమప్రముఖులకుఁ దన మనోవంచనంబు లేక యేవేళ నేపదార్థంబు వేఁడిన లే దన కిచ్చుట వ్రతంబు గాఁ బట్టి పట్టిన వ్రతంబు చెల్లకుండినం దిరుబాసగా వర్తిల్లు చుండె నంత నొక్కనాఁడు. 14

చ. తమలము కెంపున న్మెఱుఁగు దాఁకిన చెందిరకావికోఱలుం
దుమికిఫలంబుచందమున నున్ననియూదలమీఁదిపచ్చిగం
దముఁ గరసంపుటంబున సదాశివలింగము నొప్పమిండజం
గము చనుదెంచె నొక్కరుఁడు గర్వమునం జిఱుతొండనింటికిన్. 15

వ. వచ్చి యయ్యుసపరిమన్మథుండు మన్మథమథనసేవాహేవాకసావధానమానసుం డైన యాజగజెట్టి సెట్టికి శివునికారుణ్యం బని దీవించి పాదార్చనాద్యుపచారంబులు గైకొని సుఖాసీనుండై యిట్లనియె. 16

ఆ. కంచినగరిపాటిగట్టుతూమున తూమెఁ, డిత్తురసము మాకు నిపుడు పెట్టు
హరుని నేఁడు మాకు నభిషిక్తు నొనరింప, వలయు నిత్యమైన వ్రతము గాన. 17

క. చేగానుఁగాడు చెఱకుం, దీగరసంబునఁ బురారిఁ దేల్పక కుడువ
న్నాగురు వుపదేశించిన, యాగమ మిది గాన నిన్ను నభ్యర్థింతున్. 18

వ. అని కక్షంబునం ధరియించినయాలాబుంపుంగాయలోనిభస్మం బిచ్చిన వల్లె యని యందుకొని యావైశ్యబృందారకుండు పరమానందకందళితమందస్మితస్మేర వదనారవిందుండై యిందుధరుండు మనమందిరంబునకు విందు వచ్చినాఁడు గరగరగా వంటకమ్ములు గావలయు నని తిరువెంగనాంచి కప్పగించి యప్పు డప్పరమభక్తునియందలి భక్తిచిత్తంబునం జొత్తిల్ల నత్యుత్తమవ్యవహారోదాత్తం బగువిత్తంబు చెఱంగున ముడుచుకొని కంపాతరంగిణీసేకసంవర్ధితంబు లైన చెఱకుంగోలలు గొని. 19

సీ. కాంచిపురముపాటిగట్టుతూమునఁదూమెఁ డిత్తురసమ్మున కెన్నివలయుఁ
జేగానుఁగాడంగఁ జెఱకుదండము లని గుఱుతింపఁగా నూఱుకోల లైనఁ

---

1. పంతంబు.

జాలుఁ బొమ్మనుబుద్ధి సంభవించెను మదిఁ జెలుతొండనంబికి సెట్టిపతికి
నన్నికోలలు జట్టి యాడక కొసరక ద్రవిణంబుమూట వారలకు నిచ్చి
తే. ముదురుఁదీవెల బిగువుగా మోపు గట్టి, వాఁడిపండ్లు బిగించి చేవలఁతి యెగిరి
యెత్త మోపెత్తరాదయ్యె నెంతయేని, నెత్తవచ్చునె నూఱుపుండ్రేక్షుఘట్టలు.

ఉ. వెగ్గల మైనమోపుఁ గడువీఁకన యెత్తఁగఁబోయి ముందటన్
మ్రొగ్గతిలంబడెం జెమట మోమునఁ గ్రమ్మగఁ ద్రావిడోత్తముం
డగ్గణముఖ్యుతోడ నొకఁడై సరి నాచెఱకుల్భరించి తా
దిగ్గన వచ్చె శంకరుఁడు దెప్పర మైనవడిం జెమర్చుచున్. 21

ఆ. చెఱకుమోపు వైచి శ్రీమహాదేవుండు, చాయఁ జూచునంత మాయమయ్యె
నద్భుతంబుఁ జెంది యతఁడు చేజంత్రానఁ, జెఱకుఁగోలలాడి చేసె రసము. 22

తే. పాటితూమున రసము దైవాఱఁ గొలిచి, కొమరుజంగంబునకు నిచ్చెఁగోర్కిఁ దీఱ
నాతఁ డఱచేత నున్నచంద్రార్ధమౌళి, కారసంబున నభిషేక మాచరించె. 23

మ. ఇట వైశ్యోత్తముఁ గూడి మోచుకొని పుండ్రేక్షుప్రతానంబు దె
చ్చుట నప్పాటను వెండికొండపయి నస్తోకాప్సరోభామినీ
నటనాలోకనవేళ మై చెమరిచె న్మందాకినీమౌళికిన్
ఘటియిల్ల న్గిరిరాజనందనకుఁ దత్కాలంబ యీర్ష్యోద్ధతుల్. 24

చ. అమరవరేణ్య! ప్రేంకణము లాడెడువేలుపులేమఁ జూచి యే
చెమరిచి తంచుఁ గేళిసరసీరుహ మెత్తి ప్రతాప మొప్పఁగా
హిమగిరిరాజనందన మహేశ్వరు మొత్తె మధూళికాపరా
గములు శశాంకశేఖరునికన్నులమూఁటను జిందు నట్లుగన్. 25

వ. ఇట్లు లీలారవిందంబున హిమశైలనందనచేత వ్రేఁకవడి యిందుధరుండు సుర
సుందరీసందర్శనంబున నైనకందర్పవికారంబు కాని తేటపడ గోవిందశతా
నందపురందరాదులగు బృందారకులు వినుచుండ మందస్మితస్మేరవదనారవిం
దుండై మంద్రగంభీరస్వరంబున నిట్లానతిచ్చె. 26

సీ. కమలాక్షి యిది యేమిగాఁ దలంచితి విప్పు డర్ధదేహంబు నీయదియ కాదె
హృదయంబుపొరువున హృదయ ముండుటలేదె యేకీభవించిన యిరువురకును
నేభావ మైన నీహృదయంబునకు దాఁప నేభంగి వచ్చు నాహృదయమునకు
నపరాధశంక యావంత యైనను లేదు నీచిత్తమున కెక్కు నిక్కువంబు
తే. తప్పు లేకుండ నేల నెత్తమ్మిమొగడ, విసరి వక్షఃప్రదేశంబు వ్రేటుగొంటి

కేసరంబులరజముఁ బుష్పాసవంబు, నెఱసె నిదె చూడు కన్నుల నీరు గ్రమ్మె. 28

వ. నాపై సెమర్చుటకుం గారణంబు సెప్పెద నాకర్ణింపుము.

## ఆశ్వాసాంతము

ఉ. హాటకగోత్రధీర! సిరియాలకులోద్వహ! చంద్రమః కలా
జూటపదారవిందపరిచుంబనమానస! ధర్మశీల! క
ర్ణాటకరాటఘూర్జరదహాళి! కళింగకళింగమండలా
ఘాటవిజృంభమాణశశికాంతివినిర్మలకీర్తిపూరితా. 29

క. కౌమరగిరివసంతనృపా, గమకేళీగంధసారకస్తూరీకుం
కుమకర్పూరహిమాంభ, స్సముదంచితబహుసుగంధిశాలాధ్యక్షా! 30

మాలిని. తిరుమలవిభుచామాధీశ్వరైకాగ్రజన్మా!
పరమగురుసపర్యాప్రౌఢరామానుజన్మా!
చిరపరిచితలంకాసింహళద్వీపభూమీ!
సరసిరుహభవోరుస్తంభగోత్రాగ్రగామీ! 31

గద్యము. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర వినయవిధేయ శ్రీనాథనామధేయప్రణీతం బైనహరవిలాసంబునందుఁ బ్రథమాశ్వాసము.

# ద్వితీయాశ్వాసము





రాజరాజ! శీలిత
భారతరామాయణాదిభవ్యపురాణా!
యారాధితపరమేశ్వర!
ధీరగుణాభరణ! యవచిదేవయతిప్పా! 1

వ. అవధరింపు మనంతరంబ పార్వతితోఁ బరమేశ్వరుం డిట్లు చెప్పందొడంగె. 2

తే. దీవులందెల్ల నేరెటిదీవి లెస్స, భరతఖండంబు మేల్తదంతరమునందు [పురము.
ద్రవిడదేశంబు కడు నొప్ప దానియందుఁ, గాంచికామండలం బందుఁ గాంచి

శా. ఆకాంచీనగరంబునందు శివభక్త్యాచారసామ్రాజ్యల
క్ష్మీకంఠాభరణంబు నిర్మలవణిక్ఛ్రేష్ఠాన్వయాంభోధికిన్
రాకాపూర్ణనిశాకరుండు చిఱుతొండ శ్రేష్ఠుఁ డయ్యుత్తముం
డేకాలంబును బాయకుండు గిరిపుత్రీ! జంగమారాధనల్. 4

ఉ. ఎందఱు జంగమప్రమథు లెత్తటి నేమిపదార్థ మెంత యే
కందువ వేఁడినం దిరముగా నతఁ డందఱి కాపదార్థ మా
కందువ యేపు ప్రాణ మెడగా నిడియైన ఘటించి పెట్టుఁ బూ
ర్ణేందునిభాస్య వానిసరి యెవ్వఁడు లేఁడు వసుంధరాస్థలిన్. 5

తే. కలియుగంబునఁ గళ్యాణకటకనగరి
నాకు భక్తుండు బసువరనాథుఁ డొకఁడు
కాంచినగరంబులో వణిగ్వంశకరుఁడు
నాదుభక్తుండు చిఱుతొండనంబియొకఁడు. 6

శా. అయ్యార్యరూద్భవవంశసంభవుని నేకామ్రాధినాథాంబికా
శయ్యామందిరనిర్మలాత్మకుని భిక్షావృత్తి జంగం బొకం
డొయ్యం జేరఁగ వచ్చి మాశివుని నేఁ డోలార్చెదం గానఁ దే
వయ్యా యిక్షురసంబు తూమెఁ డనుచుం బ్రార్థించి నేమించినన్. 7

శా. అట్టే కా కని భూతి యందుకొని శైవాచారసంపన్నుఁ డా

సెట్టిశ్రేష్ఠుఁడు తోటకుం జని రసశ్రీమాధురీలక్ష్మికిన్
1బట్టొయిమ్ముల మంచినల్లచెఱకుల్ 2భారంబుగా విర్చి వే
కట్టెన్మోపు వనీకఠోరలతికా కాండప్రకాండంబులన్. 8

క. తూమెఁడురసమునకుం దగఁ, బ్రామెడుపుండ్రేక్షులతలు వట్రువగ లతా
దామములఁ గట్టిపెట్టిన, యామోపుఁ గదల్పలేక యవశుం డయ్యెన్. 9

క. పరఁగెడురసంబుగలుగం, గరయంత్రం బాడ నెన్నిఘటలు వలయు న
న్నిరసాలకాండకంబు, ల్సిరియాలునితండ్రి యెత్తలేకున్నయెడన్. 10

తే. ఏ నొకఁడఁ బోయి యొకవంక నెత్తికొంటి
నాతఁ డొకవంక నెత్తె మో పద్రితనయ!
భారమున డస్సి యవ్వణిక్పతి చెమర్చె
నేను నపుడు చెమర్చితి నేమి చెప్ప. 11

క. ఆచెమరించుట సుమ్మీ, యీచెమరించుట భవాని యిది యన్యముగా
నీచిత్తమునఁ దలంపకు, మీచనవులు భక్తకోటి కేను ఘటింతున్. 12

తే. వలతు నే భక్తకోటికి వారిజాక్షి, లలన యాభక్తకోటియు వలచు నాకు
"భక్తిగతి లింగపతి" యను ప్రాఁతమాట, నేఁడుగాఁ గల్గెనే యలినీలవేణి. 13

వ. అనినం బార్వతి యాశ్చర్యం బంది యాసర్వజ్ఞుతోడ దేవా! యవ్వీరమాహే
శ్వరు నాకుం జూడవలయుఁ గంచికిం దోడ్కొని పోవే యని ప్రార్థించిన
నప్పంచవదనుండు సమీపంబునం గాంచి యున్న పాకశాసనుం గాంచి యిట్లని
యానతిచ్చె. 14

సీ. పాకశాసన! కంచిపట్టణమునయందు నాల్గుదిక్కుల యోజనములు మూఁడు
ముయ్యేడువాసరంబు లకాలవర్షంబు గురియింపఁ బంపు మొగుళ్లగములఁ
పగళులు రేలు కుంభద్రోణములు గాఁగఁ గలదు మాకు రహస్యకార్యమొకటి
యనినఁ దత్క్షణమాత్ర నైరావణము నెక్కి యమరావతికి నేగి యమరవిభుఁడు

తే. పుష్కలావర్తకాదికాంభోధరముల, సంకిలియ లూడ్చి తెప్పించి సత్వరమునఁ
బంచెఁగాంచీపురంబునఁబదియుఁబదునొ,కొండుదినములువర్షించుచుండుఁడనుచు.

వ. అంత. 16

తే. పశ్చిమంబున నింద్రచాపంబు వొడిచె, నిండునెలఁ జుట్టెఁ బరివేషమండలంబు
గగనమార్గంబునందు నాగడపలెగసె, నంబుధరమాలికలు దక్షిణంబు నడచె.

క. ఊఱు ముఱిమి మూలగాడ్పులు, సఱచి విసరఁ జొచ్చె మదనసంహారుదెసఁ గ్రొ

1. బట్టుం గొమ్ములు. 2. బారాది దివ్వించి.

మ్మెఱుఁ గుద్భవించెఁ గప్పలు, [1]గఱరవరట్కుఱరరవరరరగ ట్టని యఱచెన్. 18

ఉ. తూనీఁగ లాడఁజొచ్చెఁ దివిఁదూఁటి భ్రమింపఁగఁ జొచ్చెఁ బిచ్చుకల్
మానక యుబ్బి గబ్బులఁగు మాటికిమాటికిఁ గొల్చెఁ గొమ్మపై
వాన యవశ్య మింక బహువాసరముల్ జడి వట్టునం చొగిన్
వానికి వాని కాడిరి యవారణఁ బౌరులు కంచిలోపలన్. 19

మ. గ్రహసిద్ధాంతకళావిదుల్ సలిలనక్షత్రంబు నీహారరు
క్సహవాసంబును నభ్రవీథిఁ బరివేషస్థాయియైయుండుటన్
బహు[2]బాధల్ వడఁ గల్గు నంచుఁ దమలో భాషింపఁగాఁ గంచిలో
గృహమేధుల్ భయ మంది రింధనతృణక్లేశంబు చింతించుచున్. 20

వ. అనంతరంబ విగళితశృంఖలాబంధంబులై పుంఖానుపుంఖంబులం బుష్కరావర్తకాదికంధరంబులు కబంధంబులు పారణలు సేసి కారుకొని చటులతటిద్దండతాడనంబులం జేసి యోసకేసినయవియుంబోలె గర్జిల్లుచుఁ బర్జన్యశిఖాడంబరంబున నంబరంబుఁ దొరకట్టుచుఁ గొక్కరలు కెరలి యిరుచక్కియల నుక్కడంబు నడువం బౌరస్త్యంబులై ధారాకదంబంబులఁ గోరగింపఁజేయఁ దలతలం దొరఁగు చినుకులం బుట్టుకట్టావితోడం గూడి పుడమిం బొడముకమ్మనెత్తావి చిత్తంబుల కాహ్లాదం బాపాదింప విద్యున్నటీనటనారంభసంభ్రమోచితంబులగుపుష్పాంజలిలిక్షేపంబులం బురుడించుచుండ డీలుకొనంబడు వడగండ్లగములు గిరికటకశిలావిటంకంబులం గ్రేంకారంబులంకురింప నొండొండ మెండుకొన ఖండపరశుకంఠమూలకఠోరకాలకూటమషీకలంకపంకచ్ఛాయాచ్ఛటాపటలంబుభంగి నంగీకరించుచు నిశ్శేషశిలీంధ్రబాంధవంబును నిర్భిన్నపథికమార్గంబును నిరవధికలాంగలిప్రసూనధూళిధూసరదిశాముఖంబును నిరుజ్ఝితగిరినిర్ఝరప్రవాహంబును నిబిరీసకుసుమకేసరకరికరాభధారాకదంబడంబరంబును నై వర్షారంభంబు విజృంభించి కుంభద్రోణంబులుగ విశ్వంభరామండలం బేకార్ణవంబుగా ధారాపాతంబు గురియం దొడంగె వెండియు. 21

చ. తటిదభిఘాతవేగమున ధారలు జోరున [3]జాఱు చుండఁగాఁ
బిటిలు పిటిల్లనం బ్రిదిలి ప్రేలిపడం దొడఁగెం జతుర్దిశా
తటముల మండుచుం బిడుగుతండము కాంచిపురీజనంబుహృ
త్పుటములు జల్లన న్మఘవపుత్రుని పేళ్లు పదిం జపింపఁగన్. 22

తే. ఊలవడి చొచ్చి కామాక్షి నుత్తరించె, నగరితోఁగూడ నేకామ్రనాథు ముంచె
హస్తిగిరినాథుశ్రీపాద మప్పళించెఁ, గంచిఁ జెప్పలఁ దేల్చె నకాలవృష్టి. 23

1. గఱవఱగఱఱగఱ యనుచు గట్టుననిలిచెన్. 2. వర్షంబట. 3. కురియ.

వ. ఇవ్విధంబున నిరువదియొక్క వాసరంబులు నిలుపులేక పాముప్రేలం గట్టినభంగి నింగి యవిసి కాఱినచందంబున సముద్రంబు వెల్లివిరిసినలీలం బిలంబు తెఱచిన వడువునఁ బురందరకీటకాటోపంబును గండూపదవిహారారంభసంరంభంబును మండూకప్రకాండడిండిమధ్వానచండిమంబును గచ్ఛపోత్సేకహేవాకంబును మీనమానసోల్లాసంబును నక్రప్రక్రీడనంబును గర్కటకనటనపరిధాటీపాటవంబును ఘటియిల్ల మిఱ్ఱుపల్లంబులు సరిగా నంపజాలంబుపగిదిఁ గురిసి యిరువదిరెండవదినంబునందు. 24

ఉ. ఒయ్యన వెల్వ నూపి జడి నుబ్బరవోయెడుప్రాణికోటికిన్
దయ్యము నెత్తికోలు తుది దాఁకఁగఁ దూరుపు తెల్లవాఱె తె
ల్పయ్యెను నీరు వీథిఁ బడి యంబుధి కేఁగె నదీముఖంబునం
[1]బయ్యెర వట్టె మేఘములు నచ్చుగఁ బాఱె నురజ్ఞుఖంబులై. 25

మ. ఎడవెలైవనను లేక పెక్కుదినముల్ హేరాళమై వర్షముల్
జడిగాఁ బట్టి తటా లనంగ వెలిసెన్ జంఝూసమీరంబుతో
నుడుమార్గం బఖిలంబు నున్ననయి శాణోత్తేజనం బొంది పు
ల్కుడుగంబడనిశాతఖడ్గము క్రియం గన్పట్టె నప్పట్టునన్. 26

తే. కడు మహోత్పాత మగుచు నకాలవృష్టి, కంచి ముయ్యేడునాళ్లు వర్షించినపుడు
వెలిసినప్పుడె యీవీడు విడుచువార, మనుచుఁ బట్టిరి ప్రతిన బౌద్ధాదిజనులు. 27

వ. బౌద్ధజైన పాషండ లోకాయతిక చార్వాక కాపాలి కాహితుండిక వానప్రస్థ పాశుపత జంగమయోగిప్రముఖు లగువైదేశికులలోఁ బట్టణంబునం గాపురంబున్నవారందఱుం దక్కుఁ దక్కినవారందఱు [2]గుంపులు గట్టి కోలం గొట్టినతెఱంగున జలోపద్రవంబు తిట్టువారై మూఁడామడమేర యంతయుం బుక్కిటిబంటియైనఁ దత్ప్రదేశంబు వెడలి గండంబులం గడచితి మని గుండియలు నిగిడికొనుచుం జనిరి. 28

శా. ఆముయ్యేడుదినంబులందు శివభక్త్యాచారసంపత్తికిన్
సీమాభూమి యనం బ్రసిద్ధుఁ డగునాచిర్రొండనంబీశ్వరుం
డేమీ కొంకక పెట్టుజంగములకున్ హేరాల మిష్టాన్నముల్
నేమం బొప్పఁగ రేలునుం బగలునున్ విశ్వాసపూర్వంబుగన్. 29

చ. అనినమునుం గుమారసిరియాళుఁడు నాతనిదాదియైనచం
దనికయు ధన్యు లప్పరమదంపతులున్ శివభక్తికోటికై
యనుపమవృష్టి వేగ కొనియాడుదు రెన్నియునుం దెఱంగులన్
దినములు రేబవల్ దధిమధుప్రచురాన్నసమర్పణంబునన్. 30

1. బయ్యెర వట్టె మేఘములు వంచుఁగఁ బాఱె. 2. కత్తులు గట్టి.

తే. వంటచెఱకులు లేకున్న వామునైన, వస్త్రములు తైలమున ముంచివహ్నిఁగాల్చి
వంటకంబులు వండి యవ్వారి గాఁగఁ, బెట్టు శివభక్తతతికి నంబిప్రభుండు. 31

ఉ. జోలున వర్షము ల్గురియ సువ్రతుఁ డాచిఱుతొండనంబి దై
వాఱెడుభక్తిఁ బెట్టుశివభక్తుల కర్థిఁ జతుర్విధాన్నముల్
తాలనియొల్పుఁబప్పును ఘృతంబును దియ్యని పాయసంబులుం
జాలు బిండివంటలును శర్కరయుక్ దధియుక్ యథేచ్ఛగన్. 32

క. కలకంఠునిభక్తులకుం, జిఱుతొండఁడు మిగుల భక్తి సేయుచును గడుక్
దలచగుపెనువానలలో, నులవగుకూటముల మడుఁగు లోరెము లిడుచున్. 33

వ. శక్తైకవృద్ధిలబంబు లైనధనంబులఁ గోటికిం బడగ యెత్తిన యక్కిరాటవంశ
కిరీటాలంకారంబు వీరశైవాచారం బాధారంబుగా శరీరార్థప్రాణవంచనంబు
సేయక జంగమప్రమథుల నారాధించుచుఁ గల్పాంతకాలకల్పంబు లైనయా
దుర్దినంబుల నియమం బుపద్రవంబు నొందకుండం గాపాడుకొనుచు నుండె
నిట్లుండ నవ్వాన వెలయుదినంబు సంప్రాప్తించె. 34

తే. ప్రతిదినంబును జంగమప్రమథముఖ్యుఁ
డొకఁడు మొదలుగ మఱి యెంద ఱోదవకున్న
నారగింపనిబాసవాఁ డగుటఁజేసి
నాఁడు పుణ్యుండు చిఱుతొండనంబివిభుఁడు. 35

వ. మధ్యాహ్నకాలంబున వీరమాహేశ్వరసమయసిద్ధాంతమార్గానుసారంబున. 36

ఉ. ధీనిధి సెట్టినంబి తన 1దేహమునిండ విభూతి మంగళ
స్నానముఁ జేసి ధౌతపరిధానముఁ గట్టి త్రిపుండ్రధారి యై
చే నమృతాంశుమాళిని వశీకృతభక్తు ధరించి సంతత
ధ్యానముఁ జేసి యెంతయును దత్పరభావము ప్రస్ఫుటంబుగన్. 37

సీ. జలక మార్చె నవీనచంద్రార్ధమాళికిఁ దడి యొత్తె భక్తమందారమునకుఁ
జందనం బర్పించె జగదేకభర్తకుఁ బుష్పమాలిక లిచ్చె భూతపతికి
ధూపంబు సంధించె దురితసంహారునకు దీప మిచ్చెను మహాదేవునకును
దాంబూల మొనరించె నంబికాధవునకుఁ బ్రణమిల్లె గజదైత్యభంజనునకు

తే. జంగమారాధనక్రియాసమయమునను, గాని యుపహార మీరాని గారణమున
దేవదేవుని నురుసజ్జఁ దిరము సేసి, వాకిటికి వచ్చె శివయోగివరుల నరయ. 38

క. ఏవేళఁ జూచినం దన, శ్రీవాకిటఁ బగటివేళ శివయోగివరుల్

1. దేహారమింటి.

వేవేలసంఖ్య లుండెడు, రావేళ నొక్కళ్లు లే మియద్భుత మయ్యెన్. 39

తే. అప్పు డాశ్చర్య మంది వైశ్యప్రభుండు
మగుడి లోనికిఁ జనుదెంచి మంద్రభణితి
నోలతాతన్వి! శివయోగియొక్కఁడు లేఁడు
నేఁడు మొగసాల నిదియేమి మూఁడెనొక్కొ. 40

చ. ముసురుదినంబులందు మనమోసలఁ బంచటరుంగుమీఁదటన్
భసితవిభూషణుల్ పరమపావనమూర్తులు శైవసంహితా
భ్యసనపరాయణుల్ గిరిశభక్తు లనేకులు నిండియుండ్రు నేఁ
డసితసరోరుహాక్షి! యొకఁ డైనను లేఁ డిది యేమి చోద్యమో. 41

తే. వీథికై యేగి వత్తునా వేగవేగ, నేఁడుమాత్రము కొందఱు నియమపరులు
పాదసరసిజయుగళీ ప్రసాదమాత్ర, మబ్బెదరు గాక మనభాగ్య మల్ప మగునె.

వ. అని పల్కి తిరువెంగనాంచితో నేను జంగమప్రమథులం బురంబువీథుల వెదకి తేరం బోవుదుఁ గాన లింగార్చనములకుం దగినపదార్థంబు కూడంగూర్చుకొని యుండుమా! యని [1]చందనంబును భూతియుఁ జెందిరయుఁ బుచ్చికొని దప్పటంబు ధరియించి చిఱుతొండనంబి నిజగృహంబు వెలువడి యక్కాంచీనగరమునందు. 43

ఉ. అంగడి వేల్పుటిండ్ల సురావసథంబుల రచ్చపట్టులన్
జంగిలిసాలలం గణకశాలల వేశ్యలవాసవాటికా
ప్రాంగణభూములందు శివభక్తిపరాయణుఁ డర్థితోడుతన్
జంగమముఖ్యులన్ వెదకు సంభ్రమముం భయముం దలిర్పఁగన్. 44

తే. [2]బ్రెమని తప్పినపసరంబు వెదకినట్లు, బెరసి చేఁదప్పిపడ్డసొమ్మరసినట్లు
పురములో వాడవాడలఁ దిరుగఁ జొచ్చె, జంగమాన్వేషణార్థియై శైవవరుఁడు.

క. వచ్చినవాడకు వచ్చుం, జొచ్చినవాసంబుఁ జొచ్చుఁ జొచ్చినచోటే
యచ్చుగఁ గ్రమ్మఱఁ జొచ్చుం, బచ్చు శివార్చనకు శంభుభక్తుల వెదకన్. 46

వ. ఇవ్విధంబునఁ గంచియెల్లనుం బరికించి యెందునుం గానక కోట వదలి యక్కిరాటకులశ్రేష్ఠుండు తప్పఁగా నరిగి బాహ్యాళిప్రదేశంబునఁ బువ్వుందోఁట చేరువ నొక్క పాడుగుడిగర్భమంటపంబున నశీతివర్షదేశీయుండును జరాజర్ఝరిత దేహుండును బలితపాండుజటామండలుండును రుద్రాక్షమాలికాభసితత్రిపుండ్రాలంకృతుండు నై నిజవయోనురూప యగు గ్రుడ్డియవ్వ పాదంబు లొత్తుచుండఁ బులికలాసంబు మీఁదం బవళించి యున్నయయ్యవారికి శరణార్థి యగుచు మ్రొక్కి. 47

1. చందనంగనంది యీ జందియంబు దుప్పటంబుం బుచ్చుకొని. 2. బ్రమసి తప్పిన పసరంబు నెమకినట్లు.

ఉ. మ్రొక్కి కరాంబుజద్వయము మోడ్చి లలాటమునన్ ఘటించి మా
యక్కడ మీరు నీముసలియవ్వయు నేఁడు శివార్చనంబు స
మ్యక్కృతిఁ జేసి నన్నుఁ జరితార్థునిఁ జేయుట యుక్త మంచు నా
టక్కరిమాయజోగికిఁ దటాలు మనం బ్రణమిల్లి నంతటన్. 47

తే. నరసి వ్రాలినబొమలెత్తి పరమవృద్ధు, తల వడంకఁగ నొయ్య నీ రెలుఁగుపడుచు
నంబిసెమ్మోముఁదేరకొనంగఁ జూచి, శివుని కారుణ్య మనుచు నాశీర్వదించె. 48

క. దీవించి యతనివదనముఁ, జేవెలు గిడి చూచి యేమి చెప్పెదు చెపుమా
యే వీనుల వినఁ గావున, నీ వొత్తుచుఁ జెప్పు చెప్పె దేని మహాత్మా. 49

వ. అనినం జిఱుతొండఁడు కృతాంజలియై యుచ్చైస్స్వరంబున దేవా మాయిం
టికి శివార్చనంబు సేయ దేవియు నీవును విజయముచేసి మమ్ముం గృతార్థులఁ
జేయఁ విభూతి యందు మనుటయు. 50

సీ. నీవంశ మెయ్యది నీనామ మెఱిఁగింపు శివభక్తిసమయదీక్షితుఁడ వొద
పెండ్లాము నీకుఁ జెప్పినయట్లు సేయునే కులము సంతానంబు గలిగి యున్నె
కూడు సీరకు నింటఁ గొదవ లేకయుండునె యడిగినయర్థ మీ ననువుపడునె
యెదిరివా ఖండించు టిది దెప్పరముసుమ్మి చల్లజంపులు జోగిజంగకొలము

తే. లడిగితిమి గాని యెవ్వండ వైన నేమి, యొక్కభిక్షుకుగా నిన్ను నొరయ నేల
శైవవీరవ్రతాచారసాహసుండు, తనయుఁ డొక్కఁడు కల్గ నాపనికిఁ జాలు.

వ. ఈవృథాలాపంబులఁ బనియేమి నామనోరథంబు వినుము. 52

సీ. ఏఁడుకాలం బయ్యె నేను నిరాహార ఘోరవ్రతంబుఁ గైకొన్నవాఁడ
హరుని నుద్దేశించి యమ్మహావ్రతమున కుద్యాపనంబు పశూపహార
మయ్యాగపశువు నన్యం బేదియును గాదు నరుఁడు కావలయు నన్నరుఁడు బ్రాహ్మ
ణక్షత్రవైశ్యసంతతులలో నొక్కఁడే వాఁడును గడుఁ బిన్నవయసువాఁడు

తే. రోగశంకావిహీనుండు రూపసియును
వానితల్లియుఁ దండ్రియు వడుగు సేసి
పాక మొనరించి వడ్డింప భవున కొసఁగి
కుడుతు నాపఙ్క్తి నీవు నీకొడుకుఁ గుడువ. 53

వ. అనినం జిఱుతొండనంబి మహాప్రసాదం బయిన వైశ్యకులసంభవుండఁ దిరు
కచ్చినంబి సంబంధబాంధవుండ, నాపేరు చిఱుతొండనంబి యండ్రు. శివభక్త
లకుం బాదచర్య సేయుచుందు. 54

ఆ. భక్తుఁ డే వ్రతంబు పట్టె నావ్రతము పారంబుఁ బొందఁ జేయువ్రతము నాది

యీవ్రతంబు నాకుఁ జెప్పుడ నోడఁగూడ, దప్పుడు తిరు బాస యనఘచరిత.

వ. నీయానతిచ్చిన ప్రకారంబున నయ్యుపహారంబు సేయించెద విభూతి యందు
కొనుము, మాయింటికి విచ్చేయు మభ్యంజనస్నానం బవధరించిన యంతలోన
వంటకంబు లాయితంబు లగు నని ప్రార్థించిన. 56

శా. మో మడ్డంబుఁ గదల్చి మోఱకుఁడునుం బోలెన్ శివారాధకుం
డా మానాధికుతోడ ని ట్లనియె నయ్యా! వృద్ధ నే నీవచః
ప్రామాణ్యంబులు విశ్వసింప నతిదూరం బానతీవచ్చె నీ
రామారత్నము కాదు కూడ దనినన్ రాఁ జాల నీచోటికిన్. 57

చ. ఉదరమునన్ భరించి ప్రసవోద్భవవేదనఁ బొంది పిమ్మటన్
ముదిముది యైనపీతఁ బడి మూత్రమునం బడి లజ్జ వండుగా
నదవద యైనతల్లికిఁ బ్రియంబా సుతుండు వృథాభిమానదు
ర్మదుఁ డగుతండ్రికిం బ్రియుఁడా మానసవీథిఁ దలంచి చూడుమా. 58

వ. ఇంతకుఁ గతం బింత లేసి వీరమాహేశ్వరఘోరవ్రతంబులు నీవు చేసినయవి లేవు;
పుత్రస్నేహంబు సామాన్యంబు కాదు; నీవును నీభార్యయును విచారించుకొను
నది; యిక్కార్యంబు మీ కిద్దఱకును సమ్మతం బగు నేని. 59

తే. అందు నది భూతిఁ దొలుత నీయనుఁగుభార్య, యందుకొనువాఁడ వీవు ననంతరమున
నాలు మగఁడును నొకకత్తు లైనఁ గాక, యిట్టిధర్మంబు మిన్నక యేల కలుగు.

వ. మీ రిద్దఱు సమ్మతించితిర యేనియు హంతవ్యం డగుకుమారుం డీకా
ర్యంబునకు నెవ్విధంబున నొడంబడువాఁడు. 61

తే. నీకుఁ జంపఁగవచ్చుఁ బో నియమనిష్ఠఁ, దల్లి కోర్వంగవచ్చుఁ బో ధైర్యగరిమ
మాకు భుజియింపవచ్చుఁ బో మనసు తివుటఁ, జెలుత వానికిఁ[1] జావు దుస్తరము గాని.

ఉ. పాడయినట్టిచిత్త మొకపాటున నిల్వఁగ మాటిమాటి క
ట్టాడును నుండఁగానఁ దనయాత్మయునుం దన కిట్టి దౌ నన
గూడునో కూడదో యెదిరికోర్కి యెఱుంగుట యెట్టు పట్టియా
చూడఁగ దోసకాయలె విశుద్ధయశోధన యన్యచిత్తముల్. 63

క. శివభక్తుఁడ యిదికొని య,య్యువిదకును విభూతి యీ ప్రయోజనమునకై
యవుఁ గాక బెంకి కేగు మ, నవలంతియె కంచి నీకు నడుగామడయే. 64

వ. అనినం జెలుతొండండు నిజాంతర్గతంబునఁ దనభార్యకుం గలశివభక్తివిశ్వాసంబు
లును జంగమారాధననియమనిష్ఠయుఁ దనయానతి దాఁటమియునుం గుమార

1, జావంగ నతిదిగాని.

సిరియాళుండు నట్టివాఁ డగుటయు నెఱింగియు నాశివయోగితో నవ్వుఁగా దని
యుత్తరప్రత్యుత్తరంబులకు నెట్టుకొనంజాలక ఛందోనువర్తనంబ మహా
ప్రసాదం బని యతం డిచ్చు విభూతి యందుకొని నిజమందిరమునకు వచ్చినంత.

తే. ఇంటిలోనుండి వెలుపలి కేగుదెంచి, యంగనారత్న మగుతిరువెంగనాంచి
భర్తముఖరాగమీక్షించి ప్రమదమొందె, గాలమున నెందుశివయోగి గలిగెననుచు.

వ. చిఱుతొండనంబియు నాబింబాధరకు శివయోగి సంభ్రమించుటయుఁ దద్వ్రత
చర్యా ప్రకారంబును నాదిమధ్యావసానంబుఁ దెలియం జెప్పుటయు నయ్యింతి
యింతయు మిసిమింతురాలుగాక మునిముసినవ్వు నవ్వి మనశరీరార్థప్రాణంబు
లకుం గర్తలు శివయోగీశ్వరులే కాక మఱి యెవ్వరు ? వారిసొమ్ములు వారికే
సమర్పించు టదియును నొకదొడ్డపనియే యెటు విశేషించి. 67

చ. తలచినయేని నబ్భువనవంద్యునకున్ [1]శివయోగి నేతకున్
బాలకయి గారవం బయినపుత్రకుఁ డొక్కఁడ యేల మాంసమున్
తలముగ మీరు నేను నగువారమె కామె విభూతిఁ దెం డిఁకం
బలుకులు వేయు నేటి కలభక్తుని నేమమ పార మొందుతన్. 68

వ. అనినఁ దదర్థంబు నిశ్చయించి చందనికకు నవ్వృత్తాంతం బంతయు నెఱింగించి
ముప్వురు నేకోద్యోగంబున శివయోగికిం బరిచర్య సేయువారైరి. చిఱుతొం
డండును శివయోగిం దోడ్తేరం జనియె నటకుఁ బూర్వంబునందు. 69

చ. కపటపుమాయజోగి యగుఖండశశాంకధరుండు వృద్ధవే
షపుఁ దనరూపు వీడి వెలిచక్కఁన యుండఁగ నొండురూపుతో
నపగతదోషుఁ డైనసిరియాళకుమారకుఁ డొజ్జయింటిలో
లిపి పఠియింపఁగా మదిఁ జలింపఁగఁ జేయుకుతూహలంబునన్. 70

వ. వచ్చి చూచినంత. 71

ఉ. హస్తగృహీతపుస్తకమునందు లిఖించిన యిట్టి నీలకం
ఠస్తవమున్ బఠించుచు ఘనంబుగ ధీగుణవైభవోన్నతుల్
విస్తరిలంగ బాలకులు వేవురిలో సిరియాళుఁ డుండె న
భ్యస్తలిపిప్రపంచుఁడు గ్రహంబులలో నుడురాజు కైవడిన్. 72

తే. ఆజటాధారి చేరంగ నరుగుదెంచి, తనకు సాష్టాంగ మెరఁగి తాత్పర్య మెసఁగఁ
గేలుదమ్ములు మొగిడించి కెలన నున్న, చిన్నిముద్దులసిరియాళ సెట్టి కనియె. 73

శా. అన్నా ! యీచిఱుతొండనంబి యనుపాపాత్ముండు మీతండ్రియే ;

1. శివయోగిరాజునకున్.

యన్నిర్భాగ్యుఁడు జోగి కొక్కురునికిన్ హాలామదోన్మాదికిన్
నిన్నుం జంపి మహేశహారముఁ ఖండింపంగ నున్నాఁడు సం
పన్నస్నేహముతోడ నీకు నెఱిఁగింపన్ వచ్చితిం జెచ్చెరన్. 74

క. కడుపునఁ బుట్టినకూరిమి, కొడుకున్ సుకుమారమూర్తిఁ గులవర్ధనునిన్
మెడఁ గోసి జంపి నంజుడు, గుడుపులజోగులకుఁ బెట్టుక్రూరులు గలరే. 75

తే. దానవుఁడు గాక వాఁ డేటితండ్రి చెపుమ
చెక్కునిండినవస వల్కు చిఱుతవాని
బత్తుఁ డొక్కఁడు మధుపానమత్తుఁ డగుచు
నిన్ను వేఁడినఁ జంపఁగ నిశ్చయించె. 76

వ. "జీవన్ భద్రాణి పశ్యతి" యను వేదవచనం బవలంబించి యెక్కడికేనిం బోయి
యీబారి తప్పించుకొనుట నీకుం గర్తవ్యంబు. 77

చ. అనవుడుసుం గుమారసిరియాళుఁడు వీనులు మూసికొంచు నో
యనఘచరిత్ర నీకు నిటులాడఁ దగు నయ్య నీకుఁ గా
దని పలుకంగ నాకు భయ మయ్యెడుఁ గాక పరార్థమై తనూ
ధనము వ్యయింపఁ గల్గుట కదా జన్మనైకఫలం బెఱింగినన్. 78

తే. ఎఱుక చాలనివాఁ డందమే దధీచి, నల్పబుద్ధులె మేఘవాహనుఁడు శిబియు
ధరఁ "బరోపకారార్థ మిదం శరీర", మనెడువాక్యంబు వినవె సంయమివరేణ్య.

తే. అధ్రువం బైనమలభాండ మైనదేహ, మనఘ యన్యోపకారార్థమై వ్యయించి
ప్రవిమలంబుఁ గల్పాంతరధ్రువము నైన, కీర్తికాయంబుఁ గైకొంట కార్తియేల.

వ. అనిన జటాధారిజంగమప్రమథుండు వీఁడు చిఱుతొండనంబికంటె నధికుండు
పొమ్మనుచు మరలి పోవువాఁడు వెండియు. 81

తే. కపటమాయామహానాటకప్రపంచ,సూత్రధారుండు చిఱుతొండసుతున కపుడు
మూర్ఛరప్పించెహరుఁడందుమోసపోయి,యత్నరాచార్యుఁడునుభయమందనలసి.

శా. నోర న్నుచ్చిలు గ్రమ్మమై వడకఁ గన్నుల్తారకాబింబసం
చారవ్యాప్తి నథఃకరింప హృదయస్థానంబు కంపింప గ్రీ
వారంధ్రంబున ఘుర్ఘురధ్వనులు తీవ్రస్ఫూర్తి వర్తింపఁగా
సీరాలుండు ధరిత్రిమీఁదఁ బడి మూర్ఛిల్లె 1న్నిరాలస్యతన్. 83

క. మోహాంధకారధారా, వ్యూహమున సిరాలుసెట్టి యుసు లుడుగుటయున్
హాహాకారధ్వనికో,లాహల మచ్చోట గురుకులంబునఁ జెలఁగన్. 84

1. నిమేషంబునన్.

తే. ప్రణుతపంచాక్షరీమంత్రపారశక్తి, ఫాలమున దేశికుఁడు భూతిఁ బ్రాముటయును
గ్రమ్మఱను మూర్ఛ దెలిసె సిరాలసెట్టి, భక్తులకు భస్మమే కదా ప్రాణరక్ష. 85

వ. అంత నక్కడ. 86

సీ. చిఱుతొండఁ డావృద్ధశివయోగిపుంగవుఁ బ్రబలకుష్ఠవ్యాధిబాధితాంగు
వీఁపుమీఁద ధరించి వెనువెంట గ్రుడ్డవ్వ కోలూఁదికొని రాఁగఁ గూర్చుకొనుచు
బూది బొక్కణ లాతమును కమండలువును బులికళాసముఁ గరంబున వహించి
శరణీయు లెదురుగా శరణార్థి సేయుచు నొయ్యొయ్య సందడి కోసరిలుచు
తే. చంద్రశేఖర భూతేశ శర్వ రుద్ర, పార్వతీనాథ శంకర భవ గిరీశ
కాలకంధర హర కాలకాల యనుచు, వచ్చె నింటికి జనకోటి 1యిచ్చగింప. 87

మ. మహి నూహింపఁగ నెంతభాగ్యమొకొ యామ్నాయాంతసిద్ధాంతవా
ఙ్మహిళాకుంతలమౌక్తికాభరణమున్ మందాకినీశేఖరుం
గుహనాభైరవు యోగిపుంగవుని భర్గున్ రాజమార్గంబునన్
వహియించెం దనవీఁపునం దిరముగా వైశ్యుం డనాలస్యతన్. 88

ఉ. ఇంటికిఁ దెచ్చి యోగిపరమేశునకున్ వణిజుండు తాను వా
ల్గంటియు భక్తియున్ భయము గౌరవమున్ వినయంబు నాత్మలో
నంటుకొనంగ నప్డు ముసలమ్మకు నైతము కమ్మనూనె మై
నంటి నలుంగుతో జలక మార్చి 2యొసంగిరి ధౌతవస్త్రముల్. 89

వ. అనంతరంబ యేకాంతగృహంబున సర్వోపచారసంభారభరితంబుగా దేవతార్చ
నకుం బెట్టిన నయ్యాదిమదంపతు లిరువురు శివపూజావ్యాపారంబునం బ్రవర్తిల్లు
చుండి రప్పుడు శివాజ్ఞావశంబునం జేసి. 90

ఉ. పల్లియచోటనుండి యొల శిపాసెము నడుక్కులు జక్కిలంబులున్
బెల్లపుటచ్చులున్ సెనగబేడలుఁ జిమ్మిలి నువ్వుటుండలున్
బెల్లుగ నంబివియ్యములు పెద్దతికంబు ప్రియంబు నొప్ప మే
నల్లునకుం గుమారశిరియాలునకుం గొని తెచ్చి రర్మిలిన్. 91

వ. అంత. 92

సీ. ఫాలపట్టికయందు భస్మత్రిపుండ్రంబుఁ గర్ణంబులను రాగికమ్మ దోయి
కరమునం దిత్తడికంబంపుఁగంబెయు ఘనకుచంబులమీఁదఁ గావిగంత
కటిమండలంబునఁ గరకంచుఁబుట్టంబు మడఁచి కట్టినమేలినడిమికట్టు
కేలుఁదామరయందుఁ గేదారవలయంబు గడకుచ్చుమీఁదఁ బచ్చడపుఁగండ 3

1. పిచ్చలింప. 2. రి యిచ్చిరి. 3. ప్రాఁగుటడుక్కులు.

తే. సంతరించి పదాఱువర్షములవయసుఁ, బచ్చిబాలెంతరాలు తాపసపురంధ్రి
నంబిభామినిఁ దిరువెంగనాంచిఁ జేరి, పాలువోయింపుఁ డమ్మ పాపనికి ననియె.

ఉ. మక్కువ రేఁగి నెయ్యపుఁగుమారునిఁ జంపుట కంతరాయమై
యక్కటికంబు పుట్టుటకు నల్లన వచ్చి భవాని యత్తఱిం
దక్కటిమాయజోగతవిధంబున బిడ్డకుఁ బాలు వేఁడ నా
యక్కయుఁ బోసె నెల్లసమయంబులఁబోలె నిరాకులాత్మయై. 94

తే. పాలువోయించుకొని యాకృపాళుమూర్తి
శూలినాంచారి పాలిండ్లచూచుకములు
పాలచేఁపున గిలిగింత వాఱుటయును
మెత్తమెత్తన నఱచేత నొత్తుకొనుచు. 95

వ. తిరువెంగనాంచితో ని ట్లనియె. 96

మ. ప్రజలెల్లం బురిఁ గ్రంతక్రంతల మహాపాపంబుగాఁ బల్కెడున్
నిజమో కల్లయొ కాని మీ రఁట కడున్ నిస్త్రింశభావంబునన్
నిజపుత్రున్ సుకుమారుఁ జంపి యొక దుర్నిర్వాణికిం జోగికి
న్భుజియింపంగ నొనర్చువార టిది యెందుం గల్గునే యిద్ధరన్. 97

క. జోగులు కపటోపాయ, ప్రాగల్భ్యంబున నిధాననవసిద్ధులకై
యేగతుల నైనఁ దిరుగుదు, రోగిరముగ సుతునిఁ జంపు టుచితమె మీకున్. 98

తే. ఆవగింజంత భూతి మై నలఁదికొనిన, వెలఁది గుమ్మడికాయంత వెట్టి పుట్టుఁ
గటకటా యెట్లు తనబుద్ధి కాటఁగలియ, నిసువుఁ జంపంగఁదలఁచెనో నీమగండు.

క. కానండు గాక కన్నులు, దానేమిటివాఁడు నీదుతనయునిఁ జంపన్
మానవతీ "మగవాఁడో, మ్రానో" యనుమాట నేఁటిమాటయె చెపుమా. 100

వ. అనినం దిరువెంగనాంచి యక్కపటపుంజంగమదేవిమాటలు వినక నిర్వికారంబైనయాకారంబుతో నమ్మా శివుఁ డన శివయోగి యన భేదంబు గలదే? శరణార్థుల యర్థప్రాణంబులు శివాధీనంబులు, శివుండు కర్త, శివుండు భోక్త, యీయర్థంబునకుం జింతింప నేల? నీకుం దడవయ్యెడు. బాలెంతరాలవు చన్నులు చేఁపుచున్నవి బిడ్డ యింత కెంత యలమటం జెందునో పాలు చాలుగదా! యెప్పుడు మాయింటికి వచ్చుచుం బోవుచుండునది నిండుకొని యుండు మని కేలుదోయి ఫాలంబునం గీలుకొల్పి సముచితవ్యాపారంబులం బ్రవర్తించుచుండం జంకు గానరాక పార్వతీదేవియు నటనుండి చని యంతర్ధానంబు సేసె నాసమయంబున. 101

తే. చేర నేతెంచి చిఱుతొండనెట్టి యంత, యింతి తిరువెంగనాంచితో నిట్టు లనియె

నొజ్జలగృహంబునకుఁబోయి యుత్పలాక్షి, వడుగు సేయఁగవలెఁ బిన్నవానిఁ దెమ్ము.

చ. చెలువ కుమారుని న్వడుగు సేసినచేతడి యాఱకుండఁగాఁ
బాలుపెసలారఁగా నిరుగుపొర్గులవారల భాగ్యసంపదల్
కుల మభివృద్ధిఁజెంద మనకూరిమినందనుఁ బెండ్లి సేయఁగా
వలయు ననంతరక్షణమ వైభవ మొప్పఁగ ముక్తికన్యతోన్. 103

వ. అనిన నామెయు నట్ల కాక యని యాచార్యగృహంబున విద్యాభ్యాసముఁ
జేయుచున్న కుమారునిం దోడ్కొని వచ్చినంత. 104

ఉ. మంచిగ మేనయత్తలు సమాదరణం బడరంగఁ బెట్టి పు
త్తెంచిన మంచిభక్ష్యములు తేనియ నేతను ముంచి ముంచి భ
క్షించుచుఁ దల్లిఁ దండ్రిఁ దనచిన్నికరాంగుళి వంచి వంచి యూ
[1]రించుచు నిచ్చ మీఱఁగఁ జరించెఁ గుమారకుఁ డింటిముంగిటన్. 105

వ. అనంతరంబ. 106

సీ. జడలయల్లిక యూడ్చి సంపంగినూనియఁ, బిన్నకూఁకట్లఁ జొబ్బిలఁగ నంటి
గోప్యదేశంబు సంకుమదద్రవంబున నయమార నుద్వర్తనంబు సలిపి
గీసి గొజ్జఁగ నీరుపోసి నూతినక్రొత్త చిరుబంతి పసుపులో చెవపు నలఁది
కస్తూరిఁ బొరపినగంధసారంబుతో సీకాయయొరువున జిడ్డు పఱపి
తే. తేటనులివెచ్చనీరునఁ దీర్థమాడి, వేణి యీటార్చి సురపొన్నవిరులు ముడిచి
మడుఁగుకట్టి కాటుకయిడి తొడివిపూసి, భసితరేఖాత్రిపుండ్రంబు నొసటఁదీర్చి.

వ. కయిసేసి కుమారునిం గనుఁగొని జననీజనకు లిట్లనిరి. 108

ఉ. భైరవయోగి కొక్కనికిఁ బాశుపతవ్రతిచర్యతీరునం
బారణకై నిసుం బలలపాకము గా నొనరించి పెట్టుచు
న్నారము భోజనంబు ప్రియనందన! నీహృదయంబునందు సం
సారముఁ బాయఁ జాలనివిచారము లేదు గదా యొకింతయున్. 109

వ. అనినం గుమారసిరియాళుండు. 110

శా. సంసారభ్రమ మించు కేనియును మత్స్వాంతంబునన్ లేదు మీ
వంశం బీపరిపాటిదే యుడుగుఁడీ వైక్లబ్యసంభావనల్
మాంసాహారము నయ్యెదన్ శివునకున్ మాయామహాయోగికిన్
హింసాక్లేశము మానుఁడీ గురులు మీరే మిమ్ముఁ బ్రార్థించెదన్. 111

వ. అని పల్కె నప్పుడు. 112

---

1. ఱించుచు నాడెమిన్నగమి జేని కుమారకుఁ డింటిముంగిటన్. తి. పా.

ఆ. చావ నియ్యకొనినసత్పుత్రకునకును, జంప నియ్యకొనినదంపతులకుఁ
దారతమ్య మెద్ది వీరమాహేశ్వరా, చారసమయమార్గ గౌరవమున. 113

వ. ఇవ్విధంబున ముగ్వురును జందనికాపురస్సరంబుగా నేక నిశ్చయు లయిరి. తద
నంతరమున. 114

సీ. చన్నిచ్చువాగున జనయిత్రితొడలపైఁ బనిబిడ్డఁ బవ్వళింపంగఁ బెట్టెఁ
జందనిక తనహస్తప్రణాళంబులు క్రింద నంటుక సంతరించుకొనియెఁ
జిన్నిబుగ్గల లేఁతచిఱుతనవ్వు వెలర్ప శిరియాలుఁడు మొగిడ్చెఁ జేయిదోయి
చిఱుతొండనంబి క్రొమ్మెఱుఁగారు గురుకత్తి వాఁడిగా నూరుచు వంక దీర్చె
తే. నేకమై యట్లు ముగ్వురిహృదయములును, గుందకానందవారిధియందుఁ దేలె
గురులు ముగ్వురును గుమారవరునితోడ, నేకవాక్యంబుగాఁ బ్రీతి నిట్టు లనిరి.

మ. మది శంకింపకు మన్న! మావలనిప్రేమస్నేహవాత్సల్యసం
పద పాటింపకు మన్న! నాలుకతుదిన్ బంచాక్షరీమంత్రముం
బదిలం బొప్పఁ బఠింపు మన్న! పరమబ్రహ్మార్థసంసిద్ధి యి
య్యది సుమ్మన్న! యనుంగునందన! శిరాలా! వీరశైవవ్రతా. 116

ఉ. నంబి శివార్థము న్ననసునమ్మిక శంక యొకింతయేని చి
త్తంబునయందు లేక వనితామణియూరవుఁ దాపుఁ జేసి తీ
క్ష్ణం బగుకత్తి మోప మెడ గ్రక్కునఁ ద్రెవ్వ నమశ్శివాయమం
త్రంబుఁ బఠించుచుండెను శిరాలుశిరంబు వసుంధరాస్థలిన్. 117

ఉ. కందక గాజువాఱక వికారము దప్పక మందహాసని
ష్యందము చెక్కుటద్దముల జాఱక నెమ్మది నిద్రవోవున
ట్లందము నొందె ధాత్రి శిరియాలకుమారునివక్త్రచంద్రుఁ డా
నందము నొందె నప్పు డెలనాఁగమనంబును భర్తచిత్తమున్. 118

తే. పన్నిదం బాడి గెలిచినభావ మొప్ప, నప్పు చక్కంగఁ దీర్చినయనువు మెఱయ
సలియఁ బఠియును గారంపుసుతు వధించి, వరుస నడపిరి వీరశైవవ్రతంబు.

మ. మిరియము న్నల్లియున్ బసుపు మెంతియు నింగువ జీరకంబు శ
ర్కరయును జింతపండును గరాంబువు గమ్మనినేయి తైలమున్
బెరుఁగును మేళవించి కడుఁ జెక్కువిధంబులఁ బాకశుద్ధి వం
డిరి శిరియాలునిం గటికిడెందమునం దరళాక్షు లిద్దఱున్. 120

సీ. కమ్మగాఁ గాఁచినకట్టునంజుళ్లను నీరు వెళ్లఁగ నొత్తి నేత వేఁచి
చక్కఁగాఁ దఱిగిన సన్నమాంసంబులు పరిపాటిమై జుఱ్ఱుఁబడను వండి

మూల్గులెమ్ములతోడ ముదకగా కుండఁగ జాదుచేసిననల్లచాఱు గాంచి
వలయుసంబారాలు వడియాలు బలియించి దళమైనక్రొవ్వుతోఁ దాలఁబోసి
తే. షడ్రసోపేతములు గాఁగఁ జతురభంగి, నమృతపాకంబులుగఁ జేసి రాత్షణంబ
సెట్టి శిరియాలు వంశాబ్ధి శీతకరుని, సతులు తిరువెంగనాంచియుఁ జందనికయు.

క. నానావిధపాకములుగ, నానాలుగఁ జేసి యపుడు నాల్గువిధములన్
బోనాముదొంతిఁ జేర్చిరి, సూనాస్త్రసమానుఁ డైన సుతు శిరియాలున్. 122

సీ. నిగనిగం గాఁ దోమి నిండుబోనముదొంతి భోజనశాలలోఁ బొసఁగఁ జేర్చి
చెలువ గొజ్జఁగనీటిచేపట్టు గావించి పాటించి రత్నకంబళము పఱచి
దేవతార్చను ధూపదీపాదు లొడఁగూర్చి కప్పురంబున మ్రుగ్గు గలయఁబెట్టి
యెడమదిక్కున రాగిపడిగెంబు ఘటియించి గరగతో విమలోదకములు డించి
తే. యతివ సర్వాయితం బయ్యె నయ్యగారి, కారగింపఁగ నవసరం బనుచుఁ బలుక
సెట్టి తోడ్తెచ్చె జంగమసిద్ధవృద్ధు, నంధురా లగుముదుసలియవ్వతోడ. 123

క. శ్రీపాదంబులు గడిగెను, శ్రీపాదోదకముఁ గొనియెఁ జెలువయుఁ దానున్
వ్యాపారిసార్వభౌముం, డాపరమతపస్వి నునిచి యర్చించెఁ దగన్. 124

వ. అనంతరంబ చిగురు ముదురునుం గాని నిడుపు వెడల్పుం గలకదళీపలాశంబు నడిమి యీనియఁ బుచ్చి పఱచి యుదకంబునం బ్రక్షాళించి యుపస్తరించి పాయసాపూప సూపపుండ్రేక్షుద్రాక్షాగోక్షీరమధుశర్కరాఘృతదధిరసావళీ శాకపాక శిఖరిపానకంబులతోడ గారాపుంగొడుకుపాల మేలోగిరంబుతోడం గూడ భరితభోజనంబుగా వడ్డించి గుడ్డియవ్వకు నైతె మట్లనే సమర్పించి, దేవ! భక్తవత్సల! శివయోగీశ్వరరూప! విరూపాక్ష! యమృతాహారం బారగించి రక్షింపు మని చిఱుతొండఁడు భార్యయుం దానును భక్తితాత్పర్య విశ్వాసపురస్సరంబుగా నమస్కరించిన. 125

ఉ. భైరవయోగిరాజు పసిపాపనినంజుడుఁగూరలందు లో
నారసి చూచి మస్తకమునందలిమాంసము లేమి గాంచి యీ
నీరసమాంస మేటికి వణిగ్వర! పుత్రునియుత్తమాంగముం
గూరలు సేయ వైతి వివిగో నిజపుత్రనిసర్గమోహముల్. 126

తే. కటకటా! మా వ్రతంబు భగ్నంబుఁ జెందె, నేటిపారణ మిది మాకు నేటి కింక
నుత్తమాంగపుమాంసము నుజ్జగించి, యేల యధమాంగమాంస మే నెటు భుజింతు.

వ. అనిన విని చిఱుతొండండు భయంపడి వెలవెలంబాఱుచుఁ దిరువెంగనాంచి వదనం బాలోకించి యింక నెట్లనినం జిట్టమిడుచు నంతఁ దలకాయపా(పొ)ల మేలోగిరంబు ముందటం బెట్టి చందనిక యిది యేను మొదలన వెడందకాం

ద్రగుయోగిబృందారకులచందం బెఱింగినదాన నగుటం జేసి పాకంబుఁ జేసికొని
యున్నదానఁ దపస్వి చిత్తం బేపాకంబునుం బొందకుంగ వడ్డించెదం గా కని
యట్లు చేసిన నక్కుహనాభైరవుండు వెండియు. 128

తే. బంతి నీ వారగింపక పరమపుణ్య!, నాకుఁ జేయాడునే భోజనంబు సేయ
నొకఁడు భుజియించు టెన్నఁడు నొప్ప దనెడు, వేదవాక్యార్థ మన్న దివిన వె చెపుమ.

వ. మఱియు నొక్కభోజననియమంబు కలదు పిన్నవాఁడు బంతిభోజనంబు సేయక
కూడదు నోటికిం బోదు; మగబిడ్డండు లేనినిర్భాగ్యునింట భోజనంబు సేయఁ
గూడదు. నీకుమారు నాబంతికి రప్పింపు మారగించెద మనవుడు. 130

మ. మొదలం దేవర యానతిచ్చితిర యేముం జిత్తమం [1]దెంతు మ
య్యది నాకుం గొడు కింకనుం గలఁడె? వాఁ డాడంగ వేంచేసెనే?
చదువం బోయెనొ?, పిల్వఁ బంతు నెటు! నేఁజూడం బ్రతీక్షింతు నీ
యదనం గూరలు చల్లనారవె మహాత్మా! యోగిచూడామణీ! 131

వ. అనిన నత్తపోధనుఁ డిట్లనియె. నీయుత్తమాంగన యెలుం గెత్తి నలుదిక్కులం
బిలుచునది. కుమారుండు వచ్చెనేని బంతిం బెట్టుకొని భుజింతము. రాకుండె
నేని నేమును నీముసలియవ్వయుం గుడుత మటుగాక యొఱగొడ్డెంబులు పలికిసీ
పడ్డపాటు గొడ్డేఱుఁగా జిడ్డుపఱపం గలవారమె! యనినం బ్రసాదం బని
పతియనుమతిం బురంధ్రీరత్నంబు. 132

సీ. రారా వణిగ్వంశవారాశిహిమధామ! రారా వికస్వరాంభోరుహాక్ష!
రారా మహాఘోరవీరశైవాచార! రారా ఘనౌదార్యరాజరాజ!
రారా కుమారకంఠీరవేంద్రకిశోర! రారా సమగ్రధీరాహిణేయ!
రారా మనోభవాకారరూపవిలాస! రారా యసారసంసారదూర!

తే. రార నావన్నెపడుగ! రారా తనూజ!, రార శిరియాల! రార నాప్రాణపదమ!
రార నాకన్న! రాజియ్య! రార యనుచుఁ, జీరుఁ గారాపుఁగొడుకు రాజీవనయన.

శా. అత్తన్వంగి సమస్తదిక్కులను పర్యాయక్రమం బొప్పఁగా
నొత్తెం జిన్నికుమార రార యని యత్యుచ్చైశ్శ్రుతిం జీరినం
జిత్తంబుం గనవచ్చె బాలుఁడు మహాశీఘ్రప్రచారంబునన్
దత్తద్వ్యంజనపాకగంధ్యవయవస్థానప్రతానంబుతోన్. 134

శా. రక్తాపాండుర మైనదేహము నహీంద్రవేయముం గంధరా
కుక్షిం గప్పను బ్రస్ఫురద్ఘనజటాకోటిన్ శశాంకార్ధముం

1. దున్మజా, మది.

జక్షుఃపద్మముతోడ ఫాలతలముఁ సంధిల్ల శంభుండు ప్ర
త్యక్షం బయ్యె శిరాలుతండ్రికి హృదాహ్లాదంబు సంధిల్లఁగన్. 135

వ. అప్పుడు భయభక్తితాత్పర్యంబులు మనంబున ముప్పిరిగొన నప్పరమమాహే
శ్వరుం డిట్లని స్తుతియించె. 136

మ. జయ హాలాహలనీలకంధర! మహేశా! భక్తచింతామణీ!
జయ గంగాధర! చంద్రశేఖర! జగత్స్వామీ! కృపాంభోనిధీ!
జయ నీహారధరాధరేంద్రతనయాచారుస్తనద్వంద్వసం
శ్రయసంలగ్నపటీరకుంకుమరజస్సంపన్నబాహాంతరా! 137

వ. అని మఱియు ననేకప్రకారంబులం బ్రస్తుతించె నిట్లు ప్రత్యక్షం బైనవిరూ
పాక్షుండు చిఱుతొండనంబీ! నీవు తుంబురుండవు శిరియాలుండు కుమారస్వామి
తిరువెంగనాంచి యచ్చర. మీరిద్ద ఱొక్కకారణంబున మర్త్యయోనిం
జనించితిరి. మీమీ స్థానంబులనుండి తొంటిచందంబున నన్నుం గొలువుండు.
శరీరంబులతోడం గైలాసంబునకు రం డని యనుగ్రహించిన. 138

సీ. వైశ్యాన్వయంబున వసుధ వర్ణన కెక్కె వేయిగోత్రంబుల వినుతిఁ గాంచి
వీరమాహేశ్వరాచారంబు వదలక యేడువాడలవార మేము గలసి
వర్తిల్లుదుము వాసి వట్ట మేమియు లేక యిట్టిబంధులఁ బాసి యే నొకండ
రా బుద్ధి రాదు తారకరాజశేఖర! యిందఱఁ గొనిపోయి తేని వత్తుఁ
తే. గూర్చుకొని పోవు నీ కొడఁగూడె నేని, నట్లుగా కున్న విచ్చేయు మభవ మరలి
ప్రమథసన్నిధి కేమియు బాధ లేదు, కొలిచెదము నిన్ను మేమెల్లఁ గూడిమాడి.

వ. అనిన శంభుండు కరుణించి యేడువాడలుఁ గదలివచ్చునది. నీకుం బ్రియం బగు
నివ్వరం బిచ్చితి నని యానతిచ్చిన తత్క్షణంబ. 140

తే. కంచిలో నేడువాడలఁ గలిగినట్టి, నాజౌపుంగోమటులతోడ నంబిసెట్టి
యఖిలజీవరాసులఁ గూడి యభ్రవీథి, భాసురస్ఫూర్తి నేగెఁ గైలాసమునకు.

వ. ఇది కావేరీవల్లభులును నుభయరావలులును గిష్కింధాచలక్రీడావినోదులు
నయోధ్యాపురాధీశ్వరులును నగువైశ్యకులంబులవారలకుం గూటస్థుం డయిన
చిఱుతొండనంబి యుపాఖ్యానము వినినను జదివినను వ్రాసినను బుత్రపౌత్రా
భివృద్ధియును ధనకనకవస్తువాహనసమృద్ధియుఁ నిష్టార్థసిద్ధియు నగును. 142

ఆశ్వాసాంతము

శా. చాముండాపరమేశ్వరీవరకృపాసంవర్ధితైశ్వర్య! ని
స్సీమప్రాభవ! లక్ష్మణాగ్రజ! సుధాసిక్తాక్షరాలాప! య

భ్యామధ్యార్జునవీరశైవసమయవ్యాపారపారీణతా
సామాన్యప్రతిభావనిర్వహణదీక్షా ! శర్వరాధీశ్వరా ! 143

క. కర్పకటకాంఘ్రిసేవక, కర్పూరవసంతరాయ ! కావేరీశా
దర్పితరిపుగర్వతమోఽ, హార్పతిసౌందర్యరత్న ! యంబురుహాక్షా. 144

తోటకవృత్తము.
అలకాధిపతీ ! సుగుణాభిరతీ ! మలయోద్భవచంద్రసమానయశా !
కలపావన ! యూరుజగోత్రవరా ! లలనాజనతారుణ్యలక్ష్మనిభా. 145

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర వినయవిధేయ శ్రీనాథనామధేయప్రణీతం బైనహరవిలాసం బనుమహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము.

---

# తృతీయాశ్వాసము



పర్వతసోపాన
స్థాపక! వేమక్షితీశసామ్రాజ్యశ్రీ
వ్యాపారిముఖ్య! యన్వయ
దీపక! యలకాధిరాజ! దేవయతిప్రా! 1

వ. ద్వితీయవిలాసం బైనగౌరీకల్యాణం బాకర్ణింపుము. 2

ఉ. తారకుఁడన్ మహాసురుఁడు తామరసాసనదత్తమైనదు
ర్వారవరానుభావమున వ్రాలి త్రిలోకము నేలుచుండు ని
ష్కారణతీవ్రబాధ ననిశంబును ముప్పదిమూఁడుకోట్లబృం
దారకులన్ మహర్షులఁ బ్రతాపగుణంబున నొచ్చి పాఁతుచున్. 3

తే. నిరపరాధబాధితు లగునిర్జరులకు, బంధమోక్షంబుఁ గావించు గంధవహుఁడు
సతులపయ్యెద వెడలించి చన్నుఁగవకుఁ, దప్పు సేసియు దైత్యుచిత్తంబు వడసి.

మ. ప్రకటస్నేహదశాధురంధరత పర్వంగా నిశీథంబులన్
సకలాంగంబులు నిక్కి దీపకలికాస్తంభంబులై యుండ్రు పా
యక చూడామణు లొప్ప రాక్షసుని శుద్ధాంతంబులన్ శేషవా
సుకికర్కోటకతక్షకప్రముఖచక్షుశ్శ్రోత్రబృందారకుల్. 5

తే. దానవునివీటిలోన మార్తాండుఁ డెండ, యంతమాత్రంబ కాని కాయంగ వెఱచు
నెంతమాత్రము కాసిన నెలమిఁ బొందుఁ, గేళిదీర్ఘికలందుఁ బంకేరుహములు.

మ. పటుదిగ్వారణగండమండలలసత్ప్రత్యగ్రదానచ్ఛటా
కటుగంధం బగునీరు చిక్కనివియద్గంగాప్రవాహంబులో
పటిహైమాంబుజనాళముల్ వెతికి యూడ్వం జేయు దేవాళిచే
నిటు దైతేయుఁడు కేళిదీర్ఘికలలో నిచ్ఛావినోదంబుగన్. 7

తే. ఐంద్రమాసుర మాగ్నేయ మైలబిలము, వాయవీయ మైశానంబు వారుణంబు
యామ్యమును మున్నుగాఁ గలయష్టదిశలు, తాన కైకొని కైకోఁడతండు సురల.

వ. ఇవ్విధంబునఁ దారకాసురుండు కాసకాక్ష తామ్రాక్ష ధూమ్రాక్ష చతురోదగ్రఖడ్గరోమ బాలభిడాల కాలనేమి ప్రధానానాబంధుసహాయుండై పాకశాసనపావక పరేతరాజ పలలాశి పాశి పవన పౌలస్త్య పన్నగాభరణులఁ బరిభవించి నిర్జరులం దర్జించి కిన్నరుల వెన్నుసూచి కింపురుషులఁ జంపి గరుడుల బడలుపఱచి గంధర్వుల బంధించి గుహ్యకుల సంహరించి యక్షుల నధిక్షేపించి ఖేచరులఁ గీటడంచి యచ్చరల హెచ్చు గుందాడి సిద్ధులకు బుద్ధిసెప్పి సాధ్యుల సాధించి మహోరాజికులరాజసం బుడిపి విద్యాధరుల నధఃకరించి మహాఋషుల నదలించి పితరులఁ బ్రతిబంధించి వసువులఁ బరిమార్చి రుద్రులకుపద్రవం బాపాదించి విశ్వేదేవతల కనాశ్వాసంబు సేసి యవశ్వరం బగునైశ్వర్యంబున నప్రతీపం బగుప్రతాపంబున నవార్యం బగువీర్యంబున నవక్రం బగుపరాక్రమంబున నస్తోకం బగువివేకంబున నేకాతపత్రంబుగాఁ ద్రిలోకంబు నేలుచున్న కొంతకాలంబునకు. 9

సీ. అనువు దప్పిరి నొచ్చి రలసి రాపద నొంది రదవద లైరి చీకాకుపడిరి
యంగలార్చిరి విచ్చి రాఱడిఁ బొందిరి బ్రమసిరి పాఱిరి పల్లటిలిరి
బెగ్గడిల్లిరి పికాపిక లైరి సొలసిరి కలకలఁ గూసిరి కుతిలపడిరి
గగ్గులకా డైరి కలఁగి రోటాఱిరి వెలవెల్ల నైరి నివ్వెఱఁగుపడిరి
తే. యసవుసవు లైరి గుజగుజ యైరి డస్సి, రొల్లఁ బోయిరి వెగ్గిరి తల్లడిలిరి
సిగ్గువడి రొచ్చవడిరి యుస్సియని యైరి, తారకుని చేత మునులు బృందారకులును.

ఉ. ఇట్టివిధంబునన్ విబుధు లెప్పుడునుం గనుఁగాపులట్లు ము
వ్వెట్టియుఁ జేసి చేసియును వేసరి యింద్రుఁడు మున్నుగాఁగ ది
క్కట్టిటు లున్నమా కనుచు నేగిరి పద్మజుఁ గూర్చి యేగి కూ
పెట్టిరి హాస్తముల్ మొగిచి పెద్దయెలుంగునఁ దద్గుణస్తుతుల్. 11

వ. జయ జయ జగన్నాథ ! జగజ్జననస్థితిసంహారకర ! జంభారిప్రముఖనిఖిలబర్హిర్ముఖశిఖామణీమయూఖమంజరీరంజితపాదపీఠ ! జలజాసన ! జాహ్నవీప్రముఖసకలతీర్థతీర్థసంపూర్ణస్వర్ణకమండలుధర ! జపతపోనిష్ఠాగరిష్ఠమునిమనోధిష్ఠాన ! ఋగ్యజుస్సామాథర్వణమయనానానిశ్వాస ! హిరణ్యగర్భ ! భూర్భువస్స్వస్త్రయీశుకీపంజర ! నిరంజన ! భారతీవిహారసౌధాయమానచతుర్వదన ! సనాతన! సనత్కుమారజనక ! శతానంద ! శాశ్వత ! విశ్వతోముఖ ! నిర్వికల్ప ! నిరీహ ! నిరాకార ! ఓంకారగమ్య ! అదిగ్దేశకాలవ్యవచ్ఛేదనీయ ! ఆదిమధ్యాంతశూన్య ! అవ్యయ ! అవాప్తసకలకామ్య ! అనంత ! అద్వితీయ నిరస్తసమస్తోపాధిక ! సచ్చిదానందస్వరూప ! సమస్తే నమస్తే నమః. 12

సీ. సృష్టికి నటమున్న చిన్మాత్రసంశుద్ధిఁ గేవలాత్మత్వ మంగీకరించి
పిమ్మట మూర్తిప్రభేదంబు వహియించు గుణసంవిభక్తికి కారణము గాఁగ
నీళ్లలో నాఁదితి నిఖిలప్రపంచమై పెరుఁగంగఁ జాలిన బీజ మొకటి
మూఁడవస్థల జగంబున కుద్భవస్థితి సంహారములు లీల సల్పు దేవ
తే. నీదునిట్టూర్పు గాడ్పులు నిగమపఙ్క్తి, ప్రణవమంత్రాక్షరము నీకు భద్రపీఠి
విలయకాలంబు నీనిద్ర విశ్వమునకు, నీప్రబోధంబ యుదయంబు నిఖిలమునకు.
తే. అవధరింపుము విన్నపం బాదిపురుష!, యవధరింపుము మమ్ము లోకాధినాథ!
తడవు సేయక రక్షింపు తమ్మిచూలి!, తారకుఁడు మమ్ముఁ బెక్కుదుర్దశలఁ బెట్టు.
చ. పడితిమి కక్కులుంబడినపాటులు దుర్భర మైనవృత్తి వె
న్బడితిమి గర్భయాచకులభంగి దరిద్రత నట్టుకొంచు లోఁ
బడితిమి పాలలోఁ బడినబల్లులకైవడి నెల్ల వెంటలం
జెడితిమి వేయునేల సరసీరుహసంభవ! దుష్టదైత్యుచేన్. 15
తే. తారకుం డెవ్విధంబున ధ్వంస మొందు, నెట్లు బ్రదుకుదు మేము మాకేదిదిక్కు
చిత్తగింపుము దేవ! సంశ్రితజనార్తి, హరణపారీణ! కరుణారసార్ద్రహృదయ!
వ. అని కరుణంబుగా విన్నవించిన హిరణ్యగర్భుండు ప్రసన్నుండై బృందారకులను మహర్షులనుం గనుంగొని యిట్లనియె. 17
సీ. వెఱవకుం డింద్రాదివిబుధపుంగవులును శాండిల్యభృంగాదిసంయములును
నస్మద్వరప్రభావానుభావంబున వాఁ డింతవాఁ డయ్యె వాఁడి మిగిలి
విషవృక్ష మేనియు వృద్ధిఁ బొందఁగఁ జేసి తనకుఁ గాఁ బెఱుకుట తగవు గాదు
పార్వతీదేవికి భవున కుద్భవ మైన తేజంబు వాని మర్దింపఁ గలదు
తే. తండ్రి యగుదక్షుమీఁదక్రోధంబువలన, యోగనిర్ముక్తదేహ యై యుద్భవించి
పెరుగుచున్నది హిమభూమిధరగృహమున, నమ్మహాదేవి శివుఁ గూర్చుఁడను వెఱింగి.
వ. ఇంతనుండియు మీకు మేలయ్యెడుఁ బొండని పురందరాదిబృందారకుల వీడుకొల్పి శతానందుండు యథోచితవ్యాపారంబులం బ్రవర్తిల్లుచుండె నిట్లు దేవతలు భావిశుభసూచకంబు లగుగంధవాహాదినానానిమిత్తంబు లనుసంధించుచు నిజస్థానంబుల కరిగిరి యనంతరంబున. 19
సీ. అటమున్న దక్షకన్యక తండ్రితో నల్గి యోగమార్గమున మే నుజ్జగించి
యపరజన్మంబున నజ్ఞాతియోనియై [1]యోషధులకు నెల్ల నునికిపట్టు
మేరుమందరవింధ్యపారియాత్రాదిసుప్రథితాద్రిసంబంధబాంధవంబు

1. అఖిల భూభరణ క్రియాక్షమంబు.

సైన నీహారశైలాధినాథునకును బితృదేవతలకన్నబిడ్డ యైన
తే. మేనకాదేవి కుదయించె మేలువేడ్క, నద్రిచెలికాఁడు మైనాకుఁ డన్న కాఁగ
నభిజనాఖ్య పార్వతి యన నఖిలజనని, యాదిశక్తి పురారియర్ధాంగలక్ష్మి. 20
క. పావనజంగమభువనకు,భావహమై విశదదశదిశాంతరమై యీ
దేవి యుదయంబు నొందిన, యావేళం గుసుమవర్ష మంతటఁ గురిసెన్. 21
తే. జనని విద్యుల్లతాభ మాచాయ గలిగి, క్రొత్త యుదయించినట్టియాకూఁతువలనఁ
గారుకాలంబుమణిశలాకయును బోలె, నొప్పెడువిదూరభూమికి యుద్ది యయ్యె.
వ. అనంతరంబ ప్రతిదినవర్ధమాన యై లబ్ధోదయ యగుచంద్రరేఖయుంబోలె బంధుజనంబులకుఁ బ్రమోదంబు సంధించుచు మందాకినీసైకతవేదికాస్థలంబులఁ గందుక క్రీడ సల్పుచు నుపదేశకాలంబుల విద్యలు నేర్చుచు బాల్యంబుఁ గడపి నేత్రోన్మీలనంబు సేసినచిత్రంబునంబోలె యౌవనవిభక్తం బై యభ్యుదయం బై యభ్యున్నతాంగుష్ఠనఖప్రభావిక్షేపంబున రాగంబు వెడలం గ్రక్కునవియుం బోనిచరణప్రవాళంబులు వృత్తానుపూర్వంబు లై యనతిదీర్ఘంబు లగు జంఘాప్రకాండంబులును వేదండశుండాదండంబులకు వైదండికంబులై యొప్పారునూరువులును మేఖలాకలాపమధ్యకీలితమహేంద్రనీలమాణిక్యకిరణరేఖయుంబోలె నాభిరంధ్రంబునం బుట్టి మీఁదికి నిగుడ రాజిల్లురోమరాజియును నవయౌవనారోహణార్థంబు మన్మథుం డొనర్చిన మణిసోపానంబులంబోనివల్లివిభంగంబులును గుదుళ్లు నిండఁ బలుకం బండిన మారేడుపండ్లగారాముఁ జెఱుచుగబ్బిగుబ్బల బెడంగులును నభినవశిరీషకుసుమసుకుమారంబు లగుబాహువులును ధర్మబంధురం బగుకంధరంబును సంపూర్ణపూర్ణిమా చంద్రబింబంబు డంబు విడంబింపం జాలునాననంబును గావియగుమోవియును నూఁబూవుకంటి నాసికయు నిద్దంపుటద్దములకుఁ దోడిముద్దు లగుముద్దుచెక్కులును సుమకోదండవల్లీమతల్లు లగుకటివంక బొమలును విదియనాఁటిచందురునకుం గదిసి చుట్టం బగులలాటపట్టంబును గొదమతుమ్మెదచాలుఁ బురుడింపం జాలునీలాలకంబులును నొప్పు సర్వోపమాద్రవ్యసముచ్చయం బగుసౌదర్యంబు నేకత్రావస్థానదిదృక్షచే విరించి సూక్ష్మీకరించి యథాప్రదేశనివేశితంబుగ నొనర్చెనో యనం దల్లిదండ్రులకు నామోదంబు నాపాదించుచుండ నొక్కనాఁడు నారదుండు సనుదెంచి.
క. త్రిభువనమోహన యగున, య్యిభగమనం జూచి పర్వతేశ్వరునిమహా
సభలో నిట్లని పలికెను, శుభవచనప్రౌఢి మెఱయ సురముని యెలమిన్. 24
సీ. ఈనీరజాతాక్షి మేనిలో సగపాలు గణుతింప మగ పాలు గాఁగ నున్న
దీపల్లవాధరశ్రీపాదపద్మంబు నొరయు నొక్కొక్కమా టుడుగణేశుఁ

ధీకాంతతోడ మందాకినీవాహిని సవతి గాఁ గల జేమిచందమునను
నీలకాతన్వికి నీకేడులోకంబు లభిరామకేళిహర్మ్యంబు లగును
తే. నిండువేడుకఁ గాంచు నీనీలవేణి, కొమ్ము లేనుంగుమొగ మైనకొడుకుఁగుఱ్ఱ
నత్తయును మామయును లేనిరిత్తయింట, మనువు మనిపెడు నీయింతి మగనితోడ.
ఉ. మాటలు వేయు నేమిటికి మంగళలక్షణలక్ష్మి యైనయీ
జోటికి భర్త గాఁ గలఁడు సోమకిరీటుఁడు సర్వదేవతా
కోటికిరీటకోటిపరికుంచితదివ్యమణిద్యుతిచ్ఛటా
పాటలపాదపీఠుఁ డగుపట్టి కృతార్థుఁడ వైతి భూధరా. 26
వ. అని చెప్పి నారదుండు చనియె నంతనుండి హిమవంతుండు నివృత్తాన్యవరాభి
లాషుండై యయ్యోషారత్నంబు శేషభూషణునకు నీ నిశ్చయించియు నభ్యర్థ
నాభంగభయంబునం జేసి. 27
క. తన్నడుగ రానిశివునకుఁ, గన్నియ నెట్లిత్తు నతనికారుణ్యము నా
కెన్నఁడు సిద్ధించునో యని, యన్నగపతి యాత్మఁ దలఁచె నౌత్సుక్యంబున్.
వ. అంత విరూపాక్షుండు దక్షరోషంబు కారణంబుగా దాక్షాయణి శరీరమోక్షం
బుఁ జేసినది మొదలుగా సర్వసంగపరిత్యాగంబుఁ గావించి యపరిగ్రహుం డై.
సీ. గంగాప్రవాహసంక్షాళితాభ్యున్నత రుద్రాక్షదేవదారుద్రుమంబుఁ
గస్తూరికాకురంగజనాభిపరిమళ శ్లాఘ్యేందుకాంతపాషాణతలముఁ
గిన్నరద్వంద్వసంభిన్నపంచమరాగ [1]మూర్ఛనులాపసమ్మూర్ఛితంబు
నిర్యన్మహావేగనిర్ఝరీఘూత్కార ఘుమఘుమాయతదిశాగోళకంబు
తే. నైనహిమశైలపాదంబునందు నియతిఁ, దపము సేయంగ మదిలోనఁ దలఁచి విడిసెఁ
బ్రమథవర్గంబుఁ దానును బసవఁ డపుడు, కృత్తివాసుండు విషయనివృత్తుఁ డగుచు.
తే. ప్రమథు లెల్లరు విడిసి రప్పర్వతమునఁ జంద్రకాంతశిలామణిస్థలములందు
నమరియుండు నమేరువృక్షములనీడ, భూర్జతరుచర్మ పరిధానములు ధరించి. 31
చ. బసవఁడు ఱంకె వైచి హిమపర్వతచారువనాంతరంబులం
బసిరిక మేసి నిర్ఝరులఁ బాఱెడుతియ్యనినీరు గ్రోలి క్రొ
వ్వెసఁగ ఘణాఘణధ్వనుల నుల్లస మాడెడుఁ దత్పురంబునన్
బ్రసభగతిన్ మృగేంద్రములు భద్రగజంబులు భీతిఁ జెందఁగన్. 32
తే. ఆత్మమూర్త్యంతరం బైనయగ్నిదేవు, నర్చనము సేసి నియతి నయ్యష్టమూర్తి
బహుతపోవ్రతనియమైకఫలవిధాత, తపము జేసెను మది నొక్కతలఁపుఁ జేసి.

---

1. నిర్యన్మహావేగనిర్ఝరాంబు, పతితప్రతిధ్వానభంగోరు ఘుమ ఘుమ ఘుమ ఘుమాయత.

తే. అపుడు హిమవన్న గేంద్రుఁ డత్యాదరమున, నతిథియై యున్న శంభున కర్ఘ్య మిచ్చి
తత్సమారాధనక్రియార్థమునఁ బంచె, నిజతనూజ సఖీసమన్వితము గాఁగ. 34
క. రమణి తపోవ్రతచర్యా, సమధికవిఘ్నంబ యనుచుఁ దలపోసియు శీ
ఘ్రము గైకొనె శివుఁడు విరా, ¹రము లేక మదిం దపంబు రమణీమణియున్.
సీ. పాటించుఁబువ్వులు పల్లవంబులుఁగోయుఁ గుశపవిత్రంబులుఁ గూడఁబెట్టు
నాపగ రహి మీఱు నర్ఘ్యోదకములును నుపకరణంబులు నొయ్యఁ జేర్చు
వేదికాసమ్మార్జవిధి నివర్తించును లీలమై రంగవల్లిక లొనర్చుఁ
గల్పించు లెస్సగా గంధాక్షతంబు లుత్పాదించు ధూపదీపాదికములు
తే. ప్రత్యహంబును హిమధరరాజతనయ, భవునిపదపద్మములమీఁద భక్తి గలిగి
తచ్ఛిరశ్చంద్రచంద్రికా స్తబకశైత్య, శాంతపర్యటనక్రియాశాంతి యగుచు.
వ. అక్కాలంబునం దొక్కనాఁడు స్వర్గలోకంబునఁ బాకశాసనుండు కల్పానో
కహంబులనీడలఁ జింతామణి వేదికాస్థలంబులందు బృందారకులు పరివేష్టింపఁ
బేరోలగంబుండి దివిజకార్యార్థసంసిద్ధిఁ బొంద మనంబునందుఁ గందర్పునిం
దలంచిన. 37
సీ. కాంతాజనంబుల కటివంకబొమలతోఁ బ్రతివచ్చు పుష్పచాపంబుతోడఁ
గోకిలవ్రాతంబు గ్రుక్కిళ్లు మ్రింగించు క్రొమ్మావి చిగురాకుగోడుగుతోడఁ
రతిదేవినిడుసోగఁ గ్రాలుకన్నులడాలుఁ దలపించు మీనకేతనముతోడ
భుజగలీలావతీభుక్తశేషము లైన గంధవాహకిశోరకములతోడఁ
తే. జందురునితో వసంతమాసంబుతోడ, రాజకీరరథం బెక్కి ప్రాభవమున
వచ్చె వలరాజు చిత్తానువర్తనముగ, సంభ్రమముతో మహేంద్రునాస్థానమునకు.
ఉ. పక్షము పెంపునం గుసుమబాణునిమీఁదనె వ్రాలె దేవతా
ధ్యక్షుని వేయికన్నులును దక్కినవేల్పుల నుజ్జగించి నూ
త్నేక్షికఁ జూడఁ గార్యగతి యిట్టిదయా ప్రభువుల్ ప్రయోజనా
పేక్ష నొకప్డు డాశ్రితుల²పేర సమంచితగౌరవోన్నతుల్. 39
క. రా యిటు రమ్మని చేతికిఁ, జే యిచ్చి ప్రమోదరేఖ చిగురొత్త మరు
న్నాయకుఁడు నిల్పె సుమన, స్సాయకు సరిగద్దెమీఁద సౌహార్దమునన్. 40
వ. అప్పుడు. 41
తే. పతిప్రసాదంబుఁ దనమౌళిపై ధరించి, మహితవినయావనమ్రుఁడై మన్మథుండు
సంగతంబుగ హస్తాంబుజములు మోడ్చి, విస్ఫురోక్తుల నిట్లని విన్నవించె. 42
వ. దేవర నన్నుఁ దలంపున నవధరించిన కారణం బేమి యానతిమ్ము. 43

1. రము లుత్తమమతుల కెట్లు కాఁగా నేర్చున్. 2. కీర.

సీ. ఎవ్వండు నీపదం బెలమి నుద్దేశించి యతిఘోరమగు తపం బాచరించె?
నెవ్వఁడు నీచిత్త మెరియించుచున్నాఁడు కైవల్యపదవికైఁ గాలుసాఁచి?
యెవ్వండు గురునీతి కేపాకమును బొంద నుద్దండరీతి మాఱొడ్డి నిలిచె
నెవ్వండు దంభోళిహేతినిర్ఝరధారఁ దలఁచె నీలోత్పలధారఁ గాఁగ
తే. వాని భంజింతు నాతనిమాన మడఁతు, నతని నిర్జింతు నాతని నతకరింతు
నానతిమ్ము మహేంద్ర! నాయట్టిహితుఁడు, నీకుఁగలుగ నసాధ్యంబు నెగడు నెందు.
తే. ఏకభర్తృవ్రతస్థయై యేలతాంగి, నీకుఁ 1జేయాడుధర్మంబు విలువరించె
నది వినిర్ముక్తలజ్జయై యమరరాజుఁ, జేయుఁ గాత స్వయంగ్రహాశ్లేషణంబు.
తే. ప్రణయకోపప్రశాంతికై పాదపతితు, నిన్ను నేపువుఁబోఁడి మన్నింప దయ్యె
నాలతాంగిఁ బ్రవాళశయ్యాశరణ్య, దేహఁ గావింతు విడువు సందేహ 2మింద్ర.
క. నీవజ్రము సుఖముండుం, గావుత దివ్యాస్త్రశాలికామధ్యమునన్
దేవేంద్ర! చెఱకువింటం, బూవులు శరములుగ నే రిపుల నిర్జింతున్. 47
వ. నీప్రసాదంబున మలయానిలంబు ప్రాపును వసంతంబు సహాయంబును నిండువెన్నెల
చెలిమియుం గలుగఁ బినాకపాణి యగుహరు నైన జయింపం జాలుదు నని
తలంతుం దక్కినవారు నాకెవ్వరు నెంత యని యుత్సాహంబునం బల్కినం
బురందరుండు సంకల్పితార్థంబు సఫలం బయ్యెనని యంతరంగంబున సంతో
షించుచుఁ గంతున కిట్లనియె. 48
సీ. సంకల్పసంభవ సమకూర్తు వట్లనే యరుగంగ నీ కసాధ్యంబు గలదె
యటుకాన కానిమహాకార్యభరమునం దేము నియోగింతు మిపుడు నిన్ను
ధరణిభారధురీణతాప్రౌఢి కని కదా తను మోఁచుశేషునిఁ బనిచెను హరి
విబుధకార్యార్థంబు విశ్వేశ్వరు గుఱించి యరుగంగవలయు నీ వధికభక్తిఁ
తే. గుధరకన్యను శశిమౌళిఁ గూర్పవలయుఁ, బార్వతీపరమేశ్వర ప్రభవమైన
దివ్యతేజంబు సేనాపతిత్వమొంది, జయముఁ గావించు నని చెప్పె జలజభవుఁడు.
వ. హిమాద్రిపాదంబున దేవదారువనంబున నియతాత్ముఁ డై పరబ్రహ్మానుసంధా
నంబు సేయుచు నంధకారాతి తపంబు సేయుచున్నవాఁడు పార్వతియు హిమ
వన్నియోగంబున నీశ్వరునకుం బాయక పరిచర్య సేయుచున్నయది యీవార్త
సకలలోకవృత్తాంతవిజ్ఞానార్థంబు పంపిన యప్సరస్త్రీప్రణిధివర్గంబువలన
వింటి నిది కార్యక్రమంబు. 50
తే. ఇది యనన్యసాధారణ మిది యవశ్య, మిది పరోపకృతిక్రియాభ్యుదయశాలి

1. జేయూక. 2. ముద్ర.

చేయు మిప్పని సంకల్పసిద్ధి గాఁగ, బాహులవిక్రమపారీణ! పంచబాణ! 51

తే. శౌరి యభ్యర్థనము సేయువారు సురలు, కార్య మూహింప మూఁడులోకములకును
1నతిశుభము కృత్య మో యల్ప మైనఁ గాదు, కామసంస్పృహణీయవిక్రముఁడ వీవు.

వ. హుతాశనునకు సమీరణంబుంబలె మధుమాసంబు సహాయుం బగు నాత మర్థలాభంబును సేమంబును బునర్దర్శనంబు నయ్యెడు మని దీవించిన దేవేంద్రుని యానతి ముత్యాలసేసఁ బోలె శిరంబునఁ దాల్చి యైరావణకుంభికుంభాస్ఫాలనకర్కశం బగుకరంబున వాస్తోష్పతి తన్ను సంస్పర్శించి గౌరవించిన మన్మథుండు మధుసహాయుం డై హిమవత్పర్వతంబు చేరం జనియె నాసమయంబునందు.

చ. సకలవనంబులందుఁ గలసంయమికోటి తపస్సమాధిని
ష్ఠకుఁ బ్రతికూలవర్తి యయి షట్పదకోకిలరాజకీరజా
లకములతోడఁ గూడ ఝషలాంఛను నెచ్చెలికాఁడు వచ్చె వా
రక మధుమాసరాజు నవరాగసమంచితపల్లవాస్త్రుఁ డై. 54

తే. ఉత్తరాభిముఖుం డై నయుష్ణరశ్మి, చంద మీక్షించి దక్షిణాశాపురంధ్రి
గంధవాహంబు దీర్ఘదీర్ఘంబు గాఁగఁ, జాఁగ విడిచెను విరహనిశ్వాసధార.

శా. ఆమూలాగ్ర మశోకపాదపము ప్రత్యగ్రప్రవాళావళీ
వ్యామిశ్రంబుగఁ బూచె నప్పు డటు నీహారాద్రికుంజంబునన్
భామాకోమలపాదపంకరుహసంపర్కం బపేక్షింప క
ద్దామం బై నవసంతజృంభణము సత్వం బొప్ప దీపింపఁగన్. 56

తే. చివురుగతితోడ లేమావిపువులు శరముఁ, జేసి మధుమాసకాలంబు చిత్తజునకు
నళికులంబుల పేర నామాక్షరములు, వరుసతో నిల్పె ననఁ బొల్చె వానియందు.

క. నవకము లగుములుమోదుగుఁ, బువుమొగ్గలు విపినవీథిఁ బొల్పెసలారెన్
దివుట వసంతుం డనుప, ల్లవుఁ డిడిననఖక్షతంబులకు సరి యగుచున్. 58

తే. చెమట కింపురుషస్త్రీలచెక్కులందుఁ, గ్రమ్మి మృగనాభిపత్త్రభంగంబుఁ గరఁచెఁ
జందనద్రవ మింపయ్యెఁ జన్నుఁగవకు, నలరుఁ బన్నీటితో గుహ్యకాంగనలకు

వ. అప్పుడు వనౌకసు లగుతాపసు లతిప్రయత్నసంస్తంభితక్రియారంభులును మదనుండు సమారోపితపుష్పచాపుండును మధుకరంబులు కుసుమపాత్రపరిపూర్ణమధురసగండూషసముపలాలితప్రియాసందోహంబులును మృగంబులు మృగీకండూయనపరాయణంబులును నై యుండిరి పెండియు. 60

ఉ. పంకజరేణుగంధి యగుపల్వలవారిఁ గరేణు విచ్చె ని

1. గర్మమున హింస పల మైనఁ గానరాదు.

శ్శంక మదావళంబునకు గంధగజంబును బద్మినీమృణా
లాంకుర మర్ధభుక్తము నిజాంగనకుం బ్రియమార నిచ్చె నా
వంకఁ దపోధనుల్ హృదయవత్సలతన్ బ్రియ మంది చూడఁగన్. 61

ఉ. దేసికగాన(ని)మార్గములఁ దిన్ననిరీతులఁ బాడిపాడి యా
శ్వాసము నొంది సోలి యరవాడినయంగనమోముఁదమ్మిఁ బు
ష్పాసవఘూర్ణితేక్షణము లల్లనఁ జుంబన మాచరించి యు
ల్లాస మొనర్చెఁ గిన్నరవిలాసి హిమాచలకందరంబునన్. 62

తే.అచ్చరలు పాడుహిందోళ మాలకించి,యిందుమౌళి ప్రసంఖ్యాన మెడలఁడయ్యె
నిర్జితేంద్రియు లెవట్టినియమపరుల, నంతరాయంబు లేమి సేయంగఁ గలవు.

వ. అప్పుడు వామప్రకోష్ఠార్పితహైమవేత్రకుం డగునందికేశ్వరుం డభినవవసంత సమయారంభసంభూతమనోవికారంబు లగుప్రమథవీరులభావంబులు భావించి హుంకారంబుసేసి మాను మని యదల్చిన నాశిలానందనుదివ్యశాసనంబునఁ గాననం బెల్ల నిష్కంపవృక్షంబును నిభృతద్విరేఫంబును మూకాండజంబును ప్రశాంతమృగచారంబునై చిత్రార్పితావస్థానంబునుంబోలె నుండె నేనియు మనోభవుండు ముక్కంటి యెదురుఁ జక్కటి గాని యొక పక్కియఁగాఁ బురశ్చక్రంబు నడచువాఁడునుంబోలె మనంబునం జంకుచు నెట్టకేలకు నాజగజెట్టి తపంబు సేయు చలికొండచట్టుపట్టునకుం జనుదెంచి చుట్టునుం దిరిగియున్న సురపొన్నమోకలనీడ నిల్చి యచ్చోట శార్దూల చర్మంబునం బర్యంకబంధురితపూర్వకాయుండును నుత్తానపాణియుఁ బ్రాణాయామపరుండును నగు నమ్మహాదేవునిపార్శ్వంబునం బుష్పాంజలి వట్టి ధ్యానావసానావసరముం బ్రతీక్షించుచుఁ గించిద్విలంబమానకేసరభరా(ఛదా)భిరామకాంచీకలాపయుఁ గర్ణికారకుసుమతాటంకయుఁ బల్లవావతంసయు నగుపార్వతిం గనుంగొని యిదియ నాకవసరం బని యధిజ్యశరాసనుం డై. 64

సీ. వలుదకెంజడకొప్పు వదలి వీడకయుండఁ బెనుపాఁపతలపాగ బిగియఁజుట్టి
మెడకప్పుతోఁ గూడి మిక్కిలి నలు పైన కమనీయకృష్ణాజినము ధరించి
భ్రూవికారము లేనిపాడవుఱెప్పలలోని ఘనదృష్టి నాసికాగ్రమున నిల్పి
యోగపట్టికఁ జెంది యొఱ పైననిలుకడ నాసనస్థితబంధ మనువుపఱచి

తే. నిస్తరంగకమైనమున్నీరువోలె, గర్జితము లేనిఘనఘనాఘనము వోలె [చు.
ధ్యాననిశ్చలుఁ డగునిందుధరునిఁజూచి, ప్రసవనారాచుఁ డతిభయభ్రాంతుఁడగు

ఉ. ఒయ్యన డాయఁగాఁ జనియె నుగ్రవిలోచనుపార్శ్వభూమికిం
దయ్యమఱేఁడు నెచ్చెలి యెదన్ భయకంపము నుప్పతిల్లఁగాఁ

దియ్యనివిల్లుఁ బుష్పములఁ దీర్చినయమ్ములు శౌర్యసంపదల్
వయ్యము గాఁగ భూమిఁ బడ వైచె నిలింపులు చూచి బెగ్గిలన్. 66

క. స్థావరరాజతనూభవ, యావేళన డాయ వచ్చె నభవునిసేవా
హేవాకప్రాథిని వన,దేవత లెంతయును నభిరతిం దనుఁగొలువన్. 67

తే. పద్మరాగవిభూషణ ప్రతతిమాఱు, లలి నశోకలతాప్రవాళములు దాల్చి
సింధువారప్రసూనరాజీవరాజిఁ, గమ్రమౌక్తికరత్నశృంగార యగుచు. 68

చ. చనుగవవ్రేగునకా మిగుల సన్నపుఁగౌ నసియాడఁ గెంపు మీ
ఱిన నునుఁబట్టుఁజేలఁ గటి ఱింగులు వాఱఁగఁ గట్టి భూమిభృ
త్తనయ ప్రసూనగుచ్ఛములు దాలిచి లేఁజిగురుల్ ధరించి వ
చ్చిన నడతీవవోలె నిలిచెం దరుణేందుకిరీటుసన్నిధిన్. 69

తే. తరుణి యందందుఁ గేసరదామకాంచి, జఘనపులినంబు నందుండి జాఱిపడఁగ
మాటిమాటికిహస్తపద్మముల నెత్తు, చచలభావంబుతో నుండె నభవుప్రోల. 70

ఉ. కమ్మనియూర్పుగాడుపులగందముఁ గ్రోలఁగ వచ్చి యోష్ఠబిం
బమ్ముసమీపదేశమునఁ బాయక యాడెడు తేఁటిఁ గేళిప
ద్మమున మాటిమాటికి సమంచితవిభ్రమలోలదృష్టి యై
యమ్మదిరాక్షి [1]చిమ్ము దరహాసవికస్వరగండపాళి యై. 71

తే. అఖిలలక్షణసంపూర్ణ యైనయట్టి, యాలతాతన్విఁ జూచి పుష్పాయుధుండు
రమణఁదాఁ బూనుదేవతారాధనంబు, సఫలతం జెందె నని చాల సంతసిల్లె. 72

ఉ. అప్పుడు డాయ వచ్చెఁ దరుణాబ్జకళాధరు గౌరి భక్తితో
నప్పుడు డాసె నీశ్వరుఁడు నంచితయోగసమాధినిష్ఠమైఁ
దప్పక బాహ్యసీమఁ బ్రమదం బెసఁగం బరమంబు సోఽహమై
యొప్పెడుదివ్యతేజము సముజ్జ్వలకోటితటిత్ప్రకాశమున్. 73

క. అసమభయభక్తు లలరఁగఁ, గుసుమంబులు దోయిలించి కోమలి నించెం
గిసలయభంగంబులతో, నసదునడుము వణఁక మృడునియడుగులమీఁదన్. 74

ఉ. పల్లవపుష్పభంగములు పాదసరోరుహయుగ్మకంబుపైఁ
జల్లి శ్రవోవతంస మగుసంపగిమొగ్గ యొకింత జాఱఁగా
నల్లన మ్రొక్కెఁ బార్వతి భయంబును భక్తియు సంభ్రమంబు సం
ధిల్లఁగ భావి భర్తకు ఫణిప్రభుహారరసకంధకారికిన్. 75

క. సరిలేనిమగనిఁ బడయుము, తరుణీ యని పల్కె శివుఁడు తథ్యమ యిది యా

1. చోఁపె.

శ్వరభాషితమునకుం దర, తరములయందైన నన్యథాత్వము గలదే. 76

ఉ. పంచశరుండుఁ దత్పరత బాణవిమోక్షణకాలముం బ్రతీ
క్షించుచు గౌరి శంకరునిఁ జేరినయప్పటినుండి యొప్పుమ
న్నించునొక్కో హరుండు తరుణీమణి నంచును వింట నారి సా
రించుచు నుండెఁ జెంత సురరీకృతదైవతకార్యధుర్యుఁడై. 77

తే. ప్రియము శోభిల్లఁగా సమర్పించె గౌరి, పసనిపర్యేద జాలి దోఃపల్లవమున
భానుదీప్తులు నీటారి ప్రసన్నసైన, పృథులమందాకినీపద్మబీజమాల. 78

తే. అంబుజాక్షి సమర్పింప నాదరమున, నక్షమాల్యంబు నిటలాక్షుఁ డందుకొనియెఁ
బంచబాణుండు సంధించె నించువింట, నస్త్రరాజంబు సమ్మోహనాశుగంబు. 79

మ. శమనారాతి నివృత్తధైర్యుఁ డగుచుం జంద్రోదయారంభకా
లమునం బొంగిన దుగ్ధసాగరములీలం బక్వబింబాధరో
ష్ఠముఁ గర్ణాంతవిలాసనేత్రము నతిస్వచ్ఛంబునై యొప్ప గౌ
రిముఖాంభోజమునందు నిల్పె సరసప్రేమంబునం జూడ్కులన్. 80

తే. శైలసుతయును భావంబుకీలు దెలిసి, యంగకంబులఁబులకంబు లంకురింప
వ్రాల్చె నెమ్మోము లజ్జాభరంబుపేర్మిఁ, గేకరాలోకనంబులఁ గెల్లుమలఁగి. 81

వ. అనంతరం బంతకమథనుం డతర్కితం బైన యింద్రియక్షోభంబు బలాత్కారం బుగాఁ గుదియించి, చేతోవికారంబునకుం గారణంబుఁ దెలియం దలంచి దిశాంచలంబులకుం జూపు పఱుపునప్పుడు కట్టెదుర దక్షిణాపాంగనివిష్టముష్టియునాతతాంగుండును నాకుంచితసవ్యపాదుండునుం జక్రీకృతకార్ముకుండును బ్రహతోద్యుక్తుండునునైన మన్మథునిం గనుంగొని తపఃపరామర్శవివృద్ధక్రోధుండయ్యెనవ్వేళ భ్రూభంగదుష్ప్రేక్షుం బగునిరూపాక్షునిలలాటేక్షణంబునం జనియించిన సముజ్జ్వలజ్వాలాజాలం బైనకృపీటయోని భువనంబులెల్ల భయభ్రాంతంబులై హాహాకారంబులు సేయ నమ్మీనకేతను శరశరాసనతూణీరంబులతోడం గూడ భస్మంబు చేసిన. 82

సీ. నాగభూషణుఫాలనయనానలముచేతఁ బంచబాణుఁడు బిట్టు భస్మమయ్యెఁ
బ్రబలాభిషంగసంప్రభవమోహంబున రతిదేవి యవశయై వ్రాలె ధరణి
యువతిసంసర్గంబు యోగవిఘ్నం బని యభవుఁ డంతర్ధాన మాచరించెఁ
జెలికాఁడు తనమ్రోల నొలికి బూడిద యైన నామని యేడ్చె నా వఱచినట్లు

తే. గౌరి తనచారుసాభాగ్యగౌరవంబు, విలువ పోయినచెలువున విన్నవోయెఁ
బర్వతేంద్రుండు నిర్విణ్ణభావ యైన, కూర్మినందన నింటికిఁ గొంచుఁబోయె. 83

వ. అనంతరంబ రతీదేవి మోహాంధోన్మీలితంబు లైనలోచనంబుల నత్యంత ప్రియ

దర్శనుండగు ప్రియుంగానక పురుషాకారంబున భూమిం బడియున్న భస్మంబుం
గని యిట్లని ప్రలాపింపం దొడంగె. 84

చ. చక్కనివారిలోన నెఱజాణలలో విటరాజకోటిలోఁ
జిక్కనివారిలోఁ గడు బ్రసిద్ధివహించిన నీవు ప్రాణముం
దక్కినచోట నీమనసు ధైర్యమున న్మిసిమింతురాలు గా
నక్కట! పుష్పసాయక! మహాకఠినాత్మలువో మృగేక్షణల్. 85

మ. ప్రతికూలాచరితంబు నావలన నల్పం బైననుం గాంచితే
ప్రతికూలాచరితంబు నీవలన నల్పం బైన నేఁ గంటినే
కృత మెన్నండును లేనిచంద మిది లక్ష్మీపుత్ర! నీయందు న
న్నతిదుఃఖాన్వితఁ డించి పోవఁ దగవా యధ్వానపుంబట్టునన్. 86

క. తలఁతే మన్మథ! గోత్ర, స్ఖలితంబుం జఘనసూత్రకరబంధంబుల్
తలఁతే! మఱియు వసంతో, త్పలకలికారాధనంబుఁ దత్సమయమునన్. 87

క. మెఱయంగ ముసురు కురియఁగ, నుఱుమం బురవీథులం బయోధరవేళం
దెఱవల రమణులయొద్దకు, నిఱుఁజీఁకటిదిశల నింక నెవ్వం డనుపున్. 88

సీ. మదిరారసాస్వాదమదవికారంబులు బింబాధరలకు విడంబనములు
ప్రియవియోగంబున బెదరించువాఁ డయ్యె నుడువల్లభుఁడు నిష్ఫలోదయుండు
కోయిలనోరూరు క్రొత్తమామిడిమోక నవపల్లవంబు బాణత్వ ముడిగె
శుకశారికలు గూడి శోకస్వరంబులఁ బలవింపఁ దొడఁగెఁ దాపంబు గదిరి
తే. మాసములు దుఃఖపడె మధుమాధవములుఁ, జిన్నిమలయానిలంబులుఁ జిన్నవోయె
మాట లేటికి వేయు నోమగలరాజ!, విశ్వమున నీవు లే కున్న వెలితి వడియె.

తే. హృదయమున నుండి యెప్పుడు హృదయనాథ!
ప్రియముఁ జెప్పెద ననుటెల్ల భేషజంబు
హృదయమున నుంట నిజమేని మదన యెట్లు
భస్మమైతివి? నే నెట్లు బ్రదుకఁ గంటి? 90

వ. మన్మథ! మధురాలాపనిసర్గపండితంబు లగుగండుంగోయిలల నేలాకో భువనం
బులకు రాయభారంబు పంపవు? ప్రణిపాతయాచితంబు లగుగాఢోపగూహనం
బులు మఱచితే? యాత్రవం బగుకుసుమప్రధానంబు నాయంగంబులం దిది నీవు
రచియించినది కదా? దక్షిణేతరం బగుమదీయచరణంబు లాక్షారాగపరికర్మం
బునకుం దగదొకో? పతంగమార్గంబున నింగలంబున బడి భవదంకంబాశ్ర
యించెదఁ గాక మదనుండు లేక రతీదేవి జీవించు ననునపవాదంబు లోర్వ

వచ్చునే! నీసుహృదీశ్వరుం డయినవసంతుం డెచ్చట నున్నవాఁడు? పటుక్రోధరేఖానటద్భ్రూభంగవిభీషణముఖుం డగులలాటలోచనులోచనంబు చిచ్చున నతండును వెచ్చి నిన్నుఁ గూడెనే యని యనేకప్రకారంబులం బలవింపఁ దత్పరిదేవనాక్షరంబులు బాణపాతంబులంబోలి తూఱనాటుటయు నెంతయు నొచ్చి యమ్మధుమాసం బక్కిసలయకోమలికిం బుట్టినమహావ్యసనం బూరార్పం జేర వచ్చుటయు. 91

సీ. క్రొమ్ముడి కై పెక్కి కుసుమంబు లుమియుచు నవటుప్రదేశంబునందుఁ బొరల
జేవురించిన లేఁత చెక్కుటద్దంబులఁ దాటంక యుగళంబు తన్నియాడ
నాక్రోశపరిదేవనాక్షరవ్రాతంబు కంఠగద్గదికచేఁ గ్రక్కుపడఁగ
హారినీలములచాయ నక్షిగోళ్ముల సొబగుగాఁ గన్నీటిసోన గురియ
తే. ముత్తియంబులు పేరులు మురిసిపడఁగ
హస్తముల వీఁగుఁ జనుదోయి యడచుకొనుచు
సంబెరం బిచ్చె రతిదేవి శంబరారి
కమలినవసంతు నెదుట దుఃఖార్త యగుచు. 92

వ. ఇవ్విధంబున నారామ పేరామనియెదుట నెమ్మనంబునఁ బేరామనియై వర్తిల్లు నార్తిసంబెరంబిచ్చి సొమ్మసిలంబోయి లేచి వసంతునిం గనుంగొని మాధవ! నీ చెలికానిం జూడు కపోతకర్బురం బైనభస్మం బైనవాఁడు! నీవు వచ్చుట యెఱుంగండు సుమ్మీ! ససురాసురం బైనజగంబు బిసతంతుగుణం బైనకోదండంబునం గలగుండ్లువెట్టు నిట్టి జగజెట్టియుం గలండే? యతిపరుషపవనసంపాతాహతం బైనదీపమునుంబోలె నీపరమమిత్రుండు క్రమ్మఱిలండు సుమ్మీ! నాపాపంబునం జేసి విధి వెలిగాఁ గ్రొన్ననవిలుకానిం గొనిపోయె. నీవును బరమమిత్రుండవు గావున నన్నును నగ్నిముఖంబున నీసఖుం గూర్పం బాడి. 'శశితోడంగూడఁ గౌముదియు మేఘంబుతోడంగూడ మెఱుంగు" ననుట సకలసమ్మతంబు. కుసుమశరుశరీరభసితచూర్ణంబు శరీరంబునం దాల్చి నామేను విభావసునందు వేల్చెదం గిసలయతల్పంబులకు నిటమున్ను సహాయుండ వగునీవు చితి పేర్పం జాలవచ్చెనే యని పల్కి శోకావేశంబున వెండియు. 93

సీ. హస్తయుగ్మము మోడ్చి ప్రార్థించి పలికెదఁ దమ్ముఁడా! నాకిమ్ముఁ దగఁ జితాగ్ని
మందమందంబుగా మలయానిలంబులు వెరవుతో మండంగ విసరుఁగాతఁ
బరలోకతృప్తికై బంధు లిద్దఱకును ధర్మోదకం బిందు తమ్మితేనె
సహకారమంజరీచరుపిండకబళంబు పెట్టుండు మాకునై పికము ముట్టఁ
తే. దేనె పెట్టుండు కస్తూరి దీర్చి యచటఁ, జేర గొజ్జంగపూనీటఁ జెంబు లిడుఁడు

నన్ను వలరాజుఁ దలఁచి మన్నన దలిర్పఁ, దగ సమర్పణ చేయుఁడు దంపతులకు.

వ. అని తెంపుసేసి యగ్నిప్రవేశంబున కాయితంబై యున్న సమయంబున రతి నుద్దేశించి యాకాశవాణి యోమన్మథపత్ని ! సాహసంబు వలవ దుడుగుము. నీకుం జేరువన మేలుగాఁగలయది నీమగఁడు కందర్పుండు భుజాదర్పంబునం గన్నుఁగానక కనకగర్భుని సమావిర్భూతమనోవికారునిం జేసి తనకుమారికయం దతనికిఁ గాఁగాని తలంపుఁ బుట్టించె. కన్నియంగవసిన తనయన్యాయంబునకుం దాన రోసి సరసిరుహాసనుం డీసునంబుట్టించినవాఁడు కుసుమశరుండుకదా ! యదురాత్ముండు హరకోపానలంబున భస్మం బగుం గావుత మని శపించిన నది కారణంబుగాఁ బ్రద్యుమ్నున కిదురవస్థ తటస్థించె. 95

ఉ. ఎప్పుడు పెండ్లియాడుఁ బరమేశ్వరుఁ డద్రితనూజ వేడ్కతో
నప్పుడు లబ్ధసౌఖ్యుఁ డయి యంబికప్రార్థన నాసదాశివుం
డెప్పటియట్ల సర్వభువనైక ధనుర్ధరునిం బ్రియుం బ్రియం
బొప్పఁగ నిచ్చు నీకు మది నొండు తలంపకు నమ్ము మాత్మలోన్. 96

వ. అని యదృశ్యరూపం బైనభూతంబు రతీదేవిమరణవ్యవసాయబుద్ధి మందీభవింపంజేసెఁ గుసుమాయుధబంధుం డగువసంతుండును నావృత్తాంతంబునకు సంతసించి యక్కాంత నూరార్చి నాకాపాంతం బవలంబించి శంబరారి పత్నియు గౌరీకల్యాణకాలమ్ముం బ్రతీక్షించుచు విరహక్షీణం బైనశరీరంబు రక్షించుకొనుచుండె నంత. 97

## ఆశ్వాసాంతము

ఉ. మంకణమానివంశమణిమండన ! కాంచిపురీనివాస ! యే
ణాంకకిరీటదివ్యచరణాంబుజసేవక ! వైరిభద్రనా
గాంకుశ ! హారహీరదరహాసవిపాండురకీర్తిచంద్రికా
లంకృతదిగ్విభాగ ! శుభలక్షణ ! వారిరుహాయతేక్షణా ! 98

క. కరదీపదానశోభిత, బిరుదాంకిత ! యంబునిధిగభీరసుహృదయా !
హరచరణకమలపూజా, పరతంత్రస్వాంత ! వంశపావనచరితా ! 99

మాలిని. మాచమాంబాసుతా! మానదుర్యోధనా
యాచకాభీప్సితత్యాగచింతామణీ !
ధీచతుర్వర్గ యాస్తిక్యసంజన్నిధీ !
లోచనాంభోరుహాలోలలక్ష్మీకళా ! 100

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర వినయవిధేయ శ్రీనాథనామధేయప్రణీతం బయినహరవిలాసం బనుమహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

# చతుర్థాశ్వాసము



కావేరీవల్లభ!
లోకస్తవనీయ! సర్వలోకాశ్రయ! ద
ర్వీకరభూషణభక్త! సు
ధీకలితవివేక! యవచిదేవయతిప్పా! 1

వ. ద్వితీయవిలాసం బైనగౌరీకళ్యాణం బాకర్ణింపుము. 2

తే. అవ్విధంబునఁ దనప్రోల నసమశరుఁడు, తనవుఁగా నీశ్వరునిచేత దగ్ధ మైన
ధరణిధరకన్య నిందించెఁ దనదురూపుఁ,బతులు మెచ్చనిచెలువు నిష్ఫలమకాదె.

వ. అనంతరంబ వసుంధరాధరకన్య యవంధ్యప్రతిజ్ఞయై తపస్సమాధినియతత్వంబు వహియింప నిజాభిప్రాయంబు మేనకాదేవి కెఱింగించిన. 4

ఆ. గ్రుచ్చి కౌఁగిలించుకొని యమ్మహీధర, సార్వభౌముదేవి చతురభంగి
బుజ్జగించి కూర్మి వొంపిరివోవంగ, హితమితోక్తిఁ బుత్రి కిట్టు లనియె. 5

ఉ. ఎక్కడ లేరె వేల్పులు సమీప్సితదాతలు ముద్దుఁగూన! నీ
వెక్కడ? ఘోరవీరతప మెక్కడ? యీపటుసాహసిక్యముల్
తక్క శిరీషపుష్ప మవధానపరత్వమునన్ మధువ్రతం
బెక్కిన నోర్చునో విహగ మెక్కిన నోర్చునో నిశ్చయింపుమా. 6

తే. అనినివారించెగిరిపత్ని యనుఁగుఁగూఁతుఁ,బార్వతియుఁ దల్లి మాటఁ జేపట్టదయ్యె
నీప్సితార్థంబునకుఁ [1]బాఱుహృదయరుచియు,నిమ్నమునకోడిగిలునీరునిలుపరాదు.

వ. అంత నాచంద్రానన సఖీముఖంబున నిజమనోరథంబు దండ్రి కెఱింగించి యమ్మహానుభావుచేత నరణ్యనివాసమునకును ఫలోదయాంతం బైనతపస్సమాధికిని నానతివడసి దృఢప్రతిజ్ఞానిర్వాహంబున. 8

ఉ. భూధరరాజకన్య మణిభూషణముల్ దిగఁద్రావి యీశ్వరా
రాధనకేళికౌతుకపరాయణ యై ధరియించెఁ బాండుర

---

1. జాఱు.

క్షాధృతిపూర్వకంబుగఁ బ్రగాఢపయోధరమండలీసము
త్స్వేదవిశీర్ణసంహతుల నేలుమహీధరవల్కలంబులన్. 9

తే. చంచరీకాంగనాగరుచ్ఛాయ నేలు, కుటిలకోమలతరదీర్ఘకుంతలములు
మడమ లంటఁగ నిడుపాటిజడలు [1]గట్టి, పాశుపతదివ్యదీక్షఁ జేపట్టి గౌరి. 10

సీ. ముత్యాలమొలనూలు మురువుసూపెడునట్టి జఘనంబుపై మౌంజి నవధరించెఁ
గందుకక్రీడపై గారాబు పచరించు హస్తాబ్జములఁ బూనె నక్షమాల
కస్తూరికాంగరాగములతో విలసిల్లు తనువల్లి హత్తించె ధవళభూతి
బొమ్మపెండిలిపాటఁ బ్రొద్దుపుచ్చునెలుంగు నీలకంఠస్తోత్రనియతిఁ గూర్చెఁ

తే. బసిఁడికమ్ములయందంపుఁ బట్టుచేల, కొంగుచాటున వర్ధిల్లుకుచభరమున
గంతఁగా వైచెఁ బులితోలుకళవసంబుఁ, బరమకళ్యాణి గిరిసార్వభౌమతనయ.

తే. హంసతూలికపాన్పుపై నలరుమొగ్గ, యొత్తునును మేను గల్గునీలోత్పలాక్షి
బాహువల్లి తలాఁడఁగాఁ బవ్వళించె, శైలపాషాణపట్టికాస్థండిలమున. 12

తే. పాశుపతదివ్యదీక్షావిభాసమాన, దివ్యతేజోవిశేషసందీప్తమూర్తి
కాలతాంగికి శతవృద్ధులైనమునులు, ప్రణతు లగుదురు భావిప్రభావశక్తి. 13

వ. ఇవ్విధంబున ధరశిఖరంబులయందలి హరిణకిశోరంబులకు నరణ్యబీజాంజలినిధానంబునుం దరులతాకుంజంబులకు నిర్ఝరధారాసేకంబును నొనర్చుచుఁ గృష్ణాజినోత్తరా సంగవతియు సర్వాంగభసితాభ్యంగమంగళస్నానయునై కొంతకాలంబు గడపి కాంక్షితంబు కడఁగానక తెంపు సేసి మండువేసవిం గనగన మండు నగ్నిముఖంబు నడుమన నిలిచి మధ్యాహ్నకాలంబున నర్కమండలం బాలోకించియు వర్షాకాలంబునఁ బక్ష్మపాళీక్షణసితంబులును దాడితాధరంబులును బయోధరోత్సేధనిపాత చూర్ణితంబులును ద్రివళీక్షణస్ఖలితంబులును నాభిగహ్వరప్రవిష్టంబులు నగుజలధరజలబిందుధారలం దోఁగియు శిశిరకాలంబునం దివతాళించుకొలంకులలోనం బుక్కిటి బంటినీట నిశాసమయంబుల నిలిచియు నంబుచుళీ(ళు)కంబులును నుడుపతికరంబులును సురకరువలిండుల్లి నజీర్ణతరుపర్ణంబులును నాహారంబుగా దుష్కరంబైనతపంబు సేయుచుండ నొక్కనాఁడు.

మ. అజినాషాఢధరుండు ప్రౌఢతరభాషాతిప్రగల్భుండు నీ
రజబంధుప్రతిమానతేజుఁడు జటారాజిచ్ఛటాతామ్రమూ
ర్ధజుఁ డేకాకివటుండు బ్రాహ్మణుఁడు విశ్రామార్థముంబోలె నా
త్రిజగన్మోహనమూర్తిసన్నిధికి నేతెంచెన్ వసాంతంబునన్. 15

తే. ఇవ్విధంబున నేతెంచి యెదుట నిలిచి, గౌరి నాశీర్వదించె నక్కపటవటుఁడు
కలితకోమలనపకుశగ్రంథియైన, యంగుళీపల్లవంబుల హస్తమెత్తి. 16

---

1. గట్టెఁ, బాశుపతదివ్యదీక్షఁ జేపట్ట గౌరి.

వ. పార్వతియును బహుమానపురస్సరంబుగా నయ్యుర్వీసురవటునకు నతిథిపూజ యొనర్చిన నతండును గొండరాచూలి సేయుసత్కారం బంగీకరించి ముహూర్తమాత్రంబు విశ్రమించి మెయివడిచూపునం జూచి ప్రస్తావనోచితంబుగా నిట్లనియె.

సీ. సలిలంబు త్రిషవణస్నానక్షమంబె కాదె యంభోజపత్రదీర్ఘాయతాక్షి!
కుసుమంబులును నిధ్మకుశపల్లవంబులు సులభంబులై యున్నె సుందరాంగి!
సత్వంబు లన్యోన్యజాతివైరముఁ దక్కి శాంతి గైకొని యున్నె చంద్రవదన!
యనుదినంబును దేహయాత్ర కాయిత మాయె నీవారపాకాది పూవుఁబోఁడి!
తే. శక్తికొలఁదిఁ దపశ్చర్య సంఘటింతె, ఫలముపై నాస నాగ్రహాబంధ ముడిగి
తామ్రబింబోష్ఠి ధర్మసాధనములందు, నాద్య మగుసాధనంబు దేహంబ కాదె.

క. మగువా! నీపెంచినలత, చిగురున ముకుళంబు నుల్లసిల్లెనె చెపుమా!
పగడపుఁగెమ్మోవిపయి, న్నగ వుదయించినవిధంబునం బ్రస్ఫుటమై. 19

క. పంకజలోచన! కరద, ర్భాంకురములు మేసినట్టి యపరాధమునన్
రంకుమదపోతకంబుల, జంకింపవుగా తపఃప్రశాంతి వెలితిగాన్. 20

తే. అభ్రవీథీపరిచ్యుతం బైనయట్టి, యమరతటినీ జలప్రవాహమ్ము కంటె
ధరణిధరరాజు నీచరిత్రంబుకతనఁ, బరమపావనుఁ డయ్యె నోపద్మనయన! 21

వ. సంబంధంబు సాప్తపదీనంబు గావున నింతతడవు నీతోడఁ గదిసి పలుకుచునికిం జేసి యే నాప్తుండఁ గావున నొక్కమాట యడిగెద. బ్రాహ్మణజాతిస్వభావసులభంబైన చాపలంబుఁ జూచి హెచ్చుగుందాడం బని లేదు. రహస్యంబుగా కుండెనేనిం జెప్పుము. 22

సీ. ప్రథమప్రజానాథ పావనకులమునఁ బ్రభవించి తబల! ప్రపంచసార
సౌందర్యసంపద సడిసన్నదానవు నశ్వరం బైశ్వర్యనైపుణంబు
సౌఖ్యంబు నిరవధి సర్వసామగ్రి నీ యఱచేతిభాగ్య మత్యాయతంబు
భాగ్యంబు నీకేమి బ్రాతి యైనది మనోరథ మేమి చెప్పుమా రాజవదన!
తే. దుష్కరం బైనతప మిట్లు తొడరి చేసి, మేను డయ్యించుకొనఁగ నేమిటికివచ్చెఁ
జిత్తము విచారమార్గంబుఁ జేరఁదెచ్చి, తత్వముఁ దెలియఁ జెప్పు చూతము మృగాక్షి!

వ. పితృగేహంబున నవమానంబు పుట్టదు గదా! పన్నగఫణారత్నంబుమీఁదఁ జెయిసాఁచువాఁడు గలండే! నిండుజవ్వనంబునకుం దగినవిభూషణంబులు తొలంగం బెట్టి వార్ధకోచితంబు లగువల్కలంబు లెట్టులు ధరించితివి? దేవలోకనివాసంబున కాసపడెదేని నది వృథాశ్రమంబు! నీపుట్టినిల్లు దేవభూమియ కదా? తగినవరునిం గామించి సమాధి వహించితి వేని నదియును నీకుం దగదు

రత్నంబు వారునిచే నన్వేషింపఁబడుఁ గాని యొరు నన్వేషించునే? నిట్టూర్పు గాడ్పులచే దుర్లభజనానురాగంబు నీయందుఁ దేటపడుచున్నది. అట్టి కఠిన హృదయుం డెవ్వండొకో! వాఁ డెవ్వని నపేక్షించియేని నీవు తపంబు సేయుచుఁ గలమాగ్రపింగళం బగుజటాభారంబు ధరియింపఁ దగ దని యంత నిలువక యక్కపటవటుండు. 24

ఉ. ఏను బ్రహ్మచారిఁ దరళేక్షణ! నీవును గన్య వెంతకా
లానకు నీకుఁ బెండ్లియు ఫలం బగు నేని విచార మేల స
స్నానముతోడ నన్ను మునిమాన్య వివాహము గమ్ము లెమ్ము కా
దేనిఁ దపంబులోనిసగ మిచ్చెద మాను తపోభిమానమున్. 25

వ. అనినం బార్వతి యమ్మిథ్యావటునకుం దనమనోరథం బెఱిఁగింప నొల్లక వయస్యం గనుసన్న సేసిన నచ్చెలికత్తెయు నత్తపోధనకుమారునితో నిట్లనియె. అయ్యా! నీకుఁ గుతూహలంబు గలదేని వినుము. కాలకంఠకఠోరకంఠహుంకారప్రవర్తకం బగు పుష్పచాపునిసమ్మోహనాస్త్రం బీకన్యహృదయంబున నాటిన నాఁటంగోలె లలాటచందనధూసరాలక యై తుహినసంఘాతతతశిలాతలం బగు జనకునింట ధృతిం జెందక మహేంద్రప్రభృతు లగుదిగీశుల నుజ్జగించి పినాకపాణిం బతిఁగాఁ గోరి తపంబుసేయ సమకట్టె. సబాష్పకంఠస్ఖలితం బు లగు సంగీతాక్షరంబుల విరూపాక్షుచరిత్రంబు పాడుచు వనాంతసఖు లగుకిన్నరరాజకన్యకల వగపించుచుఁ ద్రిభాగశేషంబు లగునిశాసమయంబుల నించుకించుక నిద్రించుచుఁ గలఁ గాంచి నీలకంఠ! యెచ్చోటికిం జనియెద వని యసత్యకంఠార్పితబాహుబంధన యయ్యును విరహవ్యథా దుస్సహంబగు తపోభారంబున భర్గు వశీకరింపం దలంచి యున్నయది యని పల్కిన. 26

చ. వికవిక నవ్వి యక్కపటవిప్రకుమారుఁడు మేలు లెస్స వా
నికి నయి రాగబంధమును నిల్పె మదిం దరళాయతాక్షి మీ
సకియ వివాహవేళఁ బురశాసనుపాణిఁ బరిగ్రహించుచో
మొకమున బుస్సుమంచు నహి [1]మ్రోఁగిన నెట్లు భయంబు [2]చెందునో. 27

సీ. రాయంచ యంచుఁ జీరకు జోక యగుఁగాక పచ్చియేనికతోలుఁబచ్చడంబు
హరిచందనాస్పదం బగుచనుంగవమీఁదఁ బట్టుఁ జేకొనుఁ గాక భసితధూళి
కమనీయచరణలాక్షారాగలేఖచే ముద్రితం బగుఁ గాక రుద్రభూమి
కలితముక్తాఫలగ్రైవేయకందుతోఁ దులదూఁగుఁ గాక పెంజిలువపేరు

తే. మనువు లెస్సయి యుండెబో మానవతికి
నివ్విధం బన్న లోకంబు లెల్ల నగరె

---

1. మ్రొగ్గిన. 2. నొందునో. తిమ్మకవిపాఠము (తి. పా.)

యహహ! [1]ముదిగోద కెక్కి భిక్షాటనంబుఁ
జేయఁ బోవుట యదియు మేల్బాయ చుమ్మె. 28

*ఉ. అంధపరంపర న్వెడఁగవై యభవు న్విని వానితోడి సం
బంధము గోరి నిర్భరతపఃకృశకోమలదేహయష్టివై
బాంధవకోటి తోడఁ బెడఁబాసిన నీవును నింద్యవౌదు సౌ
గంధిక బంధురేఖ యనఁ; గామిని! మాటలు వేయు నేఁటికిన్. 29

ఉ. పుట్టు వెఱుంగ నెవ్వరికిఁ బోలదు మూఁడవకన్నుఁ జూచి చే
పట్టఁడు వెఱ్ఱివాఁ డయినఁ బ్రాణహరుం డఁట జంతుకోటికిన్
గట్టినతోలుచీర కలకల్మి ప్రకాశము సేయు చున్న ది
ప్పట్టునఁ జూచినన్ శివునిపై సి యెఱుంగఁగరాదు భామినీ. 30

తే. మాటలేటికిఁ జాలింపుమా తపంబు, హరునిఁ గూర్చి సరోజపత్త్రాయతాక్షి!
వధ్యుతివియంగఁ బాఁతినవాఁడెకొఱ్ఱు, యూపసత్త్రియకర్త్వా మెయున్నె చెప్పుమ.

వ. అనిన నక్కపటవటునకు నవ్వధూటి యి ట్లనియె. 32

ఉ. చాలు వివాదము ల్వదిగ శంభునిగూర్చి యిట్టిపల్కు లీ
వాలముచేసి పల్కితివి యైనను నా విను చంద్రమఃకళా
మౌళిపయి న్మదీయ మగుమానస మెంతయుఁ జిక్కె నింక నేఁ
జాలుదు నయ్యొ యిమ్మెయి భుజంగవిభూషణునిం దొరంగఁగన్. 33

వ. అని జయావిజయులం గనుంగొని యపాంగంబులఁ గెంపు గదుర నీ బ్రహ్మచారి
శంకరుని గుఱించి యింకను వంకరకొంకరమాటలాడ నుంకించుచున్నవాఁ
డితని మెడవట్టి నూకుం డని పల్కి కోపావేశంబున. 34

చ. జిలుఁ గగువల్కలాంచలము చె న్నయి చన్నులమీఁద జాఱఁగా
నలుకఁ దుషారశైలసుత యవ్వలిమో మయి నాలుగేన్పదం
బులు సని భ్రూకుటీకుటిలముగ్ధలలాటముఖేందుబింబ యై
మలఁగి కనుంగొనెన్ భుజగమండనుఁ [2]డైనశరద్విజోత్తమున్. 35

శా. సాక్షాత్కారముఁ జెంది నవ్వుచు గిరీశానుండు ధాత్రీధరా
ధ్యక్షాపత్యముఁ బ్రేమనిర్భరకటాక్షాలోకనప్రౌఢిమన్
వీక్షించెన్ దరశాక్షియు న్మనమున న్వ్రీడాప్రమోదక్షమా
దాక్షిణ్యంబులు సందడింప నిలిచెం దత్సన్నిధానంబునన్. 36

చ. అరు దగునీతపమ్మునకు నమ్ముదువోయితి నేలుకొమ్మ నీ
వరవుడ నంచు శూలి ప్రియవాక్యములం దగ గారవింపఁగా

---

1. ముదిగొడ్డు. * ఈపద్యము కొన్నిప్రతులఁ గానరాదు. 2. నక్కపట ద్వి.

ధరణీధరేంద్రనందన యుదగ్రతపోమహనీయ వేదనా
ధర మఖిలంబు వీడ్కొలిపి ధావముశం బరితోష మందుచున్. 37

వ. జయవిజయ లనుప్రాణసఖులతోడం గూడ మాతండ్రి హిమవత్పర్వతేంద్రుండు దేవరకుఁ బ్రమాణీకరింపం బాత్రం బయ్యెను. కన్యకం బిత్పపరాధీన నగుట దేవర చిత్తంబున నవధరింపవలయు నని విన్నపంబు సేయించిన. 38

తే. అమృతకరమౌళి యవుఁ గాక యనుచుఁ బలికి, వేడ్క గిరిరాజనందన వీడుకొలిపి
తారగిరి కేగి దివ్యచిత్తమునఁ దలఁచె, సప్తమునుల నరుంధతీసంయుతముగ. 39

శా. ఆసప్తర్షు లరుంధతీసహితులై యాకాశమార్గంబునన్
భాసందోహము సూర్యచంద్రరుచులన్ భంజింపఁగా డిగ్గి కై
లాసస్థానముఁ జేరవచ్చి కని రుల్లాసంబునన్ హేమపీ
ఠాసీనుం డయి దేవత ల్గొలువ రాజైయున్న శ్రీకంఠునిన్. 40

మ. పదియార్వన్నె పసిండివల్కలమునన్ భాసిల్లుమ త్యాలజ
న్నిదముల్ రత్నమయాక్షతంబులును మాణిక్యంపుఁబాత్రంబునన్
జదు రొప్పన్ ధరియించి యల్పధరణీజాతంబులన్ బోలెఁ గ
ట్టెదురన్ నిల్చినదివ్యసంయముల సంవీక్షించి సంభావనన్. 41

సీ. ఆకాశగంగలో నఘమర్షణస్నాన మహరహంబును జేయునట్టివారిఁ
బ్రస్థాపితాశ్వచే భానుమంతునిచేత గురుభావమున మ్రొక్కఁ గొనెడివారి
నంత్యకాలమ్మునయం దుర్విలోఁగూడ నుదధిలోపల మున్గకున్నవారి
సర్గశేషమునకై సాహాయ్య మొనరించి పరమేష్ఠిచే మెచ్చుఁ బడయువారి
తే. గగనమును లేడువుర వారిక౦ెదురన, పతిపదంబులపై దృష్టి భక్తి నిడిన
దివ్యచరిత నరుంధతీదేవిఁ జూచి, సమ్మదము నొందె కందర్పశాసనుండు. 42

తే. అంధకారి యరుంధతి నాదరించె, గౌరవంబున భేదంబు కలుగకుండఁ
బెద్దవారికి స్త్రీపుంవిభేద మేల, మాననీయంబు పుణ్యకర్మంబుగాక. 43

క. ఆబుషులఁ జూడ శివునకుఁ, దారపరిగ్రహము వెంటఁ దద్దయుఁ దగిలెన్
దారపరిగ్రహమే కద, సారపుధర్మముల కెల్ల సాధన మరయన్. 44

ఉ. పర్వతసార్వభౌముసుతపై ననురాగము సంప్రరూఢమై
శర్వుని చిత్తవృత్తి కొనసాగుచు నుండుట కానవచ్చుటం
బూర్వపుఁదప్పుఁ జేసి వెఱఁ బొందుచు నున్నయనంగుఁ డెంతయున్
నిర్వృతిఁ జెందె నా తనదునీతి ²ఫలించి తపంబు పండినన్. 45

---

1. ఆదిసూకరదంష్ట్రయం. 2. ఫలించుకతంబు వచ్చినన్.

వ. అప్పుడు సప్తర్షులు హర్షవినయభక్తిశ్రద్ధావిశ్వాసతాత్పర్యంబులు మనంబునం బెనఁగొనంగఁ గేలుదోయి మొగిచి ఫాలభాగంబునం గీలించి కంటకితకపోలభాగులై దేవా! యింతకాలంబునకుం గదా మాతపోదానాధ్యయనయజ్ఞవ్రతాదిధర్మంబులు ఫలియించె. భువనాధ్యక్షుండవైన నీవు మనోరథాగోచరంబైన మన్ననం జేసి మనోవిషయంబున మన్నించితి వింతకంటెను భాగ్యంబు గలదే? యెవ్వానిచిత్తంబున నీవు వర్తింతువు వాఁడు కృతార్థుండు గదా! నీచిత్తంబున వర్తించుమాకృతార్థత్వంబు వేఱె వర్ణింప నేల? సోమార్కస్థానంబులకు నెక్కువయైన చక్కి సంచరింతురను కీర్తిస్ఫూర్తి దేవర మాకుం గృపసేసిన యీ సంస్మరణానుగ్రహంబునం జేసి యినుమడించె. భవత్సంభావనావిశేషంబునయందు మాకు బహుమానంబు ప్రత్యయంబునయ్యె. యుష్మదనుధ్యానసంభవం బగుప్రమోదభారంబు మాయంతరంగములయం దంగీకరించుటకు సకలభూతాంతర్యామి వగునీవ ప్రమాణంబు. మాటలు వేయు నేటికిఁ జింతితోపస్థితుల మైనమమ్ము నేపనిపంపునఁ దలంచితిరో యానతిం డనుటయు. 46

చ. లలితజటాకిరీటసదలంకృత మైనశశాంకరేఖ కో
మలరుచి దంతదీధితిసమాజముతోఁ బొదలంగఁ జేయుచుఁ
బలికె లలాటలోచనుఁడు ప్రస్ఫుటభంగి మునివ్రజంబుతోఁ
దొలకరిమేఘఘోషములతోఁ బురణించు సముంచితధ్వనిన్. 47

తే. ఎఱుఁగుదురు కాదె మీరు నాహృదయవృత్తి, నాకొఱకు నేనవర్తింతు నేకృతులను
మన్మహామూర్తు లెనిమిది మౌనులార, భువనరక్షాప్రయోజనంబునక కాదె. 48

తే. విప్రకృతులైనయబ్బందివేల్పు లెల్ల, మనఁగఁ గోరిరి సేనాని మత్ప్రసూతి
ననఘులార! తృష్ణాతురులైనవారు, వారివాహంబు ఘనవృష్టిఁ గోరినట్లు. 49

వ. ఏతదర్థంబ పార్వతిని ధర్మపత్నిఁగా నపేక్షించుచున్నవాఁడ. మాకొఱకు మీరు హిమాచలంబునకుం బోయి యక్కార్యంబు సంఘటింపవలయు. యుష్మత్సంఘటితంబులైనసంబంధముల కెన్నండును వికారంబు పుట్టనేర దభ్యున్నతుండును స్థితిమంతుండును వసుంధరాభారధుర్వహుండును నగునద్ధరాధరసార్వభౌముండు సంబంధబాంధవార్హుండు. కన్యార్థంబ యిటు ప్రవర్తింపుఁడు భవత్ప్రణిహితంబులైనపురాణాగమాదులు గదా లోకవ్యవహారంబులకు నిదర్శనంబులై యుండు నీయరుంధతీదేవియు నీకార్యంబునకు సహాయ కాఁగలదు. విశేషించి వివాహశోభనకార్యంబులయందుఁ బురంధ్రీజనంబులకుఁ జనవుచెల్లు నిది శుభముహూర్తం బిప్పుడ కదలి యోషధిప్రస్థపురంబునకుం జనుండు. కైలాససానుప్రదేశంబులఁ బునస్సమాగమం బగుం గాత మని శంభుండు విస్రంభగంభీరంబుగా నానతి యిచ్చిన. 50

చ. అతఁడు సమస్తసంయమిజనాద్యుఁడు శైలసుతాపరిగ్రహో
ద్యతుఁ డయి యుండఁగా సురమహర్షివరేణ్యులు ప్రాక్తనప్రజా
పతులు తదాదిగా హృదయపంకరుహంబులతోఁ బరిగ్రహ
వ్యతికరసంభవం బయినయచ్చపులజ్జ పరిత్యజించుచున్. 51

వ. మహాప్రసాదం బని యంబరమార్గంబున హిమవంతంబు డాయం జని. 52

తే. గగనమున నుండి డిగ్గి సత్కారయుక్తి, వెలఁగె హిమపర్వతాంతరస్థలమునందు
నిర్మలం బైననిధిలోని నీడఁదోఁచు, నిందుబింబంబులనుబోలి ఋషిగణంబు. 53

శా. పాదన్యాసములన్ ధరిత్రి పరికంపంబొంద నత్యంతస
మ్మోదంబున్ భయభక్తులున్ మనమునన్ ముట్టంగ శైలేంద్రుఁ డం
భోదాకారముతోడ డిగ్గి నమహాపుణ్యాత్ములన్ సర్వలో
కాదిశ్రేష్ఠుల వే యెదుర్కొనియె నర్ఘ్యాపూర్ణహస్తాబ్జుఁ డై. 54

తే. ధాతుతామ్రాధరుఁడు దేవదారుభుజుఁడు, సానువక్షస్థలుఁడు వటస్కంధుఁడైన
మంచుగుబ్బలిరాజు సంభ్రమముతోడ, ఋషిసమూహంబునతిభక్తినెదురుకొనియె.

సీ. విధిమార్గ మొక్కింత వీసరవోకుండ నర్ఘ్యపాద్యాదిక్రియాకలాప
మాచరించి వినిర్మలాచారసంపన్ను లగునమ్మహర్షుల నాదరమున
నతఃపురానకు నల్లఁ దోడ్కొని పోయి క్రమముగా నుచితాసనముల నునిచి
స్వాగతకుశలవార్తాను పూర్వకముగ నతిగభీరప్రస్ఫుటాక్షరముల

తే. వారితో నిట్టులనియె నమ్మేరుసఖుఁడు, గాఢవినయావనతపూర్వకాయుఁ డగుచు
హస్తయుగళంబు మొగిచి సంప్రార్థనమున, యావదర్థపదం బగునట్లుగాఁగ. 56

తే. అపపయోదసముద్భవం బైనవాన, యనధిగతపుష్పజాలకం బైనఫలము
పుణ్యనిధులార! నాగృహంబునకు మీరు, తలఁపుగానితలంపుగాఁ దారసిలుట.

క. రెంటను నేఁ బావనుఁడను, వింటిరె మునులార! మీపవిత్రాంఘ్రులు న
న్నంటుట మదీయమూర్ధము, వెంటంగా నభ్రగంగ వెల్లివిరియుటన్. 58

సీ. స్థావరం బగుమేను పావనత్వముఁ జెందె భవదీయపాదసంస్పర్శనమునఁ
గడగంటి నాజన్మ కతికృతార్థతఁ బొందఁ గన్నులారఁగ మిమ్ముఁ గానఁబడసి
యుష్మత్కృపాసమభ్యుదితసంతోషంబు నిండి దైవాఱె నా నెమ్మనమున
మీ తేజమున నాదుమేనిలోఁ దహతహ కలుషాంబుపటలంబు గ్రాఁగి పోయె

తే. ననుఁ గృతార్థునిఁ జేయఁ బావనునిఁ జేయఁ, బరమపుణ్యునిఁ జేయ సంపన్నుఁ జేయఁ
దలఁచి యేతెంచితిరి గాని తక్కఁగలదె, కార్య మానతి యిండార్యవర్యులార!

మ. అని పర్జన్యకఠోరగర్జ కెనగా నాడంబరాటోపముం

జెనయుం బల్కఁగభీరనిస్వనమునన్ శీతాచలేంద్రుండు ప
ల్కిన నందందఁ బ్రతిధ్వను ల్వెడలె గుహాగేహంబులం దుండఁగా
నినుమార్పల్కినరీతిఁ దోఁచె నపు డూహింపఁగా మునిశ్రేణికిన్. 60
వ. అప్పు డంగిరసుం డందఱిమునులయనుమతి నప్పర్వతేంద్రున కిట్లనియె. 61
క. సర్వము సంపన్నంబగు, నుర్వీధరసార్వభౌమ యుల్లము నీకున్
సర్వోన్నతంబు గాదె యు, ఖర్వము లగునీమహాశిఖరములభంగిన్. 62
వ. చరాచరభూతజాలంబులకు నాధారుండ వగునిన్నుం బురాణబ్రహ్మవాదులు విష్ణుండని స్తుతింతురు. సప్తపాతాళభవనగోళమూలాధారంబ వగునీవు భూభువనంబు భరియింపనినాఁడు భుజంగమశేఖరుండు మృణాలపేశలం బగుఫణామండలంబున నిడి భరింప సమర్థుం డగునే? సత్పావనంబులును నాసేతుసముద్రావనిచిహ్నంబులు నగు నీసలిలప్రవాహంబులు భవత్కీర్తితీర్థంబులుంబోలి భువనపావనంబులు. తిర్యగూర్ధ్వాధరస్థానంబు లాక్రమించి త్రివిక్రమావతారంబున విరాడ్రూపంబు వహించినవిష్వక్సేను ననుకరించెదవు. నీకు నితరపర్వతంబుల కను సాటియే. ఇది యిట్లుండనిమ్ము. మేము వచ్చినకార్యంబు సావధానుండ వయి యాకర్ణింపుము. 68
సీ. ఏవేల్పులకు లేనియీశ్వరశబ్దంబుఁ దాల్చె నెవ్వఁడు సుధాధాముతోడ
నవనిప్రధానంబు లైనయంగంబుల నవరించు నెవ్వాఁడు సకలజగము
నేకతంబున వసియించి యెవ్వనిఁ గంద్రు యోగీశ్వరేశ్వరుల్ యోగదృష్టి
నెవ్వనిపదము నూత్మేక్షుబుధులు పునరావృత్తిశూన్యక మండ్రు తెలిసి
తే. యతఁడుశంభుండువిశ్వలోకైకసాక్షి, యనఁగఁబుత్తెంచినాఁడునీయనుఁగుఁగూఁతు
నిమ్ము పెండిలిపెద్దల మేము మీకుఁ, దుహినగిరిరాజ! భాగ్యవంతుండ వైతి. 64
సీ. త్రైలోక్యమునకుఁ జంద్రకళాధరుఁడు తండ్రి తల్లి యౌఁగాక యీతలిరుఁబోఁడి
హరునకు మ్రొక్కి యనంతరం బమరు లీకుటిలకుంతలకు మ్రొక్కుదురుగాక
యీతలోదరి నిచ్చి హితబాంధవంబున నగుదుగాక గురుండ వఖిలపతికి
నీరాజబింబాస్య కారణంబుగ నద్రికులము దేవకులంబుఁ గలియుఁగాక
తే. తగినవరునకుఁ గన్యకాదాన మిచ్చు, నంతకంటెను మఱి భాగ్య మన్య మేది
తల్లిదండ్రుల కఖిలభూధరవరేణ్య!, సకలయజ్ఞాంగసముదాయజన్మభవన! 65
తే. దా*తవఁట నీవు మేము సంధాతలమఁట, గారవపుఁ బెండ్లికూఁతురు గౌరియఁట
శంభుఁడఁట పెండ్లికొడుకిదిసంప్రదాయ, మభినుతింపఁగఁదగుఁబర్వతాగ్రగణ్య!
మ. అని దేవర్షి బహుప్రకారమధురవ్యాహారసందర్భముం
బనిగొం చుండఁగఁ దండ్రిపార్శ్వమున సద్భావంబు లజ్జాభరం

*దాతవటె...మటె, గౌరియట్టె...శంభుఁడటె.

బును భాగ్యంబును దోఁప నమ్రవదనాంభోజాత యై యల్లన
ల్లన లెక్కించుచు నుండెఁ బాణి నవలీలాపద్మపత్త్రంబులన్. 67

తే. భూమిధరరాజు సంపూర్ణకాముఁ డయ్యె
ముదముతో మేనకాదేవి మొగము సూచి
కన్యకాదానవేళలఁ గలదు చనవు
క్షితి గృహస్థులకంటె సద్గేహినులకు. 68

వ. అనంతరంబ తనమూర్తి కన్యం జూచి హిమవంతుండు. 69

సీ. రావమ్మ తల్లి! సర్వజగచ్ఛరణ్యున కమృతాంశుమౌళికి నైతి భిక్ష
యర్థులై వచ్చినా రాదిమబ్రహ్మలు ఘనపుణ్యరాసులు గగనమునులు
పరమపతివ్రతా పరిషచ్ఛిరోమణి యదె యరుంధతి త్రిలోకైకవినుత
నీవు కారణముగ నెఱయంగ సిద్ధించె భాగ్యంబు గృహమేధి ఫలము నాకు
తే. ననుచు మ్రొక్కించె ఋషులకు నందఱకును, నబ్జభవుకోడలికిఁ దుషారాద్రినాథుఁ
డవధరింపుఁడు శివునియర్ధాంగలక్ష్మి, ప్రణుతి యొనరించె మీ కని పల్కి నగుచు.

తే. ఈప్సితార్థక్రియాసముపేతుఁ డైన, శైలపతిమాట కందఱు సంతసిల్లి
ప్రణుతి యొనరించి యంజలిపాణి యైన, గౌరి నాశీర్వదించిరి గగనమునులు. 71

వ. అనంతరంబ యభిలషితవరసంప్రాప్తిసముపజాతకుతూహల యగు నాహంసగమన
నరుంధతి తన తొడలమీఁద గూర్చుండఁ బెట్టుకొనియె. మునులును వినిశ్చిత
కార్యులై వివాహతిథి నేఁటికి నాలవనాఁ డని ముహూర్తనిశ్చయంబు సేసి
సారుంధతీకులై హిమాచలంబు నామంత్రించి చని విశుద్ధం బైనకార్యార్థంబు
విన్నవించి యమ్మహాదేవుం డనుప నిజస్థానంబుల కరిగిరి. పశుపతియు నెట్టకేలకు
దివసత్త్రయంబు గడపుచుండె నట యోషధీప్రస్థపురంబునందు. 72

తే. ఓషధీనాథుఁ డభివృద్ధి నొందుచుండఁ, దిథికి జామిత్రగుణము సంధిల్లుచుండఁ
బర్వతేంద్రుండు సముపేతబాంధవుండు, పుత్త్రికోద్వాహకళ్యాణమునకుఁ దొడఁగె.

తే. నవశుభారంభసంవిధానముల నపుడు, కౌతుకవ్యగ్రకాంతానికాయ మగుచు
ననుపమస్ఫూర్తిసానుమంతునిపురంబు, సకలమును నొక్కయిలువోలె సంభ్రమించె.

సీ. సంతానకద్రుమచ్ఛాయాసమాకీర్ణ రాజవీథీపరివ్రాజితంబు
ధవళచీనాంశుకోత్తమసమాకల్పిత మహనీయతరకేతుమండనంబు
సమధిక స్తంభకాంచనతోరణావళి మేళనోత్తేజిత మిహిరదీప్తి
ప్రతిగృహద్వారపర్యంతసందానిత సుమగుచ్ఛమాలికాసుందరంబు
తే. గరుడగంధర్వ కిన్నరఖచరయక్ష, సిద్ధవిద్యాధరాంగనా శ్రేణిభరిత

మఖిలలోక విలోచన హర్ష కరము, రాజితం బయ్యె నోషధీప్రస్థపురము. 75

ఉ. ఎందఱు కల్గినం గలుగనీ హిమభూధరచక్రవర్తికిన్
నందను లవ్వివాహపు దినంబులలో నుమపోఁటిమీఁదఁ బూ
ర్ణేందునిభాస్యమీఁద హరిణేక్షణమీఁద విశిష్టదృష్టి నా
నందము గల్గియుండెను మనంబున మేనక పొంగ నత్తఱిన్. 76

గీ. అంకముననుండి యేతెంచె నంకమునకు, మండనం బూడ్చి ధరియించె మండనంబు
ప్రేమబంధంబు సంభిన్న భిన్నమయ్యె, బంధులకు గౌరియం దొక్క పగిది నుండె.

వ. మైత్రీముహూర్తంబున నుత్తరఫల్గునీనక్షత్రంబునకుం జంద్రయోగంబు గలుగుచుండఁ బతిపుత్రవంతు లగునమ్ముత్తైదువ లమ్మత్తకాశినికి శృంగారంబు సేసి రపుడు.

తే. గారసిద్ధార్థవినివేశకలిత మగుచుఁ, దరుణదూర్వాప్రవాళసంభరిత మగుచు
నాత్మరక్షాశిలీముఖం బగుచు నపుడు, బాల కభ్యంగనైపథ్యలీల యమరె. 79

క. బంగారుకంకపత్రముఁ, గెంగేల ధరించి యొప్పె గిరినందన య
భ్యంగముతఱి భాస్కరకర, సంగత యగువిదియనాఁటిశశికళవోలెన్. 80

సీ. కమనీయలోధ్రకల్కంబునలుంగున నభ్యంగతైలంబు నపనయించి
యాశ్యామ మైనకాలాగరుద్రవమున నంగరాగాలేప మాచరించి
కస్తూరి పునుఁగును గంధసారంబును సంపంగినూనెయు సంతరించి
యభిషేకవిధియోగ్య మగుమడుఁ గొల్లియ నిర్ణాభిబిలముగా నెఱికి గట్టి

తే. చలువనెల యైన ముత్యాలచవికెలోనఁ, బృథులమాణిక్యశశికాంతపీఠియందుఁ
బదియునార్వన్నెపసిఁడికుంభములనీట, జలకమార్చిరి గౌరికిఁ జంద్రముఖులు.

వ. మంగళస్నానవిశుద్ధగాత్రియు గృహీతప్రత్యుద్గమనీయయునై ప్రఫుల్లకాశయగుశరత్కాలవసుంధరయుంబోని పార్వతిం దత్ప్రదేశంబులనుండి మణిస్తంభచతుష్టయాభిరామంబును వితానవంతంబును నగుకౌతుకవేదిమధ్యంబునకుం దెచ్చి నెచ్చెలు లలంకరింపం దొడంగి రప్పుడు. 82

తే. అగరుధూపంబు సంపూజితార్ద్రభావ, మంతరన్యస్తకుసుమమాల్యము తదీయ
మలిమనోజ్ఞంబు ధమ్మిల్ల మలరుఁబోఁడి, యిప్పపూదండఁ గైసేసె నెలమినొర్తు.

తే. కలితగోరోచనాపత్రకములతోడఁ, గరము విలసిల్లె నీహారగిరితనూజ
చక్రవాకపదాంకితసైకతములఁ, గరము విలసిల్లునాకాశగంగ వోలె. 84

తే. తుమ్మెదలతోడఁ గూడినతమ్మివోలె, జలదరేఖాయుతం బైనచంద్రుపగిది
ఫాలమునఁ గుంతలంబు సేర్పఱచినపుడు, నెలవుగాఁదోఁచె గిరికన్యనెమ్మొగంబు.

వ. మఱియు నొక్కసైరంధ్రి లోధ్రకషాయరూక్షంబును గోరోచనాక్షేపనితాంత

గౌరంబునగు నీహారగిరికన్యకాలలామంబు కపోలభాగంబునం బరాగలాభంబు సంధిల్లఁ గర్ణావతంసంబుగాఁ గాయజప్రరోహణంబుఁ గీలించెఁ; నొక్కచంచలాపాంగి మంచుంగొండరాచూలియధరప్రవాళంబు కించిన్మధూకచ్ఛవిమృష్టరాగంబుఁ గావించె; నొక్కయిందుబింబానన యంబికచరణాంబుజంబులఁ గ్రొత్తలత్తుక హత్తించె; నొకకిసలయపాణి చరణపల్లవంబుల ఫాలలోచనుకిరీటబాలేందుని ముట్టు మని నెట్టుకొని దీవించె; నొక్కశాతోదరి కళిందసుతాజాతనీలోత్పలపలాశకాంతిమంతంబులై నహిమవంతుముద్దుంగూఁతు నిద్దంపువెడందసోగకన్నులం గాలాంజనంబు మంగళార్థంబుగా రచియించె; నప్పుడు కుసుమంబులతోడ లతయును నక్షత్రగ్రహతారకంబులతోడ రాత్రియును గలహంససందోహంబుతోడ మందాకినియుంబోలె దివ్యాభరణంబులతోడం గూడి పార్వతి సర్వలోకనయనోత్సవకర యయ్యె నయ్యవసరంబున. 86

చ. ద్రవమయి యున్న క్రొత్తహరితాళమనశ్శిలలం గరంచి ప
ల్లవమునఁ దోఁచి మేనక యలంకరణం బొనరించె గౌరికిన్
నవనవపత్త్రభంగరచనాకలనంబున మంగళార్థమ
త్యవిహతలీల రత్నముకురామలకోమలగండమండలిన్. 87

తే. దంతతాటంకమండనోద్భాసి యైన, ముద్దుఁగన్నియయాననాంభోజ మెత్తి
తీర్చి రచియించె మేనకాదేవి రక్తి, మలయజంబునఁ గళ్యాణతిలకరేఖ. 88

వ. ప్రమదస్తనోద్భేదనం బాదిగా నెయ్యది ప్రతిదినప్రవర్ధితం బయ్యె నది మనోరథంబు ఫలియింప వివాహదీక్షాతిలకంబు లలాటంబునం దీర్చి యధిష్ఠానాంతరసన్నివేశం బై ధాత్రీప్రతిసార్యమాణం బైనపూర్ణకౌతుకహస్తసూత్రంబు బంధించి మేనకాదేవి బాష్పాకులలోచన యయ్యె నప్పుడు నవఫేనపుంజ యగు దుగ్ధాబ్ధివీచిపోల్కిఁ బట్టుపుట్టంబు గట్టి చెలువారు నాసరోరుహాక్షి కులదేవతలకు మ్రొక్కి ముత్తైదువల కభివాదనంబు సేసి కళ్యాణమండపమ్మునం దఖిలపరివారపరివృతయై సింహాసనంబుమీఁదం గూర్చుండి మహోక్షలాంఛను నాగమనంబుఁ బ్రతీక్షించుచు నుండె నంత. 89

సీ. బ్రాహ్మి సంపాదించె భసితాంగరాగంబు మాహేశి రుద్రాక్షమాలఁ గూర్చెఁ
గౌమారి వెలఁచి భిక్షాకరోటిక యిచ్చె వైష్ణవి తోలుదువ్వలువ మడిఁచెఁ
వారాహి కెంగేల గారాపుటిత్తికి గై సేసె మణిమయాకల్పపఙ్క్తి
నింద్రాణితోఁ గూడి హారాళముగ గ్రుచ్చెఁ జాముండ హస్తభూషావ్రజంబు
తే. నాది కాలంబు సతిఁ బెండ్లియాడఁ బోవు, నవసరంబున నెబ్భంగి సవదరించె

దివ్యశృంగార మబ్భంగి దేవదేవుఁ, డవధరించెను సమ్మోద మావహిల్ల. 90

సీ. భసితంబు కర్పూరపాళికస్తూరికాభరితాంగరాగసంపద వహించె
పచ్చియేనుఁగుతోలు పసిఁడికమ్ములపట్టుపచ్చడం బనెడివిభ్రమముఁ దాల్చె
భుజమధ్యమునఁ గ్రాలు భోగిభోగంబులు తారహారములచందంబు నొందె
చికిలించు నెఱిగంటి చిగురుమోడుపు డెప్ప హరితాళతిలకంబు గరిమ వడసె
తే. దినమునందును వెన్నెల దీటుకొనఁగ, శైశవంబున విగతలాంఛనతఁ జెంది
చాల నొప్పారుసుకుమారచంద్రరేఖ, తనకుఁ దాన చూడామణిత్వము వహించె.

వ. ఇవ్విధంబున గంగాధరుండు సమాసన్నగణాపనీతం బైనఖడ్గంబున నీడఁజూచి నంది భుజావలంబియై శార్దూలచర్మపిహితపల్యాణబంధం బగువృషభంబును గైలాసశిఖరంబుంబోలె నారోహణంబు సేసి బ్రాహ్మి మొదలయినమాతృకలును గపాలాభరణయైన భద్రకాళియు భృంగిరిటనికుంభధర భద్రకాళప్రముఖ ప్రమథపరివారంబునుం బరివేష్టింప భూతబేతాళశాకినీడాకినీగణంబులు మంగళవాద్యంబులు మొరయింప ద్వాత్రింశత్కోటిదేవతాసమూహంబులు గొలువ సహస్రరశ్మి ధవళాతపత్రంబు ధరియింప గంగాయమునలు వింజామర లిడ నుభయపార్శ్వంబుల నిజవాహనారూఢులై హరివిధాతలు వేత్రహస్తులై తలం గుండు పాయం దొలంగుండనుచు సందడి నెడఁగలుగఁజేయఁ గలహాశనతుంబురులును విశ్వావసువులును హాహాహూహూవులును త్రిపురవిజయాదివిద్యాధరులును త్రిపురవిజయాదికంబు లుగ్గడించుచుండ సప్తర్షు లరుంధతీసహితంబుగా మంగళద్రవ్యంబులు సంతరించుకొని నడవ నాకాశమార్గంబునం గోవృషవాహనంబులుఁదోలుచు జలధరంబులఁ [1]బొలయించుచుఁ జామీకరకింకిణీక్వాణంబులు సెలంగ ముహూర్తంబునకు నగేంద్రగుప్తం బగునోషధీప్రస్థపురంబునకుం జని తదీయోపకంఠంబున డిగ్గిన. 92

మ. ఘనగంధద్విపరాజి నెక్కి యధికవ్యాయామవిస్ఫారసం
హనుల్ బంధులు మేదినీధరము లవ్యాక్షేపసంబోధముల్
మనముల్ నిండఁగఁదోడరాఁ ద్రిజగతీమాన్యుండు ధీరుం డెదు
ర్కొనె నీహారగిరీశ్వరుండు సుమనఃకోదండసంహారునిన్. 93

వ. ఇట్లెదుర్కొని తుషారగిరీశ్వరుండు మేనకాదేవి పసిండిపాత్రంబుల జలంబు వోయ సురాసురకిరీటమణిశాణోత్తేజితంబు లగుపురాసురాంతకునిపదంబులు గడిగి కన్యాదానం బొనరించె. 94

సీ. ..................................................
..................................................

1. పొలయించుచోఁ.

......................తొలిక్రొత్తవలిపంపు దోయిఁగట్టి
కల్యాణ మంగళ గానధ్వనులతోడ భవుఁడు వధూసమీపమున కేగె
తే. పట్టు తెఱచీరచాటున బ్రహ్మమంత్ర, వాదపూర్వముగాఁ దలం బ్రాలుహస్త
కమలములు దోయిలించి శ్రీకంధరుండు, గౌరిశిరసునఁ బూన్చెను కౌతుకమున.

వ. పార్వతీదేవియు బంధుజనోపదేశంబునం గాలకంధరు శిరంబున ముత్యాలప్రాలు నించె ననంతరంబ. 96

సీ. చెట్టవట్టించిరి శ్రీకంఠు సుమబోఁటి బోటి కత్తియలింపు పొలుపు మీఱఁ
గూర్చుండఁబెట్టిరి కుసుమకోదండారిఁ బార్వతీదేవిని భద్రపీఠి
హోమకుండము నిల్పి హేమపీఠికమీఁదఁ దివిరి యరుంధతీదేవి కడఁక
నాపుణ్యదంపతు లఖిలలోకములకు నొనరించి రవలోకనోత్సవంబు
గీ. యజ్ఞపురుషున కఖిలలోకార్చితునకు, సప్తజిహ్వున కంబికాచంద్రధరులు
భక్తితోడఁ బ్రదక్షిణప్రక్రమములు, సంఘటించిరి పరమేష్ఠిశాసనమున. 97
వ. ప్రదక్షిణప్రణామంబున నామిథునంబు విభావసు నారాధించునపుడు మేరువునకుఁ బ్రదక్షిణంబు సేయు సహస్త్రియామంబు ననుకరించె. సమిద్ధజ్వాలం బైన యనలంబునందు దాక్షాయని లాజమోక్షం బొనరించి ధ్రువదర్శనావసానంబునఁ దుషారగిరికన్యకాశంకరులు సంకల్పసిద్ధి వడసిరి. నిర్వృత్తపాణిగ్రహణమహోత్సవులై భవానీభర్గులు భక్తిభావనావశంవదులై బ్రహ్మాసనాసీనుం డగుపితామహునకుం బ్రణమిల్లిరి. చతురంతవేదికామధ్యాధ్యాసీనులై పార్వతీసర్వజ్ఞులు లౌకికం బైనయార్ద్రాక్షతారోపణం బనుభవించి రంత. 98
సీ. అమృతబిందువులపై నందంద చిలుకంగఁ బద్మాతపత్రంబుఁ బట్టె గమల
కళ్యాణసమయార్హగద్యపద్యంబులఁ గైవార మొనరింపఁ గడఁగె వాణి
రంభోర్వశీముఖ్యజంభారివనితాళి తూర్యత్రయంబునఁ దోడు సూపె
మందాకినియును గాళిందియు నిఱుచక్కి రమణఁ బైవింజామరంబు లిడిరి
తే. వేళ యెఱిఁగిన మహేంద్రాదివిబుధగణము, ముకుటముల హస్తపల్లవములు ఘటించి
వేఁడుకొనిరి మహాదేవు వినతు లగుచుఁ, జిత్తసంభవునకుఁ బునర్జీవనంబు. 99
సీ. సంబంధబాంధవసదనుగ్రహమ్ముచే నచలాధిపతిఁ జరితార్థుఁ జేసి
కందర్పుఁ దొల్లింటికంటె నున్నతుఁ జేసి రతిదేవిహృదయవైరాగ్య ముడిపి
పెండ్లికి వచ్చినబృందారకుల నెల్ల వివిధసంభావన వీడుకొలిపి
ప్రమథవర్గము నికుంభప్రధానమ్మును బేతాళడాకినీవితతి ననిచి
తే. కనకకలశాదిభక్ష్యలంకారయుతము, భూమివిరచితశయ్యంబుఁ బుష్పమయము

నైనకౌతుకరత్న గేహంబు సొచ్చె, పార్వతియుఁ దాను నీహారభానుమౌళి.100

వ. అనంతరంబ గంగాధరుండు భృంగిరిటవికారంబుల నిగూఢంబుగా నవ్వించియుఁ భావసాధ్వసపరిగ్రహంబున మందమందాక్షభారంబుగా రచించియు గాఢాలింగనంబులును నీవీబంధస్పర్శనంబులును బింబాధరచుంబనంబులును నఖాంకురవ్యాపారంబులును దంతక్షతవేదనాప్రపంచితకిలకించితంబులును వెలయ బాహ్యాంతరోత్సవంబులను సంధించి మన్మథుం గృతార్థుం జేసి యనేకకాలంబు పరమానందంబుఁ జెంది శతానందముకుందపురందరాదులకు హితంబుగ సుతుం గాంచి యాంబికేయుండును గాంగేయుండును షాణ్మాతురుండును ననునక్కుమారునివలనఁ దారకాసురు వధియింపించి మహాదేవుండు లోకంబు లన్నియు రక్షించె నిది గౌరీకళ్యాణము. 101

క. ఈగౌరీకళ్యాణము, భోగీంద్రధరాపదానపుణ్యశ్రుతిది
వ్యాగమము దీనిఁ జదివిన, భోగము మోక్షమును గలుగు భూజనములకున్.102

ఆశ్వాసాంతము

చ. కొమరగిరిక్షమారమణకుంజర చారువసంతవైభవ
క్రమసముపార్జితాభినవగంధ హిమాంబుకురంగనాభికుం
కుమఘనసారసంకుమదకుంభమనోహర గంధపాళికా
సముదయసార్వభౌమ ! కవిసంఘమనోభవకల్పకద్రుమా ! 103

క. కరదీపదానబిరుదా, భరణా ! కావేరివల్లభా ! సుగుణనిధీ !
శిరియాళవంశశేఖర !, హరిచరణస్మరణపరిణతాంతఃకరణా. 104

పంచచామరము.—

హారాట్టహాసమల్లికాళికాంకశంకరాచలా
మరాపగాసరస్వతీసమానకీర్తిమండలా !
కురంగనాభిగంధసారకుంకుమాదివాసనా
పరంపరావితీర్ణశస్తభవ్యహస్తపల్లవా ! 105

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర వినయవిధేయ శ్రీనాథనామధేయప్రణీతం బయినహరవిలాసం బనుమహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము.

# పంచమాశ్వాసము




మత్కుమారశైల
స్వామికృపాలబ్ధనిత్యశాశ్వతవిభవా !
హేమాచలధీర ! ధరి
త్రీమండనచరిత ! యవచిదేవయతిప్పా ! 1

వ. ఆకర్ణింపుము. 2

ఉ. గౌరివివాహమై కుసుమకార్ముకుఁ గ్రమ్మఱిలంగఁజేసి బృం
దారకవర్గము న్నిజపదంబున కన్పి హిమాచలంబుపైఁ
బారిషదవ్రజంబు తను భక్తి భజింపఁగ నాచరించె సం
సారసుఖంబు శంకరుఁడు సంభృతనవ్యకుటుంబభారుఁడై. 3

తే. ప్రమథగణములతోఁ మాతృసమితితోడ, నందికేశ్వరుతోడ నానందలీల
నార్యపైఁ బేర్మి యెట్టిదో యద్రియింట, నిల్లటం బుండెఁ ద్రిభువనాధీశ్వరుండు.

సీ. జమిలిపాములతోడిసాకతం బొల్లక సవరించు బంగారుజన్నిదములు
పచ్చయేనికతోలుపచ్చడంబుఁ ద్యజించి గడితంపుఁబట్టుఁబచ్చడముఁ గట్టు
భస్మాంగరాగంబు పని కట్టువడఁజేసి కస్తూరితోడ శ్రీగంధమలఁదు
నస్థిమాల్యములపై ననురక్తి వర్జించి రమణీయతారహారములు తాల్చు

తే. జడలు బాగడఁ జొల్లెంబు సంతరించి, లేఁతరిక్కలరాయుఁ గీలించు నందు
మంచుగుబ్బలియింట సమ్మదము మీఱ, మనువుఁగుడువంగ నున్నప్డు మదనవైరి.

తే. ఓషధిప్రస్థపురవీథి నుబ్బియుబ్బి, హేషమాణాశ్వములపయి నెక్కియాడు
గణములిరువంకఁగొలిచిరాఁగాలగళుఁడు, వృషభపుంగవువాహ్యాళి వెడలునపుడు.

ఉ. ఆరభటీకఠోరతరహాసు లుదంచితచంద్రహాసు లం
గారనిభారుణాక్షులు ప్రకారవిశాలమనోజ్ఞవక్షులు లా
కారధురంధరుల్ ప్రకటకంబుమనోహరకంధరుల్ జటా
ధారులు మేరుధీరులు సదాశివుసన్నిధిపారిపార్శ్వకుల్. 7

తే. వీటఁ దమకెవ్వ రెదు రని వెఱపులేక, చెల్లుబడిఁ బ్రల్లదంబులు సేయఁదొడఁగి
రభపులెంకలు జమునిమారంకకార్లు, వేశవాటీకుటీమధ్యవీథులందు. 8

క. కుంభోద్భవుపాలెమున ని, కుంభుదివాణమున భృంగి కులపతిగాఁగాఁ
గుంభోద్భవువగఁ దిరిగిరి, శంభునికింకరులు గర్వసంరంభమునన్. 9

సీ. పులికళాసంబు గప్పుదురు పాఱఁగ మీఁద విద్యాధరాంగనావిటగణంబు
గంధర్వకామినీకాముకవ్రాతంబు లాతాలఁ గొని మోఁది లజ్జఁగొండ్రు
కకపాలవెలిబూదిఁ గన్నులలోఁ బ్రామి బాధింతు రప్సరఃపల్లవకుల
గరుడభామాభుజంగప్రతానముఁ బట్టి బాధింతు రురయోగపట్టకముల

తే. నాగడీలు మహాధూర్తులగడుఁగాక, లుద్ధతులు గొంట్లు పలుగాకు లుదురుమిడుకు
లాకతాయులు శఠులు గయ్యాళు లగుచు, నోషధిప్రస్థ[1]మిల్లిల్లు నుడుకుచుండ.

వ. మఱియు నానాప్రకారంబులం బ్రమథజటాధారులు యథేచ్ఛాచారులై యోషధిప్రస్థపురంబునం క్షుద్రోపద్రవంబులు సేయుచుండ హిమవంతుం డంతయు నెఱింగి మేనకాదేవియుం దాను మంతనం బుండి యీశ్వరునితోడి పొత్తింతియ చాలు నని యాప్రొద్దు కూఁతు రావించి యి ట్లనియె. 11

క. కమలాక్షి యసంఖ్యాత, ప్రమథగణంబులును భూతపరిషత్తుఁ బిశా
చములున్ మొదలగు ధూర్తుల, సమూహమును నీమగండు సంభావించున్. 12

క. భూతప్రేతపిశాచ, వ్రాతంబులు తోడుగాఁగఁ బ్రమథులు పగలున్
రాతిరియును నష్టాదశ, జాతిప్రజలకును దుర్దశలు సంధింతుర్. 13

ఉ. వేమఱు రాత్రియుంబగలు వీథులఁ గల్పలతాప్రసూనమా
ధ్వీమదమత్తచిత్తు లయి వేలుపులేములఁ బట్టుకొండ్రు నీ
స్వామికి నిష్టభృత్యు లగుజంగమ ముండ కపాలపాణి కా
లాముఖవీరపాశుపతలాంఛనధారులు ధూర్తవర్తనుల్. 14

క. ఈవీట నసంఖ్యావలి, ద్యావాపృథివీమహోమహత్తులకుం ద
ర్పావేశంబున ధౌర్త్యము, గావింపఁగ మాన్పఁదగదె కఱకంఠుసఖున్. 15

సీ. తలమీఁదిచదలేటిదరిమీలఁ దినఁ జేరు కొంగలు చెలఁగి కొంగొంగు రనఁగ
మెడదన్ను పునుకలనిడుపేరు లొండొంటిఁ బోరిఁ బోరిఁ దాఁకి బొణ్బొణుగురనఁగఁ
గట్టినపులితోలుకడకొంగు సోఁకి యాఁబోతుతత్తడి చిఱ్ఱుబుఱ్ఱు మనఁగ
గడియంపుఁబాములు కకపాలలో నున్న భూతి మైఁ జిలికిన బుస్సు రనఁగఁ

1. ముల్లల.

తే. దమ్మిపూఁజాలిపుసుకకంచమ్ము సాఁచి, దిట్టతనమున బిచ్చము దేహి యనుచు
వాడవాడల భిక్షించుకూడుగాని, యిట్టిదివ్యాన్నములు మెచ్చునే శివుండు. 16

వ. అను పలుకులు పలుకు నవసరంబున. 17

తే. అఖిలలోకేశ్వరుఁడు మాయయాత్మలోని, విసువుఁ జారజనంబుల వేసటయును
ప్రమథగణములు సేయుధార్ష్ట్యంబు నెఱిఁగి, దారుకావనికరుగంగఁదలఁచెనపుడు.

వ. ఇట్లు తలంచి నందివాహనారూఢుండును గతిపయప్రమథపరివారపరివృతుండును నై మామ వీడుకొనక గౌరికిం జెప్పక నభోమార్గంబునఁ దత్పర్వతైకదేశస్థితం బగు దేవదారువనంబుం బ్రవేశించె నప్పర్వతం బెట్టి దనిన. 19

సీ. వృద్ధకచ్ఛపరాజువీఁ పంఘ్రిపీఠంబు సురతరంగిణి వెల్లి శిరసుపాగ
మహిమండలమునకు మానదండము మేను పూర్వాపరాబ్ధులు పొరుగుటిండ్లు
కాత్యాయనీదేవి కన్యకారత్నంబు చేసికన్నులవేల్పు పెండ్లికొడుకు
పాలనీయ మశేషశైలసామ్రాజ్యంబు యాగహవిర్భాగ మోగిరంబు

తే. మాల్యవన్మేరుకైలాసమలయసహ్య, గంధమాదనమందరక్రౌంచవింధ్య
భూధరంబులు చుట్టాలుపొగడఁదరమె, సకలగుణధాముఁ బర్వతసార్వభౌము.

క. అందు విహరించుఁ గాంచన, కందరమందిరములందుఁ గౌతుక మొప్పన్
బృందారకమిథునంబులు, కందర్పవిహారములఁ బగళ్లును రేలున్. 21

ఉ. ఎంచి నుతింప శక్యమె యహీశ్వరునంతటివానికైన ర
త్నాంచితరోచిరుద్గమనిరస్తరవీందుమరీచిజాలమున్
గాంచనకందరాయవనికాయితవారిధరాంతరాళ ని
ర్వంచితదేవతామిథునవాంఛితమూలము శీతశైలమున్. 22

తే. హేమశైలంబు దోగ్ధగా భూమి సురభి, నఖిలరత్నౌషధులును గల్పాదియందుఁ
బృథుమహారాజుపంపునఁ బితికె నెలమి, మంచుకొండను బెయ్యఁగావించిగిరులు.

శా. ఆమోదంబున వేఁటలాడుదురు నీహారాద్రికాంతారరే
ఖామధ్యంబునఁ జాపటంకృతులతో గంధద్విపశ్రేణులన్
క్షామక్షామమనోజ్ఞమధ్యములు [2]గుంజాభూషణాలంకృతల్
వ్యామగ్రాహ్యపయోధరల్ శబరసేనాధీశసీమంతినుల్. 24

క. మృదుమేనిసాము కూఁతురు, జడనిధిచెలికాఁడు కొడుకు సర్వంసహకున్
నిడుగోల కడలికడలకు, వడఁకులగుబ్బలికి సరియు వసుధాధరముల్. 25

క. ఆటవికభామినీభుజ, తాటంకితదీర్ఘదీర్ఘతరవేణుధను

---

1. లేఁగ, పెయ్యగాఁ దన్ను దివుటఁ గల్పించి గిరులు. 2. రుంజా.

ర్ఝ్యాటంకారధ్వనిపరి, పాటీముఖరములు తుహినపర్వతతటముల్. 26

వ. మఱియు జాహ్నవీనిర్ఝరధారాఝాత్కారఘుమఘుమాయితమణిగుహాకుహరంబును వనమహిషశోణాభిఘాత ప్రస్నిగ్ధ పాషాణస్థలనరోహద్గర్భిణీగర్భపాతంబును శబరపురంధ్రీనీరంధ్రకుచకలశలేపనముద్రాయోగ్యవర్ణ వర్ణనీయగైరికశిలాచూర్ణంబును గిన్నరమిథునక్రీడాసంకేతనికేతనాయమాన కనకకేతకీకుంజక్రోడంబును గంధర్వకన్యకానఖముఖస్ఫాల్యమాన వీణా గుణ క్వాణ సంగీతభంగీ తరంగితాంతరంగ వనకురంగంబును విద్యాధరాభిసారికా మనోరథపదానురోధ నిర్ణిరోధనిరవగాఢసంబాధ పృథులతమతమాలవీథీతిలకంబును నైనయక్కొండదక్షిణభాగంబున నుండుదాక్షాయణీవనంబున కనతిదూరంబున. 27

సీ. కర్ణికామాణిక్యకనకపద్మములతోఁ గల్పవల్లీకుడుంగములతోడ
విమలచింతారత్నవేదికాస్థలులతో సిద్ధరసాపగాశ్రేణితోడ
దివ్యలోకాప్సరఃస్త్రీకదంబముతోడఁ గామధుగ్ధేనుసంఘములతోడ
దివ్యౌషధీలతాదీపమాలికలతో సకలర్తుసన్నివేశంబుతోడ

తే. మదనవైరికి గారాపుమామ యైన, మంచుగుబ్బలిఱేనిసీమాంచలమున
దేవతామునిసేవ్యమై తేజరిల్లు, ధర్మసంజీవనము దేవదారువనము. 28

క. అందు వసియించుసంయమి, సందోహము పంచబాణసదృశము లీలా
సౌందర్యకళానిర్జిత, బృందారక సతులు వారిబింబాధరలున్. 29

సీ. జిలుఁగైనకనకంపుఁజీనాంబరముకొంగు పాలిండ్లబింకంబు బయలుపఱప
భ్రమరకంబులఁ జుట్టు ప్రస్వేదకణములు నొసలికస్తురిబొట్టు నూలుకొలుప
దరవిశ్లథం బైనధమ్మిల్లభారంబు చిమ్ముచీఁకటులకుఁ జిట్టమిడువఁ
దరళహాటకరత్నతాటంకదీప్తులు చెక్కుటద్దములపై జీరువాఱఁ

తే. బసిఁడికుండల నిర్ఝరాంభస్సుఁ దెచ్చి, పోయఁ గంకణనిక్వాణములు సెలంగఁ
గన్యలతలకు మునికన్యకాకదంబ,మభిమతం బైనయప్పావనాశ్రమమున. 30

క. జ్యోతిష్టోమాదిమఖ, త్రేతానలపుణ్యధూమరేఖామృతగం
ధాతిరయం బడఁగించుం, జాతకసంఘము తదీయపర్యంతమునన్. 31

ఉ. సమ్మదలీలతోఁ జదువు సామము లేడును గండుఁగోయిలల్
తుమ్మెద లాలపించుఁ బరితోషమునం బ్రణవాక్షరంబులన్
సమ్మతిఁ బ్రస్తవించు శుకశారిక లాగమభాషితంబులన్
సెమ్మదిఁ జెప్పు శాస్త్రముల నీలగళంబులు తద్వనంబునన్. 32

శా. కాముం జీరికిఁ గోక క్రోధము నహంకారంబు లోభంబు నీ

క్ష్యామాత్సర్యము డాకలేపపహాసారాగంబులం జేర నీ
కాముష్యాయణులై ప్రశాంతమతులై యయ్యాశ్రమాంతంబులన్
సేమం బొప్పఁగ సంచరింతురు మునుల్ నీవారముష్టింపచుల్. 33

శా. ఆనందంబునఁ ద్రుళ్లఁబుచ్ఛములు పెల్లల్లార్చుచున్ లేఁగ న
క్కానన్ గోవులగోష్ఠదేశముల జంఘాలాఘవం బొప్ప హో
మానుష్ఠానవిధిప్రకారపరతంత్రాత్మప్రసూకామధు
[1]గ్ధేనూదన్యసుధాప్రవాహలహరీతృప్తాంతరంగంబులై. 34

శా. ఆయావేళల మానిభార్యలు గృహవ్యాపారలీలాభవ
త్కాయక్లేశము లుజ్జగింత్రు విలసత్కర్పూరరంభాతరు
చ్ఛాయాశీతలచంద్రకాంతమణిపాషాణప్రదేశంబులన్
వాయుప్రేరణఁ బచ్చకప్పురము పైవర్షింప నక్కానలోన్. 35

వ. మఱియు న త్తపోవనంబునందు. 36

క. నిలయవ్యాపారంబుల, యలపుల మేనులు చెమర్చి యపరాహ్ణమునన్
సెలయేఱులలోఁ జిల్లులు, చిలుకులు నాడుదురు మునులచివురుంబోణుల్. 37

సీ. సెలయేటి తెలినీటఁ జిలుబంతిపసుపాడి సేసక్రమ్ముళ్ల పిచ్చియలు తుఱిమి
గురువిందపేరులు గుబ్బచన్నులఁ దాల్చి నెమిలిపించెంపుఁబుట్టములు గట్టి
పయ్యెదమాలుగాఁ బొఱుటాకు లమర్చి చాఁదునఁ దిలకంబు సంతరించి
కంకేళిచిగురాకుఁ గర్ణపూరముఁ జేసి కుసుమపూవులధూళిఁ గురులఁ దాల్చి

తే. చెంచుఁజిగురాకుఁబోణుల చేఁత లెల్ల, నభినయింతురు పర్ణశాలాంతరములఁ
దండ్రు లెందేనిఁ జనునప్డు తల్లులెదుర, గారవము సేయ మునికన్యకాజనంబు.

సీ. నిర్ఝరాంభఃకేళి నీలకంఠాంగనా తాండవాడంబరదర్శనంబు
పుష్పాపచాయంబు పూర్ణిమాతిథినిశాచంద్రోదయారంభసంభ్రమంబు
ప్రసవకందుకలీల బాలప్రవాళాచ్ఛగిరినదీసైకతక్రీడనంబు
పాంచాలికారక్తి కాంచనకుంభాంబుపూరకల్పితలతాపోషణంబు

తే. లతిథిపూజార్థసజ్జీకృతార్ఘ్యపాద్య, సలిలమధుపర్కలాజకుశప్రవాళ
గంధపుష్పాక్షతాదిప్రగల్భనములు, ప్రత్యహఃకృత్యములు మౌనిబాలికలకు. 39

వ. మఱియు వద్దేవదారువనంబునందు మునులవ్రతభంగంబు సేయంబూని యేతెం
చిన పదునాల్గుజాతుల యప్సరస్త్రీకదంబంబులు ప్రతిజాతి కొక్కొక్కవాడ
యేర్పడ నానాసంకేతసన్నివేశంబులై తప్పకుండు మార్తాండమండలంబు విద్యు
త్తండంబులు మృత్యుదేవతావదనగహ్వరంబు నారాయణోరుకాండం బగ్ని

1. ధేనూధస్య.

జ్వాలాజాలంబు శంబరారాతిచెఱకువిల్లు ముక్కంటినొసలిచిచ్చుఱకన్న గంధ ర్వవంశద్వయం బాదిగా బహువిధాన్వయంబుల నుత్పన్నంబు లగుటం జేసి తమ తమ యుత్పత్తిలాంఛనంబులును సౌభాగ్యధ్వజపతాకాపటలంబులుం దేటపడఁ బ్రతిభవనభిత్తిభాగంబునం జిత్రించిన చిత్తరువులయందుం గోరికితనేత్రత్రిభాగుం డై కుసుమకంకపత్రంబులవంక లొత్తుచు రతీదేవికృత్తస్తనంబులమీఁద నత్తమిల్లినయున్మత్తచిత్తభవువిక్రమ సంపత్తిప్రకారంబును, నట్టేటం బట్టపగలు యోజనగంధ యనుగంధగజగమన వట్రువ చనుంగవ నూచి తొట్రుపడువసిష్ఠపౌత్రునిదృష్టి ప్రియత్వంబును, నాచార్యభార్య యగు తారాదేవిమీఁదఁ దారకారాజుపఱపుచీటంబు వాటంబు సేయు లలితకటాక్షవీక్షావిక్షేపమ్ములును, ధృతిమాలిమాలినీసైకతంబున నేకతంబునం గురువిందపాదలో వేలుపులంజియ కెంజిగురుచవిసూచినవశికనందను రాగావేశంబును, గుసుమకోదండజయడిండిమం బగు విభాండకసుతుని వనితామండలాసక్తియు, బృందావనంబునందు ముకుందుం డొనరించిన నందవ్రజవధూవిహారాడంబరంబును, నంబురుహసూతి యాఁడుపట్టిం బట్టుకొనినపట్టునుం, బురుహూతుండు గౌతమకళత్రంబుమీఁదం గల్పించిన చీఁకటితప్పును జూఁ జూపఱకుఁ జిత్తంబు లువ్విళ్ళూర వేఱవేఱ వసియించియుండు నచ్చేడియలలో విబుధమత్తకాశినీజనోత్తమ యగు తిలోత్తమయు, వశీకృతకుసుమనారాచ యగు ప్రమ్లోచయు, నలకూబరనఖాంకరేఖాంకితస్తనకుంభ యగురంభయు, గుణపేశి యగుసుకేశియుఁ, గలమంజుఘోష యగుమంజుఘోషయు, శృంగారరసరాశి యగునూర్వశియు, రూపానురూపస్థానక యగు మేనకయుఁ, గలికిచూపుల హేలాసందర్శితమేఖలాకలాపంబు లగువిభ్రమవ్యాపారంబుల హాటకతులాకోటిఝుళఝుళత్కారమందరంబు లగుమందరగమనంబుల వికస్వరకపోలఫలకంబులగు మొలకనవ్వుల నమృతరసరూపంబు లగునాలాపంబులఁ ద్రిభువనంబులు వశీకరింతు రట్టిదేవదారువనంబునందు. 40

సీ. నందికేశ్వరు నొక్కనవశాద్వలంబున హరితాంకురములు మేయంగఁ బనిచి
ప్రమథుల నొక్కసరస్సమీపంబున లింగార్చనంబుఁ జెల్లింప నునిచి
భూతజాతము నొక్కపులినస్థలంబున నాత్మేచ్ఛ నుండంగ ననుమతించి
మాత లేడ్వురు నొక్కమణికందరంబున విశ్రామ ముండంగ వెరవుచేసి
తే. పసిఁడికొప్పెర లాతంబుఁ బచ్చకోల, జోగపట్టియ కకపాల జోలిసంచి
కలికశాటుకగిరొబ్బట్టు పలుఁగుపేరు, జాతిగాఁ దాల్చి నెఱమిండజంగ మగుచు.

వ. భిక్షాటనంబునకుం జొచ్చె నప్పు డవ్వేశవాటంబునందు. 42

శా. ప్రాలేయాచలకన్యకాధిపతికిం బ్రమ్లోచ మోచాఫల

మాలాపూపఘృతాన్వితంబుగఁ గడుందోరంబు బిచ్చంబుఁ గొం
గొలం బెట్టె నఖాంకురద్యుతులతోఁ గీల్కొంచు మాణిక్యము
ద్రాలంకారమయూఖకందళదళవ్యాపార మేపారఁగన్. 43

తే. రంభ రంభామ్ర ఫలసమగ్రంబుగాఁగ, నమృతదివ్యాన్నభిక్ష కామారి కొసఁగె
రాపుఁజన్నులనడుమ రారాజుపట్టి, పట్టి యొత్తిననఖరేఖ బయలుపడఁగ. 44

సీ. కనకనూపురరణత్కారనిక్వాణంబురవలి మెట్టియలతో రాయిడింప
రవయుంగరంబులరత్నాలదీప్తులు వాలారుగోళ్లపై జీలువాఱఁ
గుదురునిండినమించు గుబ్బచన్నులమీఁద ముత్యాలహారంబు మురువు సూపఁ
గంపించుబంగారుఁగమ్మలక్రొమ్మించు నిద్దంపుఁజెక్కుల నీడ సూప

తే. యెదురుగా నల్ల నేతెంచి హేమపాత్ర, నాజ్యమధుశర్కరాఫలాద్వ్యాప్తముగ
మదనవైరికి నర్పించె మంజుఘోష, యమృతదివ్యాన్నపాయసాహారభిక్ష. 45

శా. అక్షయ్యంబుగ దివ్యమాధుకరభిక్షాన్నంబు వడ్డించెఁ దా
గోక్షీరంబులతోడ శర్కరలతోఁ గ్రొన్నేతితోఁ దేనెతో
ద్రాక్షాదాడిమచూతపాకములతో దాక్షాయణీభర్తకున్
చక్షూరాగ మెలర్పఁగా హరిణి విశ్వాసంబుతో ముంగిటన్. 46

ఉ. అల్లనఁ జేర వచ్చి ధవళాన్నముఁ గమ్మని యాలనేతితో
బెల్లముతోడ నాల్కడపుఁజేసముతోఁదని పండ్లతోడ శ్రీ
వల్లభుమూర్తి సెచ్చెలికి వారణవైరికి మంచుగొండరా
జల్లునికిం బినాకికిఁ బ్రియంబున నూర్వశి పెట్టె భిక్షమున్. 47

ఉ. పెట్టెఁ దిలోత్తమాప్సరస భిక్ష ప్రియంబున భూతభర్తకున్
1గట్టుఁ బసిండి పాత్రఁబులకండముతోడ ఘృతంబుతోడఁ గ్రొం
బట్టుఁబసిండి సిబ్బెములఁబయ్యెదకొం గొకకొంత జాఱి చ
న్గట్టు లలాటలోచనునికన్నులు మూఁటికి విందు సేయఁగన్. 48

తే. సహజసౌజన్య సహజన్య శంకరునకుఁ, బొసఁగ వడ్డించెఁ దత్కాలపుణ్యభిక్ష
సారదోర్మూలకూలంకషంబులైన, వీఁగుఁబాలిండ్లు పయ్యెద వీడుకొలుప. 49

క. విశ్వచతుర్దశభువనా, ధీశ్వరునకు భక్తియుక్తి నెసకం బెసఁగన్
విశ్వాచి యనెడునచ్చర, శశ్వన్మధురాన్నభిక్ష సమ్మతిఁ బెట్టెన్. 50

తే. కనకనూపురమేఖలాకలకలంబు, రత్నకంకణరవముతో రాయిడింప
నభవునకుఁ బెట్టె మధురదివ్యాన్నభిక్ష, చిత్తభవకీర్తిశశిరేఖ చిత్రలేఖ. 51

వ. మఱియువిద్యుల్లేఖాదులగుతక్కులేఖాలలనలుభుజంగభూషణునకు నపాంగరంగ

1. గట్టెఁ బసిండి శర్కరలఖండము.

ఫలలాస్యలంపటంబులగు కటాక్షవీక్షణంబులతోడం గూడ భిక్షాహారంబులు సమర్పించిరి. కందర్పనూదనుండును బ్రతిమందిరంబునం జందనకుసుమధూపదీపాద్యుపచారంబులు గ్రహించుచు నవ్వేశవాటంబున భిక్షాటనక్రీడ సలిపి యంతం దనివి సనక కనక గర్భకపాలపాత్రం బర్ధపూర్ణంబై కరపల్లవంబున సుల్లసిల్ల, నల్ల నల్లన యోగపాదుకాయుగళంబు గల్లుగల్లున మ్రోయ మునిజనాశ్రమంబుం బ్రవేశించి మునిమందిరముల మోసలల నిలిచి 'భవతి భిక్షాం దేహి' యటంచు వారివాహగర్జాగంభీరస్వరంబునం బలుకుచుం, గులాంగనాజనంబు నపాంగదృక్తరంగంబులం జిలునగవు లిసిఱింతలువాఱం గనుంగొనుచుం, సంయమివధూపాతివ్రత్యభంగంబు తనకుం బరమ ప్రయోజనంబుగా గర్భోక్తి సందర్భంబుల నిజాభిలాషంబుం దేటపఱుచుచుం బర్యటింపం దొడంగిన. 52

మ. దరహాసంబుల భ్రూలతానటనచేతన్ విభ్రమప్రౌఢిమన్
బరిహాసోక్తుల భావగర్భరససంపత్తిస్ఫుటాలోకన
స్ఫురణాభంగుల మానికాంతలమనంబుల్ చూఱలాడెన్ మహే
శ్వరుఁ డుద్దామవిలాసదారువనికావాటప్రదేశంబులన్. 53

సీ. సుబలమార్కండేయశునకమాంజాయన మాండవ్యగోత్రసంభవులయిండ్ల
బకదాల్భ్యరైభ్యకభల్లకిజతుకర్ణకణ్వకుత్సాన్వయాగ్రణులయిండ్ల
ఘటజానుకాత్రేయకటకలాపసుమిత్రహరివక్త్రమునివంశధరులయిండ్ల
వాయుభక్షకభార్గవవ్యాసజైమినిశుకకపిలకుల ప్రసూతులిండ్లఁ
తే. బుణ్యగృహిణులఁ బతిభక్తిపూర్ణమతుల, భాగ్యసంపన్నులను బుత్రపౌత్రవతుల
సతుల ముత్తైదువుల నిర్విశంకవృత్తి, రజనికరఖండమౌళి విరాళి గొలిపె. 54

వ. ఇట్లు ప్రతిగృహంబున భిక్షాటనంబు సేయుచు మహోక్షలాంఛనుఁడు వాంఛానుకూలప్రకారంబునం జోరరతవ్యాపారపారాయణుండై మగలకన్ను మొఱంగి సంధ్యాసమయంబుల ననుష్ఠానార్థంబు పురుషులు సమిత్కుశఫలాహరణార్థం బెందేనిం జనినయెడరు వేచి శపథశతతోష్ఠంబును నిరుద్ధనిశ్వాసోత్సాహంబును నివారితోల్లాసంబును నిమేషమాత్రసాధ్యంబును నిబిరీసభయకంపంబునైనసంభోగంబు లభిలషించు నారంభోరువులమదనలేఖాకథాసందేశవాక్యంబులను సంకేతస్థానకంకేళికేళి నికుంజక్రోడసంవేశక్రీడలను వాతదూతీపరామర్శంబులను భ్రూలతాదేశంబులను నపాంగరంగల్లాస్యలంపటకటాక్షవీక్షావిక్షేపంబులను మందహాసకందళితపరిస్పందంబులఁ గందర్పపరబ్రహ్మానందం బనుభవింపంజేసి మిసిమింతుండునుంగాక దేవదారు కాంతార మధ్యంబున. 55

సీ. మువ్వన్నెపులితోలు మొలదిండుగాఁ గట్టి కర్కోటకాహిఁ గాఁగఁ బిగించి
చిలువపోఁగులును శ్రీవల్చపులఁ గీలనచేసి కలకాచనీరు మైఁ గలయ నలఁది
చిన్నారిపొన్నారిశిశిరాంశుఁ దలఁదాల్చి కొనగోటిజత లేడికొదమఁ బూని
పచ్చియేనికతోలుపచ్చడంబు ధరించి గిలుకుమువ్వలకోలఁ గేలఁ బట్టి
తే. పసిఁడిజలపోసనముతోడ నెసఁకమెసఁగు, బిసరుహాసనుపుఱియకప్పెర ధరించి
పెద్దనడివీథి నిలుచుండి భిక్షు యడుగు, నాశ్రమంబునయందు ఖట్వాంగపాణి. 56
వ. ఇవ్విధంబున మన్మథమథనుండు మదనోన్మాదంబునం గన్నుగానక మునికళత్రం
బుల పాతివ్రత్యంబులు పొలిపుచ్చుచు విచ్చలవిడిఁ జరియింపం బూనిన నిలింప
మానివ్రాతంబు వారివారికి నెఱింగి గుజగుజవోవుచు వంచనంబు ప్రకాశింపం
జాలక లోలోన యడంచుకొని యుండుచుండ నప్పాటం బ్రతిభవనంబునఁ
బాటిల్లు చీఁకటితప్పు కప్పిపుచ్చ వెరవుపడకుండునట్లుగాఁ బ్రకాశించినఁ గట్టా
యితంబై యందఱు నాజగజెట్టివేల్పుఁ బేనిం బట్టుకొనువారై చుట్టుముట్టిన. 57
క. ముసిముసినవ్వులు నవ్వుచు, మిసిమింతుఁడు గాక యొక్కమిఱుత నిలిచి యు
క్కుసుమశరహరుఁడుతపసులు, కసమసఁదనుఁబట్టుకొనఁగఁ గడఁగినఁ బెలుచన్.
* * * * * * * * 59

## ఆశ్వాసాంతము

శా. శ్రీమద్దక్షిణకాశికాపురమహాశ్రీకాళహస్తీశ్వర
ప్రేమాత్మోద్భవకాలభైరవకృపాశ్రీవర్ధితైశ్వర్య! యు
ద్దామప్రాభవ! దానవైభవకళాధౌరేయ! హేమాచల
స్థేమా! వీరకుమారగిర్యధిపలక్ష్మీభోగభాగోచితా! 60
క. కావేరీవల్లభ! సం, భావితబుధలోక! సమరఫల్గున! ధరణీ
దేవార్చనాపరాయణ, కోవిద! తిరుకచ్చినంబికులజలధిశశీ! 61
మాలిని. మృగమదఘనసారశ్లేష్మలనాసంప్రయోగ
ప్రగుణితహిమపాతప్రౌఢకేళీవిహారా!
యగురుఘుసృణపంకవ్యాప్తిగంధాంబుగంధ
స్థగితదిగవకాశా! దానవిద్యానిధీశా! 62
గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర వినయవిధేయ
శ్రీనాథనామధేయప్రణీతం బయినహరవిలాసం బను మహాప్రబంధంబునందుఁ
బంచమాశ్వాసము.

# షష్ఠాశ్వాసము





వటుకనాథభైరవ
దేవశ్రీపాదపద్మదృఢతరభక్తీ!
దేవబ్రాహ్మణసేవక
దేవప్రభుతనయ! యవచిదేవయతిప్పా! 1

వ. ఆకర్ణింపుము. 2

ఉ. హేమనగంబుమీఁద దివిజేంద్రులు గొల్వ మహావిశుద్ధము
క్తామణిరత్నసంఘటితకాంచనగండశిలాతలంబునన్
హైమవతీసహాయుఁ డయి యర్ధశశాంకధరుండు దేవతా
గ్రామణి నీలకంఠుఁడు సుఖంబునఁ దాఁ గొలువుండె నర్మిలిన్. 3

వ. అప్పుడు పార్వతీదేవి మహాదేవునియింగితం బెఱింగి యిట్లనియె. 4

తే. అభవ! నీకంఠమూలంబునందుఁ దెలిసి, కాననయ్యెడు నిదియేమి కప్పు సెప్పు
మఖిలలోకవిలోచనాహ్లాదకలన, కందమై యంద మయ్యె శృంగారరేఖ. 5

తే. ఆనతిమ్ము మహాదేవ! యభవ! నీదు, కంఠమూలము నలుపైనకారణంబు
నన్ను మన్నించి యీకారణంబు నాకు, నానతీఁ దగు నీవు లోకాభివంద్య. 6

వ. అనిన విని శంభుండు శాంభవి కిట్లనియె. 7

మ. మును జంభాసురబాహువిక్రమకళాముద్రావిభాభాసురన్
ఘనదంభోళినిశాతహేతినిహతిన్ ఖండించి యాఖండలుం
డనుమోదంబున దేవతల్ గొలువఁగా నైరావణారూఢుఁ డై
ఘనమార్గంబున వచ్చె నాకమునకున్ గర్వం బఖర్వంబుగన్. 8

క. ఆవేళను గంధర్వులు, కైవారపదానుసారకమనీయముగాఁ
బ్రావేశికధ్రువాగా, నావళులం బరిఢవించి రంచితలీలన్. 9

ఉ. క్రచ్చలఁ బారిజాతలతికావనదేవత జంభవైరిపై
మచ్చికఁ గూర్పఁగా నవసుమప్రకరంబుల వేల్పుటేటిలో

విచ్చినపైఁడితామరలవెంబడి వచ్చినకమ్మగాడ్పులన్
మెచ్చులరీతిఁ గోకిలసమీరణ దీవన లిచ్చె నొప్పుగన్. 10

క. మందాకినీతరంగము, లాందోళము నందఁ జేయు చల్లన సం
క్రందనునిమీఁదఁ బొలసెను, మందారలతావనాంతమందానిలముల్. 11

తే. దేవతాభర్త యమరావతీపురంబుఁ, జేరఁ జనుదెంచె వేల్పులు చేరి కొలువ
భ్రాజదైరావణానేకపప్రచార, తరళమాణిక్యకుండలాభరణుఁ డగుచు. 12

వ. అయ్యవసరంబున. 13

శా. గీర్వాణాధిపుచెంగట న్నిలిచె నక్షీణప్రభావాధికాం
తర్వాణిస్తుతవాగ్విలాసుఁడు కృతద్వంద్వవ్యుదాసుండు చి
న్నిర్వాహస్థిరయోగవైభవకథానిత్యోదయోల్లాసుఁ డ
ద్దుర్వాసుండు ప్రసూనమాల్యరుచిమద్ధోఃపద్మవిన్యాసుఁ డై. 14

తే. తనకుఁ బ్రహ్మోచ యనుదేవతాపురంధ్రి, పావడముఁ జేసె నెద్దాని భయముతోడ
నట్టితనపారిజాతమాల్యంబు హరికి, దర్శనం బిచ్చె దీవించి తాపసుండు. 15

వ. ఇట్లు దుర్వాసుం డాశీర్వాదపూర్వకంబుగా నొసంగినకుమారపారిజాతమాల్యం బహల్యాజారుం డగుశునాసీరుండు దుర్వారవిజయగర్వాటోపంబునం గన్నుగానక పట్టికాలంకారతాటంకితలలాటం బగునైరావణకరటికుంభపీఠంబుపై నలవోకయుంబోలె వైచె వైచిన నమ్మదాంధగంధసింధురంబు వసుంధరాభరణశౌండం బగుతుండంబెత్తి నున్నని యప్పావ్వుదండఁ గ్రమ్మనఁ గ్రమ్మతించి విసరి కేసరంబులు వీసరవోవ మకరందంబు చిందఁ బొరలు విఱుగం బుప్పొడి సడలం గపోలభిత్తిభాగంబు మొత్తి యున్మత్తమధుపంబుల రేఁచి యుప్పరంబునం ద్రిప్పి చెందిరంబు ధూళిఁదూలించి యందంద కొంతతడవు వినోదించె నప్పువుదండ వాస్తోష్పతి పట్టినయేనుంగువలన నిట్టు నట్టునుం బడి కువిటుచేతం బడినపూఁబోడిపోలిక బెబ్బులివాతంబడిన హరిణిచందంబునఁ బ్రమత్తునికైవసమగురాజ్యలక్ష్మివిధంబున విడివడియు డస్సియుఁ గ్రుస్సియు నొగిలియుఁ బగిలియు దీనదశకు వచ్చినం గనుంగొని. 16

మ. వికటభ్రూకుటిఫాలభాగుఁడును బ్రస్వేదాంబుపూర్ణాఖిలాం
గకుఁడుం బాటలగండమండలుఁడు నై కల్పాంతసంహారరు
ద్రకఠోరాకృతి దుర్నిరీక్షుఁ డగుచున్ ధట్టించి దుర్వాసుఁ డు
గ్రకటాక్షంబున నింద్రుఁ జూచి పలికెన్ గాఢాగ్రహవ్యగ్రతన్. 17

క. ఓరి మదాంధ! యహల్యా, జార! త్రిలోకాధిరాజ్యజాత మగునహం
కారంబా యిది మమ్ముం, జీరికిఁ గైకొనక యిటుసేయుట యెల్లన్. 18

తే. ఏను దీవించి చేయెత్తి యిచ్చినట్టి, పుష్పమాలికనాదలఁ బూనవైతి
హస్తిచేతికి నిచ్చితి వంతఁబోక, దండనార్హంబె యిప్పువ్వుదండ నీకు. 19

క. క్రోధం బితరులకుఁ దపో, బాధక మగుఁ గాని నాతపంబున కది యు
ద్బోధకము సలిల మగ్నికి, బాధకమై వైద్యుతాగ్నిఁ బ్రభవించుగతిన్. 20

క. నీకసులకు నిది మాల్యం, బోకుధరవిరోధి! యింతనుండియు నిట నీ
నాకం బఖిలంబున ని, శ్శ్రీకం బగుఁ గాక నీవిజృంభణ మణఁగన్. 21

ఉ. నన్నుఁ దిరస్కరించితి మనంబున నించుక భీతిలేక నే
గన్నులఁ గాన వైతి మదగర్వవికారదురాగ్రహైకసం
పన్ననిరాజ్యలక్ష్మికి నపాయము గల్గక యుండు నెట్లు నీ
యన్నియు వస్తుజాతములు నంబుధిలోఁబడుఁ గాత లక్ష్మితోన్. 22

క. ఎచ్చోట నుండు నిందిర, యచ్చోటనె యుండు సత్పదార్థంబులు నీ
యుచ్చైశ్శ్రవ మైరావణ, మచ్చర లమరద్రుమంబు లంభోధిఁ బడున్. 23

తే. అమృతకుంభంబు పడుఁగాక యబ్ధియందుఁ, గామధేనువు పడుఁగాక కంధియందుఁ
దారకాధీశ్వరుండుఁ జింతామణియును, గూడ దుగ్ధాంబునిధిలోనఁ గూలుఁగాత.

వ. అని పల్కి దుర్వాసుండు చూడంజూడ నంతర్ధానంబు సేసిన. 25

క. యతిపతిశాపాక్షరములు, శతమఖున కసహ్యహృదయశల్యము లయ్యెన్
మతిఁ దలఁపఁ బూజ్యపూజా, వ్యతిక్రమము సర్వకార్యహర మగుఁ గాదే. 26

తే. మునిశాపాగ్నిదందహ్యమానుఁ డగుచు, విన్ననైనమొగంబుతో వీడు సొచ్చెఁ
బాకశాసనుఁ డఖిలదిక్పాలకులును, దైన్యవైవర్ణ్యవంతులై తన్నుఁ గొలువ. 27

వ. అంతం గొంతకాలంబునకు. 28

సీ. రంభాదు లగునప్సరస్సరోజాక్షులు పదునాల్గుజాతులు పడిరి వార్ధి
సంతానతరుపారిజాతాదికుజములు మున్నీటినీటిలో మునిఁగిపోయె
నైరావణమ్ముఁ జింతారత్నముం గూలె నుచ్చైశ్శ్రవంబుతో నుదధిలోనఁ
గామదుగ్ధేనువుఁ గాదంబరియుఁ దాను నమృతకుంభంబుతో నబ్ధిఁ బడియె
తే. నిమ్మహావస్తువులఁ గూడి యిందురేఖ, మున్ను గా దుగ్ధమయమహాంభోధిఁ జొచ్చె
బ్రహ్మమునిఘోరశాపప్రభావయుక్తిఁ, బ్రథమదిక్పాలుత్రైలోక్యభవ్యలక్ష్మి. 29

తే. దివ్యమణి లేక యప్సరస్త్రీలు లేక, యమృతకుంభాదు లగుపదార్థములు లేక
యుక్కడఁగియుండెబహుకాలమొప్పుదఱిగి, విగతలక్ష్మీవిలా1సుఁడై వేల్పుఱేఁడు.

చ. అమృతము గల్పవృక్షనివహంబును లేనిసుధారసాశన

---

1. లాసమై వేల్పువీడు.

త్వమున నశోకవల్కపరిధానతయుం [1]గలపెద్దవేలుపుల్
నముచినిషూదనాదులు మనంబున నొందిరి ఖేదమోదదుః
ఖము గుడువంగ నోగిరము గట్టఁగఁ బుట్టముఁ బుట్టకుండుటన్. 31

వ. ఇవ్విధంబున బృందారకు లిందిరావ్యపాయంబున నపారదారిద్ర్యాంధకారమగ్ను లై నగ్నాటులుం బోలి భయంపడి ;లేటమొగంబు వడి హాటకగర్భపాలికిం బురందరుండు ముందఱగాఁ జని మునిశాపయుక్తి మూఁడులోకంబులరాచసిరి యబ్ధిలో మునింగినభంగి తేటతెల్లంబుగఁ దెలియంబఱచిన నానలినాసనుండు వెన్నునిం గూర్చుకొని మాసమీపమ్మునకు వచ్చి మ మ్మిట్లు సన్నుతించె. 32

క. జయ పార్వతీమనోహర !, జయ పరమానంద ! జయ నిశాకరమౌళీ !
జయ భూమిసలిలపావక, వియదనలార్కేందుహోతృవిలసితమూర్తీ ! 33

క. త్రిభువనభువనారంభా, రభటీసంరంభమూలరత్నస్తంభా !
యభినవహిమకరరేఖా, శుభికాలంకారధామశోభితమకుటా ! 34

క. దివసావసానసంధ్యా, నవపరమానందనందినాందీనాథ
వ్యవహారఝుంక్రియావధి, వివిధమహాతాండవైకవిద్యాభిరతా ! 35

క. తరుణహిమకిరణరేఖా, భరణా ! సురనికరమకుటభాసురరత్న
స్ఫురణాపరిచయరంజిత, చరణా ! నిరుపాధికాభిసంప్రతికరుణా. [ద్య!

తే. అజర! యవ్యయ! యనపాయ! యప్రమేయ!, యాద్య! యనవద్య! వేదవిద్యాభివం
నిర్మలాకార! నిర్ద్వంద్వ! నిరుపమాన!, నిత్య! నిజభక్తవైకుంఠ! నీలకంఠ. 37

వ. అని యనేకప్రకారంబులం బ్రస్తుతింప ననుకంపాపరాధీనుండ నగు నే నిట్లంటి.

తే. అబ్ధి మథియింపవలయు నీయవసరమున, నమృతలక్ష్మీప్రధానమహాపదార్థ
సముదయంబులు లేకున్న జగము లెల్ల, విన్నఁబోయిన వతిదీనవృత్తి నొంది. 39

సీ. ఆరసాతలమగ్న మయ్యె మునుంగని మందరాద్రీంద్రంబు మంథయష్టి
సర్వసర్వంసహాసంభృతిప్రవణుండు దందశూకస్వామి తరువుఁద్రాడు
చరమాంగపీఠికాస్థాపితశేషుండు కితవకచ్ఛపరాజు క్రిందిమట్టు
నింద్రాదిసురలు బలీంద్రాదిదనుజులు దర్పదుర్వారులై త్రచ్చువార

తే. లేను బ్రహ్మయు హరియును నింత నంత, నుండువారము కార్యప్రయోగరక్ష
నీవిధంబున దుగ్ధాబ్ధి యేచి తరువ, వివిధసద్వస్తులుం బ్రభవింపఁ గలవు. 40

వ. ఇట్టి మహాప్రారంభంబునకుం దగినసాధనసామగ్రి యిది; శేషుండును గమఠపతి యును నశేషభువనభారంబునకుం దగినవారి నియోగించి వచ్చునది; యచ్యుతుండు సురాసురులం గూర్చుకొని మందరాచలంబు పెఱికి తెచ్చునది; యేనును బితా

1. గలవేల్పుపెద్దలా.

మహుండును మున్నాడి పాలమున్నీటిదరికిం జేరి యుండువారము. ఇదియ నిశ్చయం బని యే నంతర్ధానంబుఁ జేసితి. జలజాసనుండును మదాదేశంబున దుగ్ధాబ్ధితీరంబుఁ జేరె. జనార్దనుండును దేవదానవసేనాసమేతుండై దిక్పాలురు గూడ రాఁ బశ్చిమదిశాముఖుండై చనువాఁడు మందర. 41

శా. కాంచె న్మందరశైలము౯ మృదుతటీగండోపలశ్రేణికా
చంచన్నిర్ఝరవేణికాఘుమఘుమస్వాయద్దిశాగోళము౯
బంచాస్యస్ఫుటకంఠనాళనినదప్రధ్వస్తశుండాలము౯
సంచారాలసకిన్నరీశతలతాసంఛన్నహింతాలమున్. 42

ఆ. కాంచి యమ్మహాద్రిఁ గదియంగ నూహించి, దితితనూభవులను దివిజవరుల
నాదివావితోడ నంతంత దవ్వుల, నుండఁ బంచి యంబుజోదరుండు. 43

వ. చనుదెంచి యప్పాంచజన్యధరుండు జంభారిప్రముఖు లగుదివిజవరుల నెడ గలుగంద్రోలంగ నియమించి. 44

సీ. కటిమండలంబునఁ గనకంపునునుఁజేల దృఢముగా బిగియించి దిండుగట్టి
కట్టాయితం బైనకంఠహుంకారంబు గావించె దిక్కులు గ్రక్కదలఁగ
సమధికావష్టంభసంరంభజృంభణ సమకూర్చె నిజభుజాస్తంభమునకుఁ
బాదాభిఘట్టనఁ బార్శ్వదేశంబుల నదలించి ధాత్రి గ్రక్కదలఁ జేసి
తే. పట్టెఁ గదలించె నసియార్చెఁ బాఁతగల్చె, నెత్తె వక్షస్స్థలంబున నెఱియ నొత్తెఁ
దోయజాక్షుండు లోకైకదుర్ధరుండు, తాల్చె నవలీల నిట్లు మందరనగంబు. 45

సీ. అంగదాభరణంబులందుఁ గీలించిన వజ్రాలకీలన వదలకుండ
వక్షస్స్థలంబున వైచినవకంపుఁ దులసిదండకు వాడు దోఁపకుండఁ
గడు నొప్పఁ దీర్చినకస్తూరితిలకంబు చెమటబిందులచేతఁ జెదరకుండ
నెట్టెంబు సుట్టిన నెమ్మిపించముదండ కొనలేక యొక్కింత గుదియకుండ
తే. శ్రవణకల్హారముకుళంబు జాఱకుండ, విరులకీల్కొప్పు వదలి కైపెక్కకుండ
నెత్తె శృంగారకందుకం బెత్తినట్లు, కైటభారాతి మందరక్ష్మాధరంబు. 46

శా. గోలాంగూలకులంబు లాకులపడె౯ ఘోషించె శార్దూలముల్
జాలింబొందె లులాయముల్ సుడిగొనె౯ సారంగముల్ విచ్చె లేఁ
గోలంబుల్ బెదరెం జమూరుగణ మాక్రోశించెఁ బంచాస్యముల్
తాలాంకావరజుండు మందరమహాధాత్రీధరం బెత్తినన్. 47

తే. ఏడు పాతాళములును గగ్గోడువడియెఁ, బెల్లగించి మహీధ్రంబు పెఱికినప్పు
డిందిరాభర్త గిరిమీఁది కెత్తినపుడు, గ్రక్కదల సాగె బ్రహ్మాండకర్పరంబు.

తే. ధాత్రి నాఁడు వరాహావతారవేళ, నేకదంష్ట్రాగ్రమున ధరియించినట్టి
తోయజాక్షుండు బాహాచతుష్టయమున, మాటమాత్రనె మోయఁడే మందరాద్రి.

తే. మందరాద్రిని మోయించి మాధవుండు, పట్టి తెప్పించె నిర్జరప్రతతిచేత
నసురయూథంబుచేత దుగ్ధాబ్ధిదరికి, నబ్జగర్భుండు నేనును నభినుతింప. 50

వ. అనంతరంబ నేనును హరిహిరణ్యగర్భులుం గార్యభారధురంధరులమై ప్రవర్తింపం బురందరాదిసురలు జలంధరాదిరాక్షసులును సముద్రమథనంబునకుం బ్రారంభించిరి. 51

తే. అఖిలకార్యసమారంభణాదులందుఁ, బూజనీయుండు గావున బుద్ధిఁ దలఁచి
విఘ్ననాయకు నంభోధివేలమీఁద, సురలు నసురులుఁ గొలిచిరి పరమభక్తి. 52

శా. క్షీరాంభోనిధి సైకతస్థలమున న్సింహాసనారూఢుఁగా
హేరంబు న్హరనందను న్నిలిపి ప్రత్యేకంబ దేవాసురుల్
గారామారఁగ నాచరించి రభిషేకం బుల్లసద్గంధక
స్తూరీసౌరభవాసితంబుల నదీతోయంబులం [1]దోరమై. 53

క. అభిషేకానంతరమున, నిభరాజాస్యునకుఁ గట్ట నిచ్చిరి యదితి
ప్రభవులును దితితనూజులు, నభినవదివ్యాంబరములు నాభరణములున్. 54

తే. కుంకుమాగురుమృగనాభిపంకములను, గంధకర్పూరనీహారకర్దమముల
నలఁది రమరాసురులు భక్తి యతిశయిల్ల, భవునిపట్టికిఁ బసిఁడికంభములఁ బట్టి.

సీ. ఉండ్రాలు నూటిడి పుండ్రేక్షులుం దేనె యనఁటిపండ్లుం బూరియలు ఘృతంబుఁ
బెసరుఁబప్పును బాలుఁ బెరు గోగిరంబులుఁ బాయసాన్నంబులుఁ బానకములు
నాళికేరంపుబొండాలు మీఁగడయును [2]నవనీతపిండఖండములు గుడుములు
లడ్డువంబులు చక్కిలాలు మోరుండలు ఖండంబు చలిమిడి మండపప్పు

తే. లాదిగా భక్ష్యచోష్యలేహ్యాదులైన, బహుపదార్థంబు లర్పించి ప్రణతులైరి
వేలుపులు రాక్షసులును నావిఘ్నపతికి, దుగ్ధపాథోధిమంథనోద్యోగవేళ. 56

వ. ఇట్లు షోడశోపచారంబులం బూజించి దేవాసురులు విఘ్ననాయకు నిట్లని స్తుతియించిరి. 57

దండకము. జయజయ జగదేకరక్షామణీ! దేవచూడామణిశ్రేణిశోణప్రభాజాలసుస్మేర
పాదారవిందా! ముకుందప్రియా! యిందుధారీ! కటస్యందిదానాంబుధారాధు
నీధోరణీగాహకౌతూహలాయత్తమత్తద్విరేఫాంగనా గానసంగీతరంగీకృతస్వాం
త! దంతావళాస్యా! నమస్యా! త్రిలోకైకవశ్యా! యవశ్యాయశైలాత్మజా
ధర్మసంతాన! సంతానకల్పద్రుపుష్పావతంసా! యసారోరుసంసారమాయాంధ
కారావృతిప్రక్రియాభాస్కరా! కోటిభాస్వన్నిరాఘాటదేహప్రభాభాస్వరా!

1. దోఁగఁగా. 2. నవదధిపిండఖండాలుడుములు.

దేవ! హేరంబ! లంబోదరా! యేకదంతా! మహాకాయ! సంతప్తకార్తస్వరాభా! విశాలాక్ష! మౌంజీధరా! నాగయజ్ఞోపవీతా! సమన్వితకృష్ణాజినా! యాఖువాహా! కుఠారాయుధా! విఘ్నరాజా! గణాధ్యక్ష! కారుణ్యలీలాకటాక్షంబునన్ మమ్ము వీక్షించి రక్షింపుమీ క్షీరవారాశి నీమందరక్ష్మాధరస్వామి కవ్వంబుగా నీభుజంగాధినాథుండు సూత్రంబుగాఁ గచ్ఛపాధీశుఁ డాధారపీఠంబుగా సర్వదివ్యౌషధీవల్లుల న్వైచి నానాపదార్థంబు లన్వేన్నలం బంచుకోఁ గోరి యున్నార మిక్కార్య మేవిఘ్నముం బొందకుండంగ నేవిక్రియం జెంద కిష్టార్థసంసిద్ధులం గైకొనుం గాక నీయాజ్ఞ సర్వేశ! సర్వాత్మకా! నిర్వికల్పా! నిరీహా! నిరాతంక! నిశ్శంక! యోంకారమూర్తీ! నమస్తే నమస్తే నమః. 58

క. అని నిర్జరులును దైత్యులు, వననిధిమథనాదియందు వారణవక్త్రుం
గొనియాడి తత్ప్రసన్నతఁ, గనిరొగి సంతసము మీఱఁ గడఁక దలిర్పన్. 59

వ. కట్టాయితంబై సురాసురులు బిట్టేచి పాతాళగోళంబు క్రిందుపట్టుగా నాదికమఠంబుఁ బెట్టి వాసుకిఁ దరిత్రాడుగాఁ జుట్టి తోఁకయు శిరంబును బట్టి మందరాచల మంథానంబున దుగ్ధసింధువు మథింపం దొడంగిరి. ఘుమఘుమధ్వానంబు దిక్కులం బిక్కటిల్లె. వారివాహవ్యూహంబులు కడ లవియఁ జదల నుదిలకొనియె. డిండీరపిండఖండంబులు బ్రహ్మాండంబునం బ్రసరించె; నంభస్తరంగంబులు దిగిభకుంభంబుల నాస్ఫాలించె; నావర్తచక్రంబులయందు గ్రహతారకానక్షత్రంబులు తిరుగుడువడియె నప్పుడు రటత్తిమితిమింగిలంబులును లంబచ్ఛంబలంబును శళద్ధూళియు విరుత్కమఠంబు నుద్భ్రమద్భుజంగంబునునై గంగకుం బరిభవంబును గోదావరికి ఖేదంబును బెన్నకు విన్నఁబాటును గాళిందికి మాలిన్యంబును వేత్రవతికిఁ ద్రాసంబును విపాశకుం గ్లేశంబును శతద్రువున కుపద్రవంబును నాపాదించుచు బాడబానలంబునం దొకతోకనుడుకునీరునుం గలసి నఖంపచంబై సంవర్తసమయారంభంబునుంబోలె మర్యాద నతిక్రమించుచు గిరికటక పాషాణసంఘట్టనంబున నెగయుమిణుంగురులుంబోలె నంతర్మణి శలాకాకలంబులు మీఁదికెగయ నంభోనిధానంబు మథ్యమానంబయ్యె మఱియును.

సీ. మూలాశ్మసంఘాతములరాపిడినిఁ జేసి కమఠంబు సుఖియించి కన్ను మోడ్చెఁ
గిటకపాషాణసంఘట్టనంబున వ్రస్సెఁ గుండలీంద్రునివీఁపుకుప్పసంబు
సానూపలద్రోణీఝులఝులత్కారంబు దిఙ్మండలంబుల దీటుకొనియె
శిఖరకోటీశిలాశ్రేణిరారాపుల గ్రహతారకములు చూర్ణంబు లయ్యెఁ

తే. ప్రబలబలగర్వదుర్వారబహుసుపర్వ, పూర్వగీర్వాణభుజదండభూరిసార
వితతమందరమంథానవిచలనముల, సలిలనిధి మూరె సంరంభసంభ్రమమున. 61

వ. ఇట్లు తరువందరువ సముద్రమధ్యంబున. 62

ఉ. బుగబుగమంచు గర్భజలపూరము ఘూర్ణిల బంతిగట్టి క్రొం
బొగలు తరంగసంఘములఁ బొడ్మఁగ నూష్మ జగత్త్రయంబునుం
బొగులఁగఁ జేయ నుద్దవిడిఁ బుట్టెను నల్లనిచిచ్చు మావిలేఁ
జిగురులచాయలం దెగడుజిహ్వలు గ్రోయుచు దుర్నిరీక్ష్యమై. 63

క. వాసుకివిషధరవిషని, శ్వాసంబుల ఘట్టనముల సుమధికతరమై
యీసాగరమధ్యంబున, భాసురహాలాహలంబు ప్రబలం బయ్యెన్. 64

చ. గరళమహత్తరానలశిఖానివహంబును దూఱి పాఱినం
దరికొనియెం జగత్త్రయము తల్లడ మందిరి నెమ్మనంబులన్
సురగరుడోరగామరులు సుక్కిఁ బితామహుఁ డంబుజాక్షుఁ డా
తురత వహించె దిక్పతులు తూలిరి ఘూర్ణిలె నేడువార్ధులున్. 65

వ. అప్పుడు సుస్థిరుండై విరూపాక్షుండు త్రైలోక్యరక్షాదక్షం బగుతనదక్షిణ హస్తం బెత్తి యోడకుండుఁ డభయం బిచ్చితి నని యెంత యూఱడించిన నూఱడిలక నారాయణాదులు గన ల్వేల్పులు పలాయమానపరాయణులై వెనుక మరలియుం జూడక పోవం దొడంగిన. 66

శా. హుంకారం బొనరించి యప్రతిమరౌద్రోద్రేకసంరంభని
శ్శంకాహంకృతిఁ జూఁచె నీశ్వరుఁడు హస్తంబున్ భుజంగాధిపా
లంకారంబు నశేషలోక పరిషల్లావణ్యలక్ష్మీకలా
సంకోచావహదాహభీషణవిషజ్వాలాజిఘృక్షార్థమై. 67

క. స్తంభించి నిలిచె గరళము, శంభునిముందట యుగాంతజలధరముగతిన్
గంభీరహుంక్రియావ, ష్టంభసముజ్జృంభమాణసంరంభమునన్. 68

చ. జలధర మంతయై కరటిచందము గైకొని సూకరాకృతి
న్నిలిచి పికంబుతో దొరసి నేరెడుపండును బోలె నుండయై
కలశపయోధిమంథనముఖంబునఁ బుట్టినయమ్మహాహలా
హలము క్రమంబున న్నివునిహస్తసరోరుహ మెక్కెఁ జుక్కగన్. 69

క. కటుక మగువిషము విషధర, కటకం బగుకేలఁ బూని కౌతూహలియై
ఘుటికాసంసిద్ధుఁడు రస, ఘుటికయునుంబోలె మృడుఁడు గుటుకున మ్రింగెన్. 70

తే. కంఠికానిలరత్నంబుకరణి నొప్పె, లలితమృగనాభిపంకంబుచెలువు దాల్చెఁ
గాలకూటవిషంబు తత్కంఠమునను, నాభరణ మయ్యె బ్రహ్మాదు లభినుతింప.

వ. అప్పు డప్పరమేశ్వరు నిట్లని స్తుతియించిరి. 72

సీ. జయ విరూపాక్ష ! యీశ్వర ! దివ్యలోచన ! జయ వజ్రహస్త ! దిశానివాస!
జయ పినాకేష్వాస ! శాశ్వత ! నిత్య ! యనిత్య ! నిత్యానిత్య ! నిరుపమాన !
జయ చింత్య!జయరుద్ర!జయమహాదేవ!యచింత్య! చింత్యాచింత్య!చిత్స్వరూప
జయ పాదభక్తార్తిసంహారకారణ ! జయ ముకుందప్రియ ! జయ గిరీశ !
తే. దివసమాసార్ధమాససద్విశ్వరూప !, కల్పయుగ వత్సరాధీనకాలఖేచ
రుండ! బహురూప! చండీశ! దండపాణీ!, జయ నమస్తే నమస్తే ప్రసన్నమూర్తి!
వ. అని యనేక ప్రకారంబులం బ్రస్తుతించి నీలకంఠుం డను నామధేయంబు శివుని
కిచ్చి రిది కాలకూటోత్పత్తిప్రకారంబు. 74

ఉ. హాలహలాగ్ని దాహభయ మస్తమితం బయినం గడంకమై
వేలుపులు న్నిశాచరులు వెండియుఁ గవ్వపుఁగొండ వార్ధిలోఁ
దేలిచి గుమ్ముగమ్మనఁగఁ ద్రిప్పఁగఁ జొచ్చిరి దానవేశ్వరుల్
వాలిసహాయుఁ గాఁ గొని యవక్రభుజాబలవిక్రమంబునన్. 75

క. తరిగొండఁ దరువఁదరువఁగ , శరనిధిమధ్యమున నొక్కజలజము పుట్టెన్
బరిమళపరంపరల చే, సురభీకృత మయ్యె జగము సురుచిరభంగిన్. 76

వ. అయ్యష్టదళపద్మమునందు. 77

సీ. ఇరుప్రక్కియలనుండి సురసింధురంబులు పరిపూర్ణహేమకుంభములు దాల్ప
నందంద నవనిధానాధిదేవతలును సొరిది బంగారువీచోపు లిడఁగ
జయజయధ్వనులతో సర్వదేవతలును గేలుఁదమ్ములు మౌళిఁ గీలుకొల్పఁ
బుష్పవర్షములకుఁ బ్రోది యై వినువీథి దేవదుందుభినాద మావహిల్లఁ
తే. బ్రబలి మున్నిటినడునీటఁ బాండువికచ, కమలకాంచనకర్ణికాగ్రంబునందు
బ్రహ్మాదిక్పాలవందితపాదపద్మ, పద్మ యుదయించెఁ గన్నులపండువగుచు. 78

తే. పవడములఁ బోలు శ్రీహస్తపల్లవములు, దనర శోభిల్లు హేమపద్మము ధరించి
కలిమిచూపులపూఁబోఁడి కలశజలధి, నర్థిఁ గొలు వుండె రత్నసింహాసనమున.

క. జలరుహవాసిని పుట్టిన, కలితముహూర్తమున రెండుగడియలమాత్రం
జలిగురికాఁడై నిగనిగ, కలుగల చెలికాఁడు పుట్టెఁ గలశపయోధిన్. 80

వ. తదనంతరంబ. 81

క. అందంద యుద్భవించెను, సుందరమున నిందిరానుసంజాతములై
మందారకల్పతరుహరి, చందనసంతానపారిజాతాదు లొగిన్. 82

ఉ. అంతఁ బయోనిధానమునయం దుదయించె సరోజవాసినీ
కాంతకుఁ దోడఁబుట్టు వనఁగాఁ గరపద్మమునం జలూకికా

సంతతియుఁ హరీతకియు సాధనసంగ్రహమై తలిర్ప ధ
న్వంతరి యెట్టిరోగములవారి కనామయసౌఖ్యకారియై. 83
తే. ఆదివైద్యుఁ డతండు దుగ్ధాబ్ధిఁ బుట్టె, నమృతపూర్ణకుంభం బొకహస్తమునను
నంబుచరమునుగరకకాయయును నొకటఁ,దాల్చి సాకారమైనశాంతమయనంగ.
వ. మఱియును. 85
క. అచ్చపువెన్నెలచాయల, మెచ్చనితనుదీప్తితోడ మేఘధ్వనిపెం
పచ్చుపడఁగ సకిలించుచు, నుచ్చైశ్శ్రవ ముదధినడుమ నుదయంబయ్యెన్. 86
తే. క్షీరవారాశిలో నవతారమయ్యెఁ,దార యనుకన్యకయు నతిధవళనయన
తారకారాజబింబావదాతవదన, తారహారాదిభూషణోత్కరముతోడ. 87
శా. అయ్యంభోనిధివారిగర్భమునయం దైరావణం బుద్భవం
బయ్యెం గండతలంబునన్ దొరఁగుదానాంభఃప్రవాహంబు లెం
దొయ్యెయ్యన్ బ్రభవించి తజ్జలధినీ రుబ్బింప దిక్సంధుల
న్వియ్యం బందఁ గఠోరగర్జితమహానిర్ఘాతనిర్ఘోషముల్. 88
సీ. మధుకరంబులు పుట్టె మధుకరంబులు గావు రమణీయవేణీభరములు గాని
శశిబింబములు పుట్టె శశిబింబములు గావు మహితవక్త్రేందుబింబములు గాని
మెఱుఁగుఁదీఁగలు పుట్టె మెఱుఁగుఁదీఁగలు గావు లలితకోమలతనూలతలు గాని
చక్రవాకులు పుట్టెఁ జక్రవాకులు గావు కఠినంబు లగుచన్నుఁగవలు గాని
తే. యనఁగ మందరకందరవ్యాప్తిచలిత, వార్ధికల్లోలవీచికావర్తతతుల
నుద్భవిల్లిరి రంభాతిలోత్తమాదు, లప్సరస్స్త్రీలు దేవవేశ్యాజనములు. 89
క. తరిగొండఁ దరువఁదరువం, దిరుగుడువడునుదధిలోనఁ దీవ్రముగా ది
ద్దిరఁ దిరుగుచుఁ దరఁగలవడి, దరతరమ సుపర్వసురభి దరికిం జేరెన్. 90
ఉ. అంత న్విద్రుమవల్లరీకిసలయవ్యాప్తైకశంకావహా
త్యంతస్వచ్ఛరుచిచ్ఛటల్ జలధిపై నందంద వర్తింపఁగా
స్వాంతాశాంతరభూమిభాగమున విశ్వంబుం బ్రకాశింపఁగాఁ
జింతారత్నశలాక పుట్టెను మహాక్షీరాబ్ధిమధ్యంబునన్. 91
తే. తరువఁ దరువంగ వార్ధిమధ్యంబునందు, నాగవల్లీలతాప్రతానంబు పుట్టె
నమృతసంసర్గమునఁ గదా యాకు నెలలు, జరగు నేయాకునకు లేనిసరసవృత్తి.
క. శీతలపరిమళధారా, పాతపవిత్రాయమానపవమానం బై
యాతోయధిమధ్యంబున, శ్రీతులసీవనము పుట్టె శ్రీయంశమునన్. 93
తే. కలిగె దివ్యౌషధీలతావలులశక్తిఁ, బాలమున్నీటినీటిలోఁ బ్రథితలీల
విమలగారుడమాణిక్యవిభ్రమంబు, లభినవంబులు హరితదూర్వాంకురములు. 94
వ. ఇట్లు మహార్ణవజాతంబు లగుపదార్థంబులం గనుంగొని బ్రహ్మాదిదేవతలు హరునకు

1. మయూఁడనఁగ.

శశాంకుని హరికి లక్ష్మి నింద్రునకు నైరావణోచ్చైశ్శ్రవంబులను నిచ్చిరి. అప్సరసలనాకంబున నుండ నియమించిరి. కామధేనువును వరుణున కొప్పనంబు సేసిరి. కల్పతరుచింతామణుల నందనోద్యానంబునం బ్రతిష్ఠించిరి. దూర్వాంకురంబులు హేరంబున కవతంసంబుగా నొసంగిరి. నాగవల్లీదళంబులు భోగార్థంబుగా భూజనంబులకిడిరి. శ్రీతులసికావనంబులును సకల తీర్థంబులకు సమాశ్రయంబుఁ గావించిరి; యనంతరంబ మందరంబును యథాస్థానంబునం బెట్టి వాసుకిం బాతాళంబున కనిచి కమఠపతిం గుస్తరించి నివాసంబులకుం బోవ నుద్యోగించి యున్నంత. 95

ఉ. అంధకకాలకేయమహిషాదులు దైత్యులు బాహుశైలద
ర్పాంధులు గూడి యొక్క మొగ మై వడిఁదొమ్మి యొనర్చి వైద్యు ని
ర్బంధము సేసి కైకొనిరి గ్రక్కునఁ దన్మహనీయదక్షిణ
స్కంధముమీఁద నున్నమణిక మ్ర సుధారసహేమకుంభమున్. 96

తే. అమృతకుంభంబుఁ గైకొనియసురవరులు, వేఱ యొకచోట వేలంబు విడిసియుండి
రమరులకు నీక యప్పదార్థముఁ గడంగి, తార విభజించి భుజియించువారుఁబోలె.

వ. అవ్విధం బెఱింగి హరవిరించులు విష్ణు రావించి గోత్రకలహంబు మాన్ప నిఖిల మాయోపాయవిద్యావిదుండ వగు నీవ యొఱుంగుదు మాకు నింకిక్కడ నుండం బనిలేదు పోయి వచ్చెద మని యామంత్రణంబు సేసి నిజస్థానంబుల కరిగిన యనంతరంబ. 98

తే. కైటభారాతి యకార్యగతికిఁ దగిన, యనువు చింతించి యసురుల నవమతింప సురుల కమృతంబునొప్పింప వెరవు దెలిసి, యరిగెనంతర్హితుం డయియద్భుతముగ.

వ. ఇవ్విధంబున హరి యంతర్ధానంబు చేసినముహూర్తమాత్రంబున. 100

శా. ఆకాశంబుననుండి డిగ్గె నొకనీరాంభోజపత్రాక్షి ది
వ్యాకారంబును దివ్యమాల్యములు దివ్యాలంకృతు ల్దివ్యవ
స్త్రాకల్పంబులు దివ్యగంధములు నాహా పుట్టఁ జేయంగ నా
కౌకశ్శ్రేణికి దైత్యపఙ్క్తికిని విద్యుల్లేఖచందంబునన్. 101

క. బృందారకపథమున దిగి, యిందీవరపత్రనేత్ర యిరువంకలవా
రుం దమక తమక యిటు రా, యిం దనఁగా రెండువీళ్ల యెడమున విడిసెన్.

వ. నిలిచి హావభావవిలాసంబులన దేవాసురులం భ్రమియింపం జేయుచు స్కంధావార మధ్యంబున. 103

సీ. పాకశాసనునకుఁ బరిహాసవచనంబుఁ గాలకేయునకు శృంగారలీల
వైవస్వతునకు భ్రూవిల్లరీనటనంబు కరటిదానవునకుఁ గలికిచూపు
పాశపాణికిఁ గుచప్రాంతోరుదర్శనం బంధకాసురునకు నలఁతినగవు

ధనదాయకునకు నుత్కంఠావిశేషంబు మహిషునకును నర్మమర్మకలన
తే. గంధవహునకు సిగ్గు జలంధరునకుఁ, గలికితనము పావకునకుఁ గౌను బలికి
వలపు నటియించుచును వారవార తనకుఁ, దాన వారికి వారికి నైనయట్లు. 104
తే. అందఱను భ్రమపెట్టుచు నవ్వధూటి, యెవ్వరికిఁ దాను భ్రమయక యెడనయుండె
దానిపై వాలి చొక్కి నందఱమనములు, గంధఫలిమీఁద వాలుభృంగములపగిది.
తే. అసురులకు దేవతలకు నయ్యవసరమునఁ, బాలువోకుండె నప్పు డప్పద్మనయన
యుభయవాదులు గూడి యయ్యుత్పలాక్షి, పాదపంకజములకును బట్టులైరి.
వ. మఱియు విష్ణుమాయావిశేషంబున. 107
క. ఇది చెప్పినట్ల చేయుదు, మిది పంచినయట్ల నడతు మిది కళ్యాణా
భ్యుదయవిధానము మాకని, హృదయంబులఁ దలఁచుచుండి రిరుదెసవారల్.
తే. కనకసింహాసనము పెట్టి కాళ్లు గడిగి, పాదతీర్థంబు లొగిఁ ద్రావి ప్రణతి సేసి
కొలిచి కూర్చుండి రిరువంక కొలమువారు, భువనమోహిని యైనయప్పువ్వుఁబోఁడి.
క. ఎవ్వనివంకఁ గనుంగొను, నవ్వనితామణివిలోచనాంచలమున వాఁ
డవ్వేళన కీలించు, న్నవ్వం బగు కేలుదోయి మకుటాగ్రమునన్. 110
వ. వైరానుబంధంబు లుడిగి యియ్యిరువాగువారుం దమలోన నిట్లనిరి. 111
క. మన మొండొరు నమ్మక యెడ, ననిచిన యీయమృత మింతయును దగ నింకే
మని యొండుగాఁ దలఁప కీ, వనితామణి పంచిపెట్టవలయుం జుండీ. 112
వ. అని యమృతకలశంబుఁ దెచ్చి యప్పయోజాక్షిచేతి కిచ్చి ధర్మంబు పుణ్యంబు
పాపంబు నీయది యిరుదెఱంగులవారు నీకు నొక్కరూప యిప్పదార్థంబు
మాకుం బంచిపెట్టుము.
తే. తప్పకుండఁగఁ బక్షపాతంబు లేక, పంచిపెట్టెదువా రబ్బరంచుఁ గాక
యన్నదమ్ముల మై యుండి యకట మేము, నిన్ను వడ్డించు మందుమె యన్నమిన్న.
తే. అనిన నే నేర్తు నయ్య మీయంతవారు, కోరి కూర్చుండ నమృతంబుఁ గుడువఁ బెట్టఁ
బంచి వడ్డింప నేర్చు టల్పంపుఁబనియె, తొల్లి యొకనాఁ డెఱింగినత్రోవ గాదు.
వ. అయిన మీవచనంబులు చెఱపంజాల నానేర్చినవిధంబున సుధారసంబు వడ్డిం
చెద మీరందఱుఁ గృతస్నానులై పయోధిపులినవేదికాస్థలంబున నిరుదెఱంగుల
వారు రెండు బంతులుగాఁ గూర్చుండుఁ డని నియోగించిన. 116
ఆ. వార లట్లచేసి వరుసగాఁ గూర్చుండి, పసిఁడిపళ్లెరములు పన్నికొనఁగ
నల్ల నల్ల వచ్చె నలసయానంబున, నమృతకుంభహస్త యగుచుఁ దరుణి. 117
మ. అరవిందాసన పట్టుఁబుట్టము చెఱంగాందోళనం బొంద ని

ర్భరపీన స్తనభార మల్లఁ గదలన్ రత్నాలతాటంకముల్
మొరయ న్నూపురమేఖలావలయముల్ మ్రోయంగ పాత్రంబుల
న్సురధేన్వాజ్యము ప్రస్తరింపఁ దొడఁగె న్దూర్వాంకురాగ్రంబునన్. 118

ఉ. స్నానపవిత్రగాత్రులును చందనచర్చితబాహుమధ్యముల్
మానసమాధినిష్ఠులును మత్సరచిత్తులు నై మహాసమా
ధానముతోడ నుత్తరము దక్షిణము న్సముపాశ్రయించి య
ద్దానవులు న్సుపర్వులును దన్నుఁ బ్రియంబుగఁ జూచు చుండఁగన్. 119

ఆ. హోమపూర్ణకుంభ మెత్తి వడ్డింపంగఁ, గడఁగెఁ గాంచనంపుగరిటె ముంచి
శాంతిమంత్రఘోషసంస్కారపరిపూత, వదను లైనయుభయవంశ్యులకును. 120

క. పోయు నిజాలయ మమృతము, తోయజదళనేత్ర సురలతో యింబునకున్
మాయామృతపూరము దై, తేయులకుం బోయు నత్యధికధీప్రౌఢిన్. 121

తే. మధురగోక్షీరధారాసమాన మైన, మంచియమృతంబు వెట్టె వైమానికులకు
మగువ మృగతృష్ణికాంభస్సమాన మైన, కల్లయమృతంబు వడ్డించెఁ గర్బురులకు.

వ. ఇవ్విధంబున నప్పరమాణుమధ్య తథ్యమిథ్యామృతాహారంబు లాసురాసురులకు వెట్టి కామదుగ్ధేనుఘృతధారాభిఘారంబుగావించి పంక్తిమధ్యంబున నిలిచి కంకణఝణఝణత్కారంబు తోరంబుగా నాపోశనంబు వోసి యారగింపుండు ప్రొద్దువోయెననుచు నెలుంగెత్తి మత్తకోకిలకంఠకుహూపంచమస్వరంబునం బల్కిన. 123

తే. మొదలఁ దేనియలుట్టునంభోరుహాక్షి, ముద్దుఁబల్కులు శ్రుతిపుటంబుల భుజించి
పిదపభుజియింపఁదొడఁగిరి త్రిదశవరులు, దైత్యులునుదథ్యమిథ్యాసుధారసములు.

క. కిక్కురు మన కమృతంబుం, గ్రుక్కులువెట్టుదురు సురలు కోణపముఖ్యుల్
తక్కరిసుధారసంబులు, గ్రుక్కులువెట్టుదురు వారిఁ గూడియె తారున్. 125

తే. గ్రుక్కగ్రుక్కకుఁ గడుఁ దేజ మెక్కుచుండె
నమరులకు గ్రుక్కగ్రుక్కకు నడఁగుచుండె
దైత్యులకుఁ దేజ మట్టివిధంబు గాక
రాహుకేతువు లనియెడురాత్రిచరులు. 126

వ. తమయెదిరిపంక్తి నున్నచంద్రార్కులసంగడి న్మెలంగి కూర్చుండిన నాగ్రహరాజు లిద్దఱుం దమలోన నిట్లని విచారించిరి. 127

ఉ. వంచన వేల్పు లెంకి కిటువచ్చి యుపాంతమునందు ముందటం
గంచముఁ బెట్టుకొన్నయది కర్బురయుగ్మము మాఱువెట్ట నే
తెంచుచు నున్నవాఁడు మనదేవర విష్ణుఁడు వెంట నీరి నూ

చించుట మే ల్సుధారసము చిప్పఁడువోయకమున్న శౌరికిన్. 128

తే. అని విచారించి చెప్పనున్నంతలోనఁ, బోసె నిరుగంచములయందుఁ బుడిసెఁడంత
త్రావియును ద్రావకుండఁగ రాహుకేతు, లనుచుఁ జెప్పిరిమురవైరి కర్కవిధులు.

మ. అటు విన్నప్పుడ తత్సుధారసము కంఠాథఃప్రదేశంబు సో
చ్చుట లేకుండఁగ రాహుకేతువుల యత్యుద్రోత్తమాంగంబు లో
క్కట ఖండించెను మాయపుంబడఁతియాకారంబు వీడ్కొక య
క్కటకాలంకృతహస్తచక్రమున శ్రీకాంతుం డవిభ్రాంతుఁడై. 130

క. రాహునకుఁ గేతునకు హరి, బాహాచక్రమున నదరు పాటిల్లుటయున్
హాహానినాదపటుకో, లాహలబహుళంబుగాఁ గలంగిరి దివిజుల్. 131

సీ. వేగ మాయావధూవేషంబు డిగఁద్రావి కైకొనె నిజమూర్తి కైటభారి
హరి తమ్ము వంచించె సరివేళ గా దని దైత్యులు చనిరి పాతాళమునకు
నమృతంబు భుజియించి యమృతకుంభముఁ గొంచు జనిరి వేల్పులు నిజస్థానమునకు
బహువారములయందు బహువస్తువులు గాంచి కలశపాథోరాశి కాను పుడిగె

తే. చుక్కవడి యునిక్కమాని పెల్లుబ్బ నాక, మప్సరఃకామినీతురంగాదికముల
నచ్యుతుఁడులచ్చి నటఁ బెండ్లియాడియరిగె, నాగరిపునెక్కి వైకుంఠనగరమునకు.

క. ఈవార్ధిమథనకథనం, బేవారు పఠించిరేని నెలమియు నాయు
శ్శ్రీవృద్ధులఁ గాంతురు వి, ద్యావత్తయు యశముఁ గల్గు నావారలకున్. 133

శా. శంకాతంకవిహీనవిక్రమకలాసాకల్య విజ్ఞాన! సా
హంకారోరువివేకవిక్రమ! సురాహారాహితస్పర్ధిని
స్సంకాశోజ్జ్వలకీర్తివిభ్రమ! మహీసంకల్పకల్పద్రుమా!
లంకాశంకరశైలమధ్యవసుధాలంకార భవ్యక్రమా! 134

క. శరణాగతధీపంజర! నరకుంజర! దానకర్ణ! నందితవిద్వ
ద్వరవర్ణ! విమలచరిత, స్ఫురితా! యనవరత శంభుపూజానిరతా! 135

ఉపేంద్రవజ్రము. కులప్రదీపా! యలఘుప్రతాపా!
విలాసశక్రా! జితవీరచక్రా!
కలాజయంతా! ఘనకాంతికాంతా!
నిలీనశంకా! నిజనిష్కలంకా! 136

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర వినయవిధేయ శ్రీనాథనామధేయప్రణీతం బయినహరవిలాసం బనుమహాప్రబంధంబునందు

షష్ఠాశ్వాసము.

---

# సప్తమాశ్వాసము



కాళహస్తినాథ
ప్రాకారాంతఃప్రణీతపాతాళగుహా!
శ్రీకాళహస్తిభక్త సు
ధీకల్పితవిభవ! యవచిదేవయతిప్పా! 1

వ. ఆకర్ణింపుము. 2

ఉ. అర్జునుఁ డింద్రకీలగిరియందు రసాలతమాలతాలనీ
పార్జునలోధ్రతిందుకనవామలకీపనసామ్రపాటలీ
సర్జకురంటకాదిగురుచందనచందననింబకేతకీ
భూర్జకపిత్థపూర్ణముఖభూరుహపుణ్యతమాశ్రమంబున్. 3

క. ద్యూతపరాభవమున నగు, చేతోదుఃఖమునఁ దపము చేయఁగఁ దొడఁగెన్
భ్రాతలయనుమతి శత్రు, వ్రాతజయార్థంబు మది దివస్పతి గురిగాన్. 4

మ. ధనురస్త్రంబులు కేలఁ దాల్చి శరధిద్వంద్వంబు నేపార వీఁ
పున బంధించి కిరీటియై కవచియై పూనెం దపశ్చర్య య
ర్జునుఁ డత్యంతగరిష్ఠనిష్ఠ నమరేంద్రుం గూర్చి యయ్యింద్రకీ
లనగాగ్రంబునఁ బ్రత్యనీకవిజయశ్లాఘాభిలాషంబునన్. 5

క. వంచన మనంబులోన నొ, కించుకయును లేక యమ్మహేంద్రముమీఁదన్
బంచానలమధ్యంబునఁ, బాంచాలీవల్లభుఁడు తపం బొనరించెన్. 6

తే. గాండివముతోడనొకయోగదండయష్టి, యస్త్రములతోడఁగొన్నిదర్భాంకురములు
1కలపములతోడఁ బుండరీకంబుతోలు, దాల్చి క్రీడి విరుద్ధపుఁదపము చేసె. 7

శా. శాకాహారుఁడు నిర్జితేంద్రియుఁడు పాషాణాగ్రతల్పుండునై
నాకేశప్రియనందనుండు సలిపె న్నానాప్రకారంబులన్

---

1. కత్తళముతోడ.

వాసం జిత్తము దేహము స్సరియొకా నానాతపశ్చర్యలఁ
వ్యాకీర్ణోరగసింహభల్లుకలులాయాభీలశైలాటవిన్. 8

సీ. పతయాళునిర్ఝరాంభఃప్రవాహంబుల నఘమర్షణస్నాన మాచరించుఁ
గొండగోఁగుంబూలఁ గుండవర్ధనముల నర్చించు శశలాంఛనార్ధమౌళి
స్ఫటికాక్షమాలికాపాణిప్రవాళుఁడై జంభారిమంత్రంబు జపము చేయు
నొంటికాల బుజంబు నూర్ధ్వంబుగాఁ జాఁచి తడవుగా నిలుచుండి తప మొనర్చు
తే. శరభశార్దూలసింహాదిసత్త్వచయము, కెరలి తనమీఁద బిట్టు లంఘించునపుడు
కడిమిఁ జెండాడు భుజదండ గాండివోగ్ర, చండతరశాతనిర్ఘాతకాండవితతి. 9

తే. వీరరసగర్భితం బయ్యు విస్తరిల్లె, శాంతరస మెంతయును సవ్యసాచియందు
మలయశైలనితంబమండలమునందు, సర్పవేష్టితచందనక్ష్మాజమట్లు. 10

వ. ఇవ్విధంబునఁ గపికేతనుండు గాండివజ్యాఘాతరేఖాంకితకళంకాలంకారంబులగుకరంబులు నీవారపాకంబునకును బాంచాలకన్యకాకుచకుంభకుంకుమప్రేక్షణీయం బైనవక్షంబు రుద్రాక్షధారణంబునకును నంగారపర్ణగర్వనిర్భేదనచణహుంకారకారణంబగు కంఠంబు మహేంద్రదేవతామంత్రాక్షరధారణంబునకును ఖాండవదహనవేళావిజృంభితావష్టంభసంరంభం బగుహృదయాంభోరుహంబు ప్రణవోపలంభమునకును గుంభసంభవప్రదిష్టశాఖాశిఖరపక్షిలక్ష్యావలోకనజాగరూకం బగువీక్షణంబులు నాసికాప్రదేశానుసంధానంబునకును యంత్రమత్స్యవిభేదనోపాయసందర్శనప్రభావసంసిద్ధ యగుబుద్ధి వృద్ధోపసేవనమునకును గంగాజలనిగ్రహానుగ్రహోపాదనసమగ్రంబగు మానసోత్సాహం బింద్రియభంగంబునకును నుత్తరదిగ్విజయయాత్రాధురీణంబులగు చరణంబులు తీర్థగమనంబులకును బాల్పడఁజేసి జగజెట్టిబిరుదంబు నెట్టుకొనం జేసి తండ్రిఁ గుఱించి తపంబుఁ జేయుచుండ దినంబులు గడచె వారంబు లరిగెఁ బక్షంబులు సనియె మాసంబులు వోయె ఋతువు లతిక్రమించె సంవత్సరంబు దాఁటె నయ్యవసరంబున. 11

సీ. తెల్లనిగడ్డంబు తెల్లనిమీసము ల్నరసినరోమపాండురశిరంబు
మేధావిబొట్టును మెఱుఁగుజన్నిదములు భూతిలలాటత్రిపుండ్రకంబుఁ
గావిదోవతియును గంటోత్తరీయంబు నిష్టికోలయుఁ జంక నిఱ్ఱితోలుఁ
బంచాంగముష్టియుఁ బాణిఁ బవిత్రంబు [1]నొక్కవ్రేలికి వెండియుంగరంబు
తే. జాలుబొజ్జయుఁ *గుళదబ్బసంచెలయును, [2]జెత్తగొడుగును జక్కఁదాల్చి కుతుకమున

1. నొక జుట్టవ్రేల వెండుంగరంబు, తి. పా. *నునుదబ్బ. 2. నెడమ కేలను నిడుగోల గొడుగుఁ దాల్చి.

దనవసుజ్ఞాతిగా నొక్కతపసివృద్ధు, బ్రాహ్మణుఁడు వచ్చె నొయ్యొయ్యఁ బార్థుకడకు.

వ. వచ్చి యాశీర్వదించి మహాత్మా! నీసంగడంబునం దపంబు చేయవచ్చితి నిచ్చోఁ
గొన్నిదినంబులు క్రూరజంతువులు నన్ను బాధింపకుండ నరసికొని యుండ
వలయు ననిపల్కి యతనిముందటఁ బరిశ్రాంతుఁడుంబోలెఁ జతికిలంబడి
కూర్చుండి. 13

తే. మోఱకునిచందమున నీఱతాఱమాపు, పాండవేయునిపైఁ దార్చి బ్రాహ్మణుండు
పలికె నిప్పచ్చరం బైనభాషణములఁ, బరమనాస్తికభావంబు పరిమళింప. 14

తే. అన్న! యెవ్వరివాఁడ వీయడవిలోనఁ, దపము సేసెదు నీమంత్రతంత్రపదులు
పాకశాసనదేవతాప్రార్థనాను, సూచకము లైనయవి యన్నిచూడ నిపుడు. 15

ఉ. చక్కనివాఁడ వెంతయును జల్లనివాఁడవు భాగ్యరేఖఁ బెం
పెక్కినవాఁడ వీవిపిన మెక్కడ నీసుకుమారతాగుణం
బెక్కడ ఘోరవీరతప మీయెలప్రాయమునందుఁ జేయు నే
యక్కట యెవ్వఁ డైన నకృతాత్ముఁడ వీ వొకరుండు దక్కఁగన్. 16

క. శరచాపధారణంబుకు, బరమమనశ్శాంతి దాంతి పరిపాకంబుకు
బరికింపఁ "జంకదుడ్డును, శరణార్థియు" ననెడునట్టిచందము దోఁచెన్. 17

క. వైరిమదకుంభికుంభవి, దారణదారుణకృపాణధారలు పరిఘా
కారములు కందమూలో, ద్ధారములకుఁ జాలుపడెఁ గదా నీకరముల్. 18

శా. ఈభద్రాకృతి యిమ్మహాభుజయుగం బీదీర్ఘకోదండ మీ
యాభీలత్వ మొకం డొకొండ భువనైకాధ్యక్షతాహేతు వే
లాభం బాత్మఁ దలంచి చేసె దొకొ గోలాంగూలభల్లూకమ
త్తేభాకీర్ణవనాంతరంబునఁ దపం బేకాగ్రభావంబునన్. 19

తే. ఈశ్వరునిఁ గూర్చి చేసెద వేని లెస్స, మాధవునిఁ గూర్చి చేసిన మాకు హితవు
బ్రహ్మఁగూర్చి చేసిన నది పరమతరము, తగునె యిలవజ్రధరుఁగూర్చి తపము సేయ.

తే. ఎవ్వఁ డుపదేశ మొనరించె నింద్రుఁ గూర్చి, తపము సేయుము నీవంచు దయ దలిర్ప
నాతఁ డెఱుఁగఁడు గాక యాయద్రిభేది, గౌతమునియింటఁ జేసినకామగోష్ఠి.

సీ. ఆసహస్రాక్షునియాత్మసంశుద్ధికిఁ బరమసంయమియింటిపంచ సాక్షి
1యానిర్జితేంద్రు బాహావిక్రమమునకు భుజగాంతకునియీకపోక సాక్షి
యాసునాసీరు నహంకారగరిమకు నిషధాచలముమీఁదినెలవు సాక్షి
యాశచీవల్లభు నౌచిత్యకలనకుఁ దాపసుచేతిపూదండ సాక్షి

తే. యిట్టిదేవేంద్రువలన నీ వేమి ఫలము, 2వడసెదవు చాలు నీవాంఛ పాడుగాను

---

1. యానిర్జరేంద్రు. 2. చేసి పడసెద వేమి వాంఛితఫలంబు.

వాఁడు నీకంటె నేమిట వాసి గలఁడు, తగదు చాలింపు మీవిరుద్ధంపుఁదపము.

వ. అని యెంతచెప్పిన నత్యంతధీరోదాత్తుం డగుపాండుపుత్త్రుం డూరక తపంబు చేయుచుండె నట్టి యేకాగ్రభావంబునకుం బ్రియంబంది వృద్ధబ్రాహ్మణవేషంబు మాని వృద్ధశ్రవుండు ప్రత్యక్షుం డై వరంబు వేఁడు మనుటయు. 23

క. గురుభీష్మకర్ణసైంధవ, గురుతనయులతోడఁ గూడఁ గురుపతిబలము
న్బరిమార్చునట్టిసత్త్వముఁ, బురుహూతా యిమ్ము కరుణ పొంపిరివోవన్. 24

వ. అనిన నింద్రుండు సవ్యసాచి కిట్లనియె. 25

తే. భీష్మగురుకర్ణకృపు లనిర్భేద్యబలులు, ద్రౌణిభూరిశ్రవోభగదత్తశల్య
సైంధవులు పేరుగలవారు సమరజయము, శంభుకృప లేక యెబ్భంగి సంభవించు.

వ. పశుపతిఁ గుఱించి తపంబు సేయుము తత్ప్రసాదంబున నీకుం జయం బయ్యెడుఁ బునర్దర్శనంబు గాఁగలయది పోయి వచ్చెద నని యింద్రుం డంతర్ధానంబు చేసె.

తే. తండ్రి చెప్పినమాటలు దప్ప కప్పు, నాదరించి ధనంజయుం డభవుఁ గూర్చి
యింద్రకీలాచలంబుపై నేకనిష్ఠ, ధీరుఁ డొనరించె నతిఘోరవీరతపము. 28

మ. భసితోద్ధూళితనిర్మలావయవుఁడు న్బంచాక్షరీసంతతా
భ్యసనవ్యాప్తిపరాయణుండును శివధ్యానానుసంధాతయున్
మసృణస్నిగ్ధతరక్షుచర్మమయకంథాభద్రపీఠుండు నై
[1]యసమస్థేమఁ గిరీటి పాశుపతదీక్షారంభముం గైకొనెన్. 29

సీ. ప్రథమసంధ్యారాగపరిపాటి మిన్నేటికనకపంకజకోరకములు దెలుపఁ
గందువాఱినమించుగచ్చుటద్దమువోలె విధుమండలము కాంతి వీడుకొనఁగ
దర మైనవేఁబోకఁ దఱిసి వెన్నెలఁ గ్రోలి దివిఁ జకోరములు మత్తిల్లి యాడ
మందరాచలకూటమధ్యభాగమ్మునఁ గృత్తికానక్షత్ర మత్తమిల్ల

తే. మృదులభస్మరజశ్శయ్య మేలుకాంచి, యమలరుద్రాక్షధారణం బాచరించి
యర్జునుఁడు పర్ణశాలికాభ్యంతరమున, హరున కొనరించు నరుణోదయార్చనంబు.

క. కపికేతుఁ డింద్రకీలా, ప్రపాతపతయాళునిర్ఝరస్నాతుం డై
యుపచారవిధుల నన్నిటఁ, దపనోదయవేళ వ్యాళధరుఁ బూజించున్. 31

మ. అవధానంబున బాకశాసనసుతుం డర్ధేందుకోటీరు సం
గవకాలంబునఁ బూజసేయు హిమవాఃకర్పూరకస్తూరికా
ద్రవకాలాగురుగంధసారసురభిద్రవ్యంబులం బూవులన్
లవలీసర్జరసాగురుప్రముఖ నానాధూపధూమంబులన్. 32

1. తి. పా.

శా. పంచబ్రహ్మషడంగబీజసహిత ప్రాసాద పంచాక్షరీ
చంచన్మంత్రపరంపరాపరమనిష్ఠాతత్పరత్వంబునన్
మంచుంగొండయనుంగుఁబెండ్లికొడుకు న్మధ్యాహ్నకాలంబు సే
వించు న్నిర్జరరాజసూనుఁడు మనో[1]వీథీసదాధ్యాసితన్. 33

శా. [2]వైయాఘ్రాజినఖండమధ్యమున సేవన్ బద్ధపద్మాసనుం
డాయింద్రాత్మజుఁ డింద్రకీలశిఖరీంద్రారూఢబిల్వద్రుమ
చ్ఛాయానిర్మలచంద్రకాంతమణి పాషాణప్రదేశంబున
న్సాయంకాలము పూజ సేయు నభవు న్సంధ్యానటుం ధూర్జటిన్. 34

ఉ. అంచితభక్తితో శివుని నర్ధనిశాసమయంబునందు సే
వించు గురూపదేశపదవీపరిశుద్ధసమర్చనావిధిన్
గాంచనకోరకంబులఁ బికప్రసవంబులఁ గొండగోఁగులన్
గాంచనకందరాముఖగృహంబులఁ బార్థుఁడు సంస్కృతార్థుఁడై. 35

వ. ఇట్లు పాశుపతదీక్షాధురంధరుండై కాలకంధరుం గుఱించి తపంబు సేయుచుండఁ గొండొకకాలంబునకు. 36

మ. ఒకనాఁ డింద్రతనూభవుండు గిరికూటోత్సంగభాగంబున
న్వికచానేకలతాతరుప్రతతులన్ దేవార్చనాపుష్పకో
రకము ల్గోయుచు నుండఁ గాఁ వినఁబడెన్ శ్రావ్యంబులై కుక్కుర
ప్రకరోదంచితకంఠనాళకుహలీబౌబౌమహారావముల్. 37

తే. [3]చాయగోసులకంటెఁ గేసరులకంటెఁ, బులులకంటెను బిరుసులై పొగరు మిగిలి
జల్లుకొనివచ్చెఁ బైపైని సారమేయ, యూథములు వేదమయమూర్తు లుద్ధతముగ.

తే. ప్రకటలీలఁ నుదాత్తంపుఘణితిఁ గొన్ని,
క్రమముతో ననుదాత్తస్వరములఁగొన్ని
స్వరితములఁ బ్రచయంబులవరుసఁ గొన్ని,
ఘోషణము సేయఁదొడఁగె నాకుక్కురములు. 39

క. కనకపుశృంఖలలఁ ద్రయీ, శునకంబులఁ బట్టుకొనఁగ సూరెల బ్రమథుల్
తను నిరుచక్కియ లీలా, వనచరులై కొలువఁ గపటవైహారికుఁ డై. 40

సీ. వికటపాటలజటామకుటికాభారంబు కఱుకైనజుంజుఱు సెఱులు గాఁగఁ
జారుసుధాధామశకలావతంసంబు పెడకొప్పుపై నుండుపీఁకె గాఁగ
ఘనలలాటంబునఁ గనుపట్టుకనుచిచ్చు గైరికద్రవతిలకంబు గాఁగఁ
భుజమధ్యమునఁ గ్రాలుభుజగహారంబులు గురిజపూసలగుబ్బసరులుగాఁగ
తే. శంకరుండు కిరాతవేషంబు దాల్చి, యగజ చెంచెత యై తోడ నరుగుదేరఁ

---

1. వీథిన్సదానందుఁడై. 2. ఆయామ్రాజి... సేవాబద్ధ. 3. శరభమృగముల.

బాణి నోంకారదివ్యచాపము ధరించి, వచ్చె విప్పచ్చువరతపోవనముకడకు. 41

వ. అట్టిసమయంబున. 42

చ. జలధరనీలదేహమును జంద్రకళాయుగళీసమానదం
ష్ట్రలు భిదురోపమానముఖసంపుటపోత్రము ఫుల్లమేచకో
త్పలదలవర్ణకర్ణములుఁ బాటలవర్తులలోచనంబులుం
గలిగి కఠోరకంఠఘనఘర్ఘరఘట్టనఘోషజన్మమై. 43

ఉ. ముట్టియ నింద్రనీలతటమూలమహీప్రభవంబులైనపె
న్పుట్టలు గ్రుచ్చి వైచుచును భూరుహషండముఁ జాఁపకట్టుగా
మట్టుచు ఘర్ఘరధ్వనుల మాటికిమాటికి దిక్పుటంబులం
ఘట్టన చేయుచు న్స్వేదఁదకన్నుల నిప్పులు వెళ్లఁగ్రాయుచున్. 44

క. పంది వడిఁ బాఱుదెంచెఁ బు,రందరనందననిశాకరధరులనడుమఁ
దందడి గోరిజలతాఁకునఁ, గందుకములువోలె శిలలు గరువాఱంగన్. 45

ఉ. ఏసెఁ బినాకచాపమున నీశుఁడు గాండివకార్ముకంబునన్
వాసవసూతి యాప్రబలవజ్రసమానములైనబాణముల్
రాసెఁ బరస్పరంబును వరాహముప్రక్కలు గాడిపాఱ మూ
కాసురసూకరంబు తిరుగాడె వడి న్శరఘాతవేదనన్. 46

క. అభవార్జున శరపాత, ప్రభవవ్యథఁ దిరిగ నవ్వరాహము కడు సం
క్షుభిత మయి విలయవేళా, నభస్వదుద్భ్రాంతఘనఘనాఘనముక్రియన్. 47

క. దీర్ఘతరహరవరాశుగ, నిర్ఘాతనిపాతజాతనిబిడవ్యథ నం
తర్ఘూర్ణమాన మగుచును, ఘుర్ఘురఘోషంబుతోడఁ గ్రోడము కూలెన్. 48

వ. అప్పుడు కిరాతవేషధారి యగుపురారి యోంకారచాపంబు నేల నిలువంబెట్టి తదీయశిఖరంబున నఱచెయి మోపి యొరగి యొయారంపునిలుకడ నిలిచి వలకేల వాలమ్ము ద్రిప్పుచుఁ గట్టెదుర నున్నజగజెట్టి యగునింద్రునిపట్టిం గనుంగొని ప్రావృషేణ్యపయోవాహగర్జాగంభీరంబైనస్వరంబున నింద్రకీలగిరిగహ్వరంబులు ప్రతిధ్వనియొసఁగ సాటోపంబుగా సగర్వంబుగా సావష్టంభంబుగా ని ట్లనియె. 49

తే. ఎవ్వఁడవురోరి నీవు నాయెదురఁ బాఱు, పంది నేసితి బాహుదర్పంబు మెఱసి
యెఱుఁగవుర యోరి నన్ను నీయింద్రకీల, పర్వతం బేలువనచరసార్వభౌము.

ఉ. ఏనును నాకుటుంబ మగునీతరళాక్షియు వెంట (వేఁట) వెళ్ళి యి
క్కానలభూమిలో బహుమృగంబులఁ జంపుచు వచ్చివచ్చి యే
నీనిశితాస్త్రపాతమున నిక్కిటిఁ జంపుదు నంచు వాక్ప్రతి

జ్ఞానియమంబున స్వానుకజాడఁగఁ గూడఁగ వచ్చుచుండఁగన్. 51

క. ¹ఏటలవి నేసి చెంచెత, యోటమిపెట్టం గడంగి యున్నట్టియెడన్
²గాఱెలుకున గొఱఁ తిడి యిట, జీటంబున వేడ్కయెల్లఁ జెఱచితి కదరా.

తే. తపసి వై యుండి తగు రోరి ధనువుఁ బట్టి, శాంతిపరులకు నేలరా సత్వహింస
కపటధార్మిక! యత్యంతకల్మషాత్మ!, యెవ్వఁడవు రోరి నాపంది నేయ నీవు.

క. మండెడుబలునారసమున, గుండియ పగులంగ నేసి కూల్చితి దీనిన్
వెండి ప్రయోజన మేదీ, రండాసుత! దీనిపై శరము నిగుడింపన్. 54

చ. తబిసివి గానఁ జావునకుఁ దప్పితి నీ కిది వేఁటపంతమా
³యబలుఁడ నీ తెఱంగునఁ బరాటవికాయుతచాపవల్లరీ
నిబిడశరాహతం బగువనేచరజంతువు నేసి తీగతిన్
సబముపయి న్నిగుడ్చననిశాతశిలీముఖ మెట్టివెట్టిదో. 55

వ. అనినం గిరీటి యయ్యాటవికచక్రవర్తి కిట్లనియె. 56

క. పైవచ్చుక్రూరజంతువుఁ, జేవెరవున నేయు టెందుసిగ్గే చెప్పుమా
యీవక్రభాషణంబులు, నీ వాడెదు శబర పొమ్ము నీచనుత్రోవన్. 57

క. పంది నపేక్షించితివో, పందెము గెలువంగ వేడ్క పడియెద వేదో
కందువుగా శాఫలము పు, ళిందాధిప యేమిటికిఁ బలికె దీభంగిన్. 58

మ. తడవే లోరి పుళిందరాజ! చను మధ్యాహ్నంబు డాయంగ న
య్యెడు నీవేళ శివార్చనంబునకు మా కేకాంతమై యుండఁగాఁ
బడు నీవుం గడు డస్సినాఁడ వటవీపంక్తిప్రచారంబులన్
విడు కోపం బిదె శాంతి గైకొనుము వాగ్వివాద మిం తేటికిన్. 59

క. జోటియు నీవును గుర్కుర, కోటియు ననుచరులు డప్పిగొన్నారు మహా
ధాటిపరిశ్రమమున ని, చ్చోట వసించెదర యేని సుఖ ముండఁ దగున్. 60

వ. అని యర్జునుండు పల్కిన నాగజ్జులాఁడు మోఱకంబున మొగ మడ్డంబు గదల్చి
యీ యెడ్డిమాటలం బనిలే దీపంది యొక్క ప్రయోజనంబె వేఁటపంతంబు దప్పి
మము నధిక్షేపించితి వీతప్పునకుఁ దపసివి గాన నిన్ను శిక్షింపను పొమ్మది
యునుం గాక. 61

ఆ. తాటియంతవిల్లు ధరియించినాఁడవు, జ్యాకిణాంకితము భుజాయుగంబు
గర్వరేఖ మిగులఁ గానంగ నయ్యెడు, దాంభికంబు నీదుతబిసితనము. 62

శా. ఏమో నాహృదయంబు నిన్నుఁ గని యిట్లే చాపమం దాసమై
భామాసన్నిధి నుబ్బుచున్నయది నీబాహాప్రతాపంబు ని
స్సీమం బే నొకకొంతసే పిచట నుజ్జృంభించరాఁ జేయుమా

1. వేఁటనలసి యీచెంచెత. 2. గాఱెలుకుగోఱివింటన్. 3. యబుబరవుం దెఱంగునఁ బరాటవికాయతచాప. 'యబసరవుం' పాఠాం.

నామీఁద న్నిగుడింపుమా నిశితనానాక్రూరనారాచముల్. 63

క. చెంచని నన్నుం జూడకు, వంచింపకు హీనజాతివాఁ డని సంగ్రా
మాంచలమున నిదె నను మె, చ్చించెదవే నపుడు నిన్ను సేబాసందున్. 64

మ. శివలింగార్చన మెందువోయెడుఁ దపస్విత్వమ్ము నెందే నుప
ద్రవముం బొందదులే యొకింతవడిలో ధ్యానానుసంధానముల్
వ్యవధానం బొకయింత సైఁచవొకొ బాహావిక్రమశ్రీమహో
త్సవముం జూపుదుగాక నాయెదుర నాశ్చర్యం బవార్యంబుగన్. 65

తే. ప్రదర మరివోయు మేయుము ప్రాక్పృికార, కౌతుకాధీనహృదయుండఁగాను నేను
శౌర కులపత్ని యైనయీనీరజాక్షి, యాసపడుచుండు ఘోరవీరాహవములు.

వ. అని పల్కి యాక్రీడాకిరాతుండు గుణధ్వని చేసిన జలధరధ్వానగంభీరంబై
యేతెంచునాహ్వానము సిళ్ళ చూపినఁ గోపించుగంధద్విపంబుంబోలె రోషించి
యర్జునుండు గాండీవగుణగర్జాడంబరంబున నంబరంబు పిక్కటిల్ల నాటక్కరి
విలుకానిపై భల్లంబులు నిగుడించె. 67

శా. గాండీవప్రవిముక్తనిష్ఠురమహాకాండప్రకాండంబులన్
ఖండించె న్బ్రతిబాణఘట్టనమునం గందర్పవిద్వేషి యా
తం డాశ్చర్యము నొంది బాపురె! పుళిందశ్రేష్ఠ! యంచు న్భుజా
దండాహంకృతి వెండియుం బఱపె శాతక్రూరనారాచముల్. 68

శా. ప్రారంభం బొకయింత లేకను దృణప్రాయంబున ట్లొందగాఁ
గ్రూరాజిం దెగనేసెనో నఱికెనో క్రొవ్వాఁడిఅంపంబుచే
నీరీతిం దునుమాడవచ్చునె యనన్ హేలాగతిం ద్రుంచె దు
ర్వారాహంకృతి నీశ్వరుండు విజయాస్త్రవ్రాతమున్ వ్రేల్మిడిన్. 69

క. శితికంఠుఁ డేయుశరములు, ప్రతిహతములు సేయు నరుఁడు పార్థునిశరముల్
శితికంఠుఁ డేయుశరములఁ, బ్రతిహతములు సేయు బహుళబాహాప్రౌఢిన్. 70

క. క్రూరతరహరనరాశుగ, నారాచశిలీముఖాదినానాస్త్రఘటా
నీరంధ్రమైననభమునఁ, గారుకొనియె గాఢ మంధకారము దిశలన్. 71

క. ఓంకారగాండివజ్యా, టంకారంబులు నభఃకటాహము నిండెన్
శంకరకపికేతుభుజా, హంకారనిరంకుశాహవాంగణభూమిన్. 72

వ. ఇట్లోహరిసాహరి నల్లాడుహరార్జునులయందు. 73

క. శరధులు యుగాంతవేళా, శరధులునుం బోలె నయ్యె శరశూన్యంబుల్
సురపతిసూతికిఁ బరమే, శ్వరమాయాశక్తి నపుడు సమరాగ్రమునన్. 74

మ. తెలివిం బొందక యుండె నెమ్మనమునం దివ్యాస్త్రమంత్రాక్షరం
బులు శారద్వతకుంభసంభవులసంబోధంబు సర్వంబు ని
ష్ఫల మయ్యెన్ వృథ యయ్యె నాంతరకృపాభ్యాసంబు గాండీవికిన్
గలహంక్షోణిఁ బినాకపాణిపహనాకౌటిల్యశిల్పంబునన్. 75

క. నిటలవిలోచనమాయా, ఘటనమునఁ గిరీటి తనప్రగల్భత చెడినన్
గుటిలముగ బొమలుముడిచెను, గటకటఁబడఁ దొడఁగెనపుడు కరము సెమర్చెన్.

శా. కాండక్షీణత నాయిషుచ్ఛటలకుం గల్గెంగదే నాథనః
పాండిత్యం బెటువోయె నొక్కొ యని చెప్పం జిట్టలొఁ గాక యీ
తం డీలాగునఁ బోవువాఁడె మయిమైఁ దా నంచు గర్వోద్ధతిన్
గాండీవంబునఁ బూన్చి వేయఁ దొడఁగె న్గాండీవి గంగాధరున్. 77

క. మృదు వెన్నఁడు శరములఁ గ, వ్వడి బొదువం దొడఁగె గాండివంబున నపుడే
యుడుగక పొడ మెడుభయమున, వడఁకులగుబ్బలికుమారి వడవడ వడఁకెన్.

సీ. కఱకువెండ్రుకలలోఁ బఱచుమందాకిని సుకుమారదేహంబు స్రుక్కఁబాఱె
నవతంసకుసుమమాల్యం బైనశశిరేఖ బ్రహ్మకపాలరంధ్రమునఁ దూఱె
నెట్టయంబుగ బిగ్గఁజుట్టినపెనుబాము బిగియూడి నొసలిపై డిగఁగ జాఱె
నలికనేత్రముకిత్తి యారజ్యమానమై తెప్పలసందుల నిప్పు లుమిసె
తే. నగజ భయమందెఁ బ్రమథులు బెగడుగుడిచి, రుపనిషత్తులుఘోషించె నొక్కపెట్టఁ
గాలకంఠునిమౌళిశృంగాటకంబు, గాండివంబునఁ దాడింప పాండవుండు. 79

తే. పాండునందనఘనభుజాదండకలిత, చండగాండీవతాడితఖండపరశు
పృథుజటామండలంబునఁ బిండుగట్టి, తాండవం బాడె మున్నెటితరఁగదండు.

తే. వింటఁ గొని వ్రేయ వ్రేయంగ విసుగు పుట్టెఁ, జెట్టిబిరుదింతె పొమ్మని పట్టి యణఁచె
సురతనూభవునిం బట్టి శూలపాణి, మల్లసంగ్రామకేళిసంభావనముల. 81

క. కపికేతువృషభకేతను, లుపజాతనియుద్ధకౌతుకోత్సాహమునన్
నిపుణతఁ బెనఁగంగఁ దొడఁగి, రుపతాయిన్ [1]గతివిశేష ముపలాస్యముగన్.

తే. తోరహత్తంబునందుఁ బార్థుండు గడిమి, సలిపె నూరులఁ బీడించె సరభసమున
హరుఁడు సీసాన హత్తించి యర్జునునకు, బరువు గావించె నిశ్వాసపవనమునకు.

క. ముక్కంటి కంఠమూలము, డొక్కరమున నితికె బార్థుఁడు ప్రబంధుండై
చక్కని ప్రకోష్ఠపీడన, మిక్కిలికనువేఁకి నుతికె మిసుమిసుకుమనన్. 84

క. తాఁచుచుఁ బొడుచుచుఁబడుచును, నేఁచుచు నుడుకుచును బిట్టు నెగయుచుగూలం
ద్రోఁచుచుఁ దూలుచుఁ బెనఁగిరి, ప్రాచీపతిసుతుఁడు హరుఁడు బాహాబాహిన్.

1. వేషభాష లుప.

శా. నిష్టంకించి శశాంకశేఖరుఁడు గాండీవాయుధుండు న్భుజా
వష్టంభంబులు సిద్ధచారణులుఁ గైవారంబు గావింపఁగా
దిష్టాంతాంతకఘోరమూర్తు లయి సాదృశ్యం బదృశ్యంబుగా
ముష్టాముష్టి రణంబు చేసిరి యసన్మోహప్రకారంబులన్. 86

క. చెమరుచుట యాడు గఱచుట, బొమ ముడుచుట నిర్వికారమును మును సపరి
శ్రమమును సరిసరిఁ బెనఁగిరి, సమవిషమనియుద్ధకేలి శంభుఁడు నరుఁడున్. 87

క. తాటించెఁ బేరణము నా, స్ఫోటించెఁ గిరీటివక్షము వృషాంకుఁ డతం
డాలోపమఱక పిడికిటి, పోటున ధూర్జటియురంబుఁ బొడిచెం గడిమిన్. 88

శా. అంతం జంద్రకళాధరుండు నిజబాహాగాఢపీడాపరి
శ్రాంతుండై యటఁ బాండుసూతియెదురం బ్రత్యక్షమయ్యెం గృపా
వంతుండై యహిరాజహారములతో స్వర్వాహినీ వేణితో
దంతిత్వక్పరిధానపల్లవముతోఁ దామ్రజటాపంక్తితోన్. 89

ఉ. చెంచెత యయ్యెఁ బార్వతియుఁ జెంచులు భూతములై నిజాకృతి
న్మించిరి వేలుపు ల్నభముమీఁద లలాటమునందు నంజలు
ల్నించి నమస్కరించిరి వినీతియు భక్తియు నుల్లసిల్లఁ గా
వించెఁ బ్రణామము ల్గరము విస్మయ మందుచుఁ బార్థుఁ డత్తఱిన్. 90

తే. వేదముల్నాల్గు నుపనిషద్విద్యఁగూడి, ప్రణవమంత్రాక్షరములతోఁ బ్రస్ఫుటముగ
విశ్వకర్తృత్వ మెయ్యెయ్యవీడుకొనుచు, నభినుతింపంగఁ దొడఁగెఁ జంద్రార్ధమౌళి.

వ. అప్పుడు పార్థుఁడు కృతార్థుఁడై రోమాంచితకంచుకితాఖిలాంగుండై యానంద
బాష్పలోచనుండై కేలుదోయి ఫాలభాగంబునం గీలుకొల్పి యిట్లని స్తుతించె.

విద్ధాళి (సార్వవిభక్తిక స్తవము.)

క. నీవ పరబ్రహ్మంబవు, నీ వఖిలాండాండపతివి నీవు ప్రసన్న
శ్రీవిభవారోగ్యాయుః, ప్రావీణ్యప్రాభవైకఫలదుఁడవు శివా! 93

క. నిన్నుఁ ద్రిజగన్నివాసునిఁ, బన్నగకంకణుని భక్తపరతంత్రుని న
భ్యున్నతకరుణాగుణసం, పన్నుని గనుగొంటి మంటి బాలేందుధరా! 94

క. నీచేతఁ గృపానిధిచే, వాచాగోచరవివేక వైయాత్మునిచే
నోచంద్రకలాశేఖర!, యాచించి మనోరథార్థ మర్థిం గందున్. 95

శా. నీకై యేను దపంబు చేసితి మహానిష్ఠాగరిష్ఠస్థితి
న్నీకై సంస్తుతి సేయుదుం గడఁగి నానేర్పొప్పఁగా నెంతయు
న్నీకై పూజ యొనర్తుఁ గొంత విరుల న్నిత్యంబు సద్భక్తితో
నీకై సేవ యహర్నిశం బొనరుతు న్వేదండచర్మాంబరా! 96

తే. సాటి యెవ్వరు నీకు నిశాటభూష!, కైటభారాతిహాటకగర్భవంద్య!
ఘనజటాజూటవాటికాఘటితవికట, గగనగంగాస్రవంతిక! కరటివైరి! 97

క. నీయందు జగము లుండుం, బాయక యాజగములందుఁ బాయక నీ వుం
దీయనువు దెలియ నజునకుఁ, దోయజనేత్రునకు నైనఁ దోఁపదు శర్వా! 98

మ. జయ సర్వేశ్వర! సర్వలోకజనకా! చంద్రార్ధచూడామణీ!
జయ కామాంతక! కామితార్థఫలదా! చక్షుశ్శ్రవఃకుండలా
జయ సంపూర్ణకృపాగుణైకవసతీ! శైలేంద్రజావల్లభా!
జయ దక్షాధ్వరమర్దనా! జయ గిరీశా! యీశ! రక్షింపవే. 99

ఉ. కొండకిరాతుఁ డంచుఁ గయికోక యసంగతభాషణంబు లు
ద్దండత నాడితిన్ గర ముదగ్రత నొంచితి ముష్టిఘట్టనం
గాండివచాపదండమునఁ గ్రచ్చఱ మోదితి మౌళి భోగభృ
త్కుండల! పెక్కుచందముల ద్రోహము చేసితి నేమి సేయుదున్. 100

వ. అని మఱియు మఱియు సాష్టాంగప్రణామంబు లాచరించి నిలిచిన పాండవమధ్యముం జూచి ఖండపరశుండు నీతపంబునకుఁ బాశుపతవ్రతనిష్ఠాగరిష్ఠతకు భుజాశౌర్యంబునకు సంతసిల్లితి నీవరం బేదియో వేఁడు మనుటయు. 101

తే. అభవ! యీ నాకు నీప్సితం బగువరంబు, దయఁ బ్రసాదించి రక్షింపఁదలఁచితేని
రౌద్రమై ఘోరమై లోకరక్షయైన, పాశుపతసంజ్ఞ మగుదివ్యబాణ మిమ్ము.

వ. అనినం బ్రీతచేతస్కుండై శంభుండు శాంభవీహృదయానురాగంబునను బ్రమథపరివారసమక్షంబునను మందస్మితంబు కందళింపఁ గరుణాకటాక్షవీక్షణంబున నప్పాండుకుమారుం జూచి త్రిపురదైతేయసుందరీవదనారవిందవాసరావసానసంధ్యాసమయ సమారంభంబును గరటిదనుజకుంభకూటకూటపాకలజ్వర(శిర)స్తోమంబును జలంధరజలధరవ్యూహజంఝూసమీరంబును నంధకాసురప్రద్యోతనప్రభామండలంబును శార్దూలదానవారణ్యహవ్యవాహంబును 'నగునమ్మహనీయదివ్యాస్త్రంబు ససంప్రయోగంబు సోపసంహారంబు సకీలకంబు సరహస్యంబుగా నుపదేశించె నపుడు సేవాసమాపన్నులగుకిన్నరకింపురుషగరుడగంధర్వవిద్యాధరులు తమతమదివ్యాయుధంబు లిచ్చిరి. పార్వతీదేవి యక్షయబాణతూణీరంబు లొసఁగె. దండధరుండు దండంబును బాశపాణి పాశంబును నింద్రుండు వజ్రంబును సమర్పించి రిట్లు వరప్రదానంబు సేసి యీశానుండు సపరివారుండు సాంబుండునై యంతర్ధానంబు సేసె ననంతరంబ. 103

తే. పరమసంతోషమును బొంది బలవిరోధి, పుత్త్రుఁ గౌఁగిటఁ జేర్చి యాపోనిమూర్ధ్ని
సమ్మదాశ్రుకణంబులు సంప్రఫుల్ల, చక్షురంభోజదళసహస్రమునఁ బొడమ.

వ. ఇట్లనియె. 105

ఉ. భాగ్యముగాదె యశ్రమమ పన్నగకంకణుచేఁ దపఃక్రియా
యోగ్యతఁ జేసి విశ్వభువనోపకృతిప్రతిపాదనైకసౌ
భాగ్యధురంధరం బయినపాశుపతాస్త్రము గాంచి తింక వై
రాగ్యము పుట్టుఁ గాక కురురాజుపయి న్నిజరాజ్యలక్ష్మికిన్. 106

వ. నీవు నారాయణసఖుండ వైనయాదిమునీశ్వరుండవు. నరనారాయణులవలనఁ త్రివిష్టపంబునకుఁ బెక్కుతోయములు రాక్షసబాధలు శాంతిం బొందె నిప్పుడు హిరణ్యపురవాసులు నివాతకవచకాలకేయాదు లగుదైతేయులు రాజ్యలుబ్ధులై నాకంబున కనేకప్రకారంబుల నుపద్రవం బాపాదించుచున్నవారు. వారిం బరిమార్ప నమరావతీపురంబునఁ గొన్నిదినంబులు వ్రతోపవాసప్రయాసఖేదం బపనయించి మధ్యమలోకంబునకుం గ్రమ్మఱ నేతెంచునది. మాతలిసారథికం బగు రథంబు పుత్తెంచెద నిచ్చోటన యుండునది యని తత్కాలసన్నిహితుం డైన రోమహర్షుం డను మునిం జూచి నీవు ద్వైతవనంబునకుఁ బోయి పాండవుల కర్జునుకుశలవార్తయుఁ బాశుపతాస్త్రలాభంబును స్వర్గగమనంబుం జెప్పు మని పల్కి యింద్రుండు నిజస్థానంబున కరిగె. 107

ఆ. విశ్రమించె నొక్కవృక్షంబుక్రీనీడ, నర్జునుండు మణిశిలాంతరమున
ఖండపరశుబాహుదండనిష్పీడన, ముష్టిఘాతఖేదమోక్షమునకు. 108

శా. మాళిం గోహళి సంఘటించినక్రియ న్మధ్యాహ్నవేళ న్మహా
శాళం బైననభోవిభాగమున వీఁకం గాసె బీరెండ యా
ప్రాలేయాహితసంప్రదీప్తకిరణప్రక్రీడదర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీవాచాలకోయష్టియై. 109

వ. అప్పుడు మధ్యాహ్నకాలపూజకు నాయితం బై. 110

సీ. పావననిర్ఘరాంభఃప్రవాహంబున నఘమర్షణస్నాన మాచరించి
కసటువోఁ దెలినీటఁ గడిగి యాటార్చిన సలిలకాషాయవల్కలము గట్టి
యాపాదమస్తకం బఖిలాంగకంబులఁ గమ్మనిభసితంబు గలయ నలఁది
వెడఁదముత్యములతో నెడవెట్టి గ్రుచ్చిన మంచిరుద్రాక్షదామములు దాల్చి

తే. పులికళాసంబుగద్దెపైఁబూని కెమెఱయఁ, బంచకుసుమలుగావించి పాండుసుతుఁడు
షోడశోపచారంబులు సొరిదిఁ దీర్చె, నీలగళునకు మధ్యాహ్నకాలవేళ. 111

వ. ఇట్లు శివలింగార్చనంబు దీర్చి కందమూలఫలోపహారంబులు సమర్పించి తత్ప్రసాదంబునఁ దానును దేహయాత్ర నడపి విశ్రాంతుం డై యున్నసమయంబున

ధవళహాయ సహస్రంబులఁ బూన్చినరథంబు గొనివచ్చి మాతలి తనకుం జూడ
నూపిన సబహుమానంబుగా నాదరించి పురందరాదేశంబున నద్దివ్యస్యందనం
బెక్కి యాకాశమార్గంబునం జనునప్పుడు. 112

సీ. ఇది మేఘమండలం బివి విమానంబులు యక్షవిద్యాధరోపాశ్రయంబు
లిది యాహవస్కంధ మదె తారకావీథి యల్ల తెల్లనిరేఖ యభ్రగంగ
యల్లదె శింశుమారాకారహరిమూర్తి వీఁడె భాస్వంతుఁడు వాఁడె ధ్రువుఁడు
వీరె సప్తర్షులు వారె యశ్విన్యాదు లిరువాడ దేవేరు లిందుభార్య

తే. లల్ల వాఁడెసుధాకరుం డదె గ్రహంబు, లివ్వలాఖ్యంబు లగుచుక్క లివె కెలఁకుల
ననుచు మాతలి చూపంగ నర్జునుండు, కౌతుకం బంది గగనమార్గంబునందు. 113

శా. జంభారాతితనూజుమీఁదఁ బొలిచెన్ సావిత్రవర్త్మంబున
న్సంభిన్నోదరశాతకుంభనలినీనాళీకసంవాసనా
సంభారంబులు పోదు ముట్టఁ సవిధస్వర్లోకకల్లోలినీ
గంభీరాంబుతరంగసంభ్రమములం గల్యాణవాతూలముల్. 114

తే. అర్జునునిమీఁదఁ బొలిచెఁ బథ్యంతరమున, నభ్రగంగానదీతరంగానిలంబు
నందనోద్యానవీథికానవలతాంత, సారభాసురహారినీలహార మగుచు. 115

వ. ఇవ్విధంబున మాతలిసారథికం బైనయారథంబుమీద నక్షత్రమండలం బొఱసి
కొనుచుం జని యర్జునుం డమరావతిం బ్రవేశించి దివ్యాంగనాపాంగ భంగీసమా
లింగితసౌభాగ్యుం డై రాజమార్గంబునం జని దివ్యమందిరంబుఁ బ్రవేశించి సుధ
ర్మాభిధానం బైనయాస్థానమండపంబునఁ గొలువున్న మహేంద్రు నర్ధాసనంబున
నుండె. 116

తే. వీడుపట్టుగ మందారవిపినవీథి, దివ్యసౌధంబునందుఁ బ్రతిష్ఠఁ జేసి
గారవించె జయంతకుమారుకంటెఁ, బాండురాజతనూజు నాఖండలుండు. 117

వ. ఆ నిశాసమయంబున. 118

సీ. పదునాల్గుజాతుల త్రిదశాంగనలయందుఁ బేరఁ బెంపును గలనీరజాక్షి
నీరజనాభునియూరుకాండంబున నుద్భవం బందినయుజ్జ్వలాంగి
యంభోనిధానంబు నాపోశనము గొన్న కలశసంభవుఁ గన్నకంబుకంఠి
వసుధయందుఁ బురూరువశ్చక్రవర్తికిఁ బ్రాణవల్లభ యైన పద్మనయన

తే. కట్టి తోడి పూసి కై సేసి కౌతుకమునఁ, గొసదిగఁగ నీలిపుట్టంబు ముసుఁగు పెట్టి
గాజు లెగఁద్రోసి చప్పుడు గాకయుండ, వచ్చె నూర్వశి యర్జునావాసమునకు.

చ. విమలసుధాంశుకాంతమణివేదిక పై నవహంసతూలత
ల్పమున సుఖప్రసుప్తిపరిపాకము నొంది విశాలనేత్రప

ద్మములు మొగిడ్చి శేషఫణిపైఁ బవళించినయంబుజాక్షు భా
వమునఁ గరంబుఁ బోల్పమరువానిఁ గనుంగొనె నింతి ఫాల్గునిన్. 120

తే. మేల్కొలిపియిందుబింబాస్య మెల్ల మెల్లఁ, బ్రమదనిద్రాపరాధీనుఁ బాండుతనయుఁ
బగడములఁ బోలుతనపాణిపల్లవముల, నతనిమృదుపాదపంకేరుహంబు లొత్తె.

వ. మేల్కాని యర్జునుండు నిర్జరలోకలలామంబైనయబ్బామినీరత్నంబుం గనుంగొని
పాన్పు డిగ్గి యభివాదనంబు సేసి వినయవినమితోత్తమాంగుండై యిట్లనియె.

తే. ఈనడికిరేయి నొంటిమై యింతదూర, మేమికార్యంబు మదిఁ గోరి యేగుదెంచి
తేనురమ్మన్న రానె పూర్ణేందువదన!, చెప్పుమీ పాన్పుమీఁద విచ్చేసియుండు.

ఉ. ఆడఁగఁబోవుతీర్థ మెదురై నవిధంబున నెల్లి యేను రే
పాడియ చంద్రశేఖరు నుపాస్తి యొనర్చి యుపాయనంబుతోఁ
జూడఁగవచ్చువాఁడ నయి చూచుచు నుండఁగ నీవ వచ్చితో
చేడియ! యెట్టిపుణ్యములు చేసినవాఁడనొ ప్రాగ్భవంబునన్. 124

శా. మత్తారాతివిదారణుండు జనసన్మాన్యుండు శీతాంశువం
శోత్తంసంబు పురూరవుండు ప్రచలద్యోగుండు మాతాతగా
రత్తోయాకరమేఖలాపతికి నిల్లాలైతిగా కావునన్
ముత్తో వీ విది లెస్స మన్ననిపయిన్ మోహంబు వాటింపఁగన్. 125

తే. ఆదినారాయణునియూరు వంబుజాక్షి!, భువనవిఖ్యాత మైననీపుట్టినిల్లు
పావనుఁడ నైతి నీ పాదపద్మములకు, వందనముఁ జేసి వరభక్తివైభవమున. 126

వ. అని పెక్కుప్రకారంబుల నిర్వికారుండై పాండుకుమారుండు ప్రియంబు చెప్పిన
నప్పువ్వుఁబోఁడి కప్పలుకు లొప్పులయ్యును నీరుడప్పికి నేయునుం బోలి
యప్పటి కప్రియంబులై యుండె నిచ్ఛావిఘాతంబు నొందియు నమ్మచ్చెకంటి
చేతోభవవికారంబు హరింపం జాలక ధనంజయున కిట్లనియె. 127

తే. ఏల యెన్నోతరంబుల నీడఁ బడ్డ, పెద్దవావులు శోధించి గుద్దలింప
వారకాంతాజనములకు వావి గలదె, మాను మర్జున మొగమోట లేనిమాట. 128

ఉ. వాసవునిండుఁగొల్వునకు వచ్చినయప్పుడు తత్సమంచితా
ర్ధాసన మెక్కియున్ననిను నంగజసన్నిభుఁ జూచి పుష్పబా
ణాసనుపుష్పబాణనివహమ్ములకుం గుఱియైతి నిట్టినా
యాస నిరాకరింపఁ దగవా మగవాఁడవు కావ యర్జునా! 129

తే. ప్రమద మెసలారఁ బాంచాలరాజసుతకు, వలచి చేసితివో సత్యవాక్ప్రతిజ్ఞ
యన్యకాంతలదెసఁబోవ ననుచు నీవు, భామలకుఁ జేయుసత్యంబు పాడిగాదు.

క. నామోహము నావేడుక, నామానము నాప్రియంబు నాతగులము నా
ప్రేమమ్మును నాతెగువయు, క్షామముఁ బొందంగ నూరకయె పోవుదునే. 131

చ. అతులితధైర్యశౌర్యమహిమాద్భుతసాహసులై మహోగ్రతా
ప్రతతనిశాతనిష్కృపకృపాణవిదారితదేహులై రణ
క్షితిఁ బడి వత్తురైదుపదిసేయక నాకయి యిట్టినన్ను నీ
వితరులఁ బోలెఁ గైకొనక యేఁచెద వక్కట పాండునందనా! 132

క. వేసాలఁ బోవు రమ్మా, పూసెజ్జకుఁ బ్రొద్దుపోయెఁ బులియుట చాలుఁగా
వాసవనందన! కుసుమశ, రాసనకేళీకలావిహారంబులకున్. 133

వ. అని పల్కి యంత నిలువక బ్రహ్మచర్యవ్రతదీక్షాపరాయణుండవె నీ వనుచు
నారాయణోరుస్తంభంబున సంభవించిన యయ్యచ్చరలేమ లేమొలకనవ్వు
లపాంగంబునం దొంగలింపఁ గంకణఝుణఝుణత్కారంబు తోరంబుగాఁ
గెంగేలికేళీకమలంబునఁ బరాగరేణుత్రసరేణువిసరంబులతోడం గూడి మక
రందబిందుధారాస్యందంబు చిందఁ బురందరనందనుని వ్రేసె; వ్రేసిన నత్యంత
ధీరోదాత్తుండు గావునఁ జిత్తభవసమ్మోహనాస్త్రవిదారణంబునకుం దార యగు
నవ్వేటున కంతరంబున మిసిమింతుండునుం గాక యేపాకంబునకు రాక రాకా
చంద్రబింబంబువోని నెమ్మోము వాంచి నిర్వికారుండై యూరకుండె నివ్విధం
బున నయ్యూర్వసియు వసిమాలఁ బెనంగి యక్కిరీటి చిక్కని మనంబుపక్కు
గానక కానక కాసినవెన్నెలయుంబోలెఁ దనకన్నులవలపు మిన్నక పొలి
వోయినం జిన్నవోయి నిట్టూర్పులు నిగిడించుచు మనోరథవిఘాతప్రభవంబైన
కోపంబు సైరింపక నరు నుద్దేశించి నపుంసకుండవుఁబోలె నాన గొన్నాఁడ
వేఁడుకాలంబు నపుంసకుండవు గమ్మని శపించి దిగ్గన లేచి మొగంబు గంటు
వెట్టుకొని యింటికిం బోయె. యుధిష్ఠిరానుజుండును వసిష్ఠజననివలన గత
కీర్తితాపన్నుండై యయ్యరిష్టంబునకు సంతాపంబు నొందక యది విధివశం
బుగాఁ దలంచుచుండె; నప్పుడు గగనంబుక్రేవంబడి యస్తమండలుండై హిమ
గభస్తి విరహవేదనాధూయమానమానస యగు మైత్రావరుణజనయిత్రి ఖిన్న
వదనంబునుంబోలె వెలవెలఁ బాఱ విభావరీసమయంబునం ద్రిభాగావశేషం
బగుటయు. 134

సీ. పారిజాతకలతాపల్లవంబులు మేసికొసరె నుద్యానపుంస్కోకిలములు
కంధరాగ్రవేయకనకఘంటిక మ్రోయ వేల్పుటేనిక యుషర్వ్యధికి వెడలె
మందాకినీవీచిమారుతం బల్లార్చె నప్సరస్త్రీలనీలాలకముల
సప్తర్షిపావనాశ్రమవనాంతరమున నామ్నాయఘోష మభ్యధికమయ్యెఁ
తే. బాలవత్సంబుపైఁ గూర్మిఁ [1]బంచితిలుచుఁ, గామధుగ్గవివచ్చుహుంకార మెచ్చె

1. బచ్చడిలుచు.

శుక్రు గడియారమున మించె శంఖరవము, విబుధలోకంబునందలి వేగుఁబోక. 136

తే. మర్త్యలోకంబువారి ప్రమాణసంఖ్యఁ, బాండుసూనుండు గడపెను వజ్రియింట
సగము నిద్రయును సగము జాగరమును, నావిభావరి వేగుఁ బో కాలు నెలలు.

సీ. మాటుగా వైచినమాంజిష్ఠ తెర యెత్తి పంజుమంచము డిగ్గె మంజుఘోష
మొకరిమట్టెలమ్రోఁత ముద్దుచూపఁగ రంభ కనకంపుగొడుగు పాగాలు దొడిగె
నొకట వేనలి మడ్చి యొక్క కేల ఘృతాచి గాజుటెక్కులతల్పు గడియపుచ్చె
నలసభావముతోడ నలవోక ప్రమ్లోచ నిల్వుటద్దంబులో నీడ చూచె

తే. హరిణి గీలించె నలినపట్టాంశుకంబు, మేనక ధరించెఁ బాలిండ్లమీఁద నవిక
యప్సరస్త్రీనికేతనాభ్యంతరములఁ, గొక్కరొక్కో యటంచును గోళ్లుగూసె.

మ. అమరావత్యమృతాశనుల్ప్రథమసంధ్యావేళ వాల్గన్నులం
గమలాప్తుం గని యాచరించిరి నమస్కారంబు క్రిందైనమ
ధ్యమలోకంబున దివ్యదంశువుల నీహారప్రతానంబు భం
గమునొందించుచు మిన్నుఁ బ్రాఁకె నుదయగ్రావప్రదేశంబునన్. 138

సీ. పరమర్షి పావనపాణిపల్లవములు ఫాలభాగములపైఁ బవ్వళింపఁ
బౌలోమి పెంచినబాలకోకద్వయం బలఁతియీరెండకు నఱ్ఱు సాప
గగనకల్లోలినీకనకపద్మములపైఁ దుమ్మెద లెగసి ఝుం ఝుమ్ము రనఁగ
నాకవిద్యాధరీనాట్యశాలలయందుఁ దూర్యత్రయంబులు దురఁగలింపఁ

తే. ప్రమద దిక్కాంత కెంగేలఁ బట్టియాడు, క్రొత్తగురివెందపూసలగుత్తివోలె
దివసకామిని ముఖలక్ష్మి తెలివి నొంద, బూర్వదిశయందుఁ గరకరఁ బ్రొద్దువొడిచె.

వ. అయ్యవసరంబున. 140

శా. కాల్యాచారము లాచరించి కడఁకం గౌరవ్యశార్దూలుఁ డా
జ్వల్యస్ఫూర్జితవస్త్రభూషణవిశేషస్ఫూర్తియై విస్ఫుర
న్మాల్యాలేపనుఁడై విచిత్రబలశుంభద్భవ్యదివ్యాస్త్రసా
ఫల్యప్రౌఢతపోనిరూఢవిభవభ్రాజిష్ణుఁడై యున్నతిన్. 141

క. బలవదరినికరనిర్భర, బలసాదనబాహుదర్పబంధురలీలా
విలసనత యెసఁగ వచ్చెను, బలసూదనుసభకు భక్తిభావం బలరన్. 142

వ. వచ్చి సాష్టాంగం బెఱఁగినఫల్గును నఫల్గువాత్సల్యహేలాసముత్సేకంబున గాఢ
గూహనసంభావితుం జేసి జంభభేది యతని నాత్మీయసింహాసనార్ధంబున నుప
విష్టుం గావించి యిట్లనియె. 143

సీ. బాహాబలాటోపపరిపాటి మెప్పించి పడసితి వీశానుపాశుపతము

సంగ్రహించితివి శస్త్రము లిమ్మడిగాఁగఁ బురవైరికరుణ నిర్జరులవలన
నధికరించితి వస్మదాచార్యకంబునఁ జతురంబు లగుదివ్యసాధనములు
కొఱఁత లేకుండఁ గైకొంటి కుంభజుచేత నైజంబుగాఁ జాపనైపుణంబు
తే. పరశుపట్టిసముద్గరప్రాసముసల, ఖడ్గముఖచిత్రచంక్రమక్రమనిరూఢిఁ
గరము మేదిని సాటి నీ కరయఁ గలరె, శౌర్యమున నుగ్రభుజవీచి సవ్యసాచి. 144
శా. వేరీ నిన్నెదిరింపఁగా జగమున న్వీరుల్ప్రతాపోద్ధతిం
ధౌరంధుర్యమునం బ్రభావమహిమం ధైర్యంబునం జాపలీ
లారంభంబున సాహసిక్యమున బాహాశక్తి దివ్యాయుధో
దార ప్రౌఢిమ దేవదైత్యనరగంధర్వాదిసంఘంబులన్. 145
క. నీ పని సేయ బలాఢ్యుఁడ, వీవిశ్వంబునను నీకు నెదు రెవ్వరు లే
రావంత యైన వదలకు, మేవలనను దేవవిప్రహితకార్యంబుల్. 146
క. ఏపున భుజగర్వోన్నతి, ప్రాపున దీపింప నిట సుపర్వహితార్థం
బో పార్థ! చేయవలయును, నాపనిచినపంపు పెంపున న్శౌర్యనిధీ. 147
చ. అలఘుబలు ల్నివాతకవచాఖ్యులు వీరులు ఘోరదానవు
ల్జలనిధిఁ గొంది నుండుదు రసాధ్యులు నిర్జరసిద్ధసాధ్యకుం
డలినరకిన్నరద్యుచరనాయకకోటికి మూఁడుకోట్లవా
రలవలనం గలంగెడు నిరంతరబాధల ముజ్జగంబులున్. 148
చ. మఱియును నెందఱేని నసమానబలు ల్సురలోకకంటకు
లఱచుగ బాధ చేసెదరు దైత్యు లవధ్యులు నిర్జరాళి కే
డ్తెఱ నెఱయంగ వీర! భవదీయశరార్చులపాలు సేసి యం
దఱ నుఱుమాడి యెంతయు హితం బొనరింపుము మాకు నర్జునా! 149
వ. అని సునాసీరుండు సమారాధనంబున. 150
క. తనతొడినభూషణంబులు, తనదుకిరీటము నభేద్యతరకవచంబుం
దనసుతున కొసఁగ గాండివ, ధనువున నగజయము గుణము దాఁచి కడంకన్. 151
క. హయము లనూరుసవర్ణము, లయుతంబు వహింప సూతుఁడై మాతలియు
న్నియమింపఁ దనరునరదము, నయదము నెక్కంగఁ బనిచి హర్షం బెసఁగన్.
తే. అసురలోకంబు నిర్జింప ననుపఁ బొంగి, సంగరోత్సాహ మెదలోన సందడింప
నడరుపెంపున నరుగునయ్యర్జునునకు, నిర్జరులు హర్షమున నిట్లనిరి కడంగి. 153
సీ. ఈరథం బెక్కి మున్నింద్రుండు నిర్జించె శంభన్మహాద్ధత్యు జంభదైత్యు
నీశతాంగమున బర్హిర్ముఖేంద్రుఁడు త్రుంచె నాజిని స్తంద్రు వృత్రాసురేంద్రు

నీయరదంబున నెగిచె గోత్రవిభేది పరిపంథిఘనమహాబలుని బలుని
నీతేరఁ గాదె మాయించె సుత్రాముండు, పాకదైతేయు నిర్భయుసహాయు
తే. నీమహాస్యందనంబున నేపు మాపె, నముచిముఖదానవశ్రేణి నమరవిభుఁడు
నీవు మీతండ్రియట్లన నిఖిలదనుజ, పతుల, నోర్వుము దీనిచేఁ బాండవేయ! 154

వ. అని పల్కి దేవసంబంధం బైనదేవదత్తం బనుశంఖం బిచ్చినం బుచ్చుకొని యర్జునుండు మాతలియుం దానును దద్రథాధిరోహణంబు చేసి నివాతకవచవధార్థం బతిరభసంబున నరుగువాఁడు ముందటఁ గరిమకరికంఠోరవపూత్కారవారిధారాఅవాసారపూర్యమాణరోదసీనిరంతరాకాలసంపాదితోడుభ్రమంబును నమలడిండీరపిండఖండమండితాఖండపాండుర్యధుర్యరోచిరనిశసాంద్రచంద్రికాక్రాంతదేశదిశాభాగంబును వితతవిద్రుమలతానికుంజపుంజ సమభిరంజితప్రదేశనిర్దిష్టసంతతాదిష్టచరమసంధ్యా విశేషరాగంబును గమఠఝషకుళీరతిమితిమింగిలాదిసత్వసంపాతసంభృతాచ్ఛోదితధ్వనినిలీననిఖిలచేతనారవంబును దటవిధూతపాతవికిరదవిరళపరాగవినిభృతద్విరేఫకుసుమమంజరీ విశాలలవలీలవంగలుంగలతాలాస్యవిభవంబును బకుభూభృదవిరతప్రచారాభిషవణంబును నమేయవాహినీవధూముఖప్రసక్తభూషణంబును నగు మహాసముద్రంబు డగ్గఱి తదీయోదరంబున.

చ. కనియెఁ బురం బనర్ఘమణికాంచనసౌధము నత్యుగదగ్రసా
ధనము నసాధ్యశిల్పఘనదారుణసాలము నద్భుతైకస
జ్జనసముదగ్రఘట్టము విశాలతరాట్టము నుద్భటారిత
ర్జనము ననల్పగర్జనసురద్విషదుజ్జ్వలితంబు నిమ్ముగన్. 156

మ. కని యత్యుద్ధతి శంఖ మొత్తుటయు నాకంపించె ధాత్రీతలం
బనిలస్కంధము లేదు చిక్కువడియె న్యాదోనిధు ల్డిందె ఘూ
ర్ణనముం బొందె సురేంద్రలోకములు విన్నంబోయెఁ బాతాళము
ల్వినిరోగంబులు దప్పె భూతచయము ల్వ్రీలె న్దిశాభాగముల్. 157

వ. ఇట్లు యుగవిగమసమయఘనఘనాఘనకఠోరదీర్ఘతరశతసహస్రభైరవం బగు నమ్మహారవంబు కర్ణశూలంబై తాఁకినఁ గనలి దానవులు హలముసలపరశుపట్టిసప్రాసపరిఘాముద్గర ముసుండి దండ కోదండ కుంతకులిశభల్లభిందివాల శంఖ శక్తి కర్తరీ కఠారకుఠారలవిత్రతోమరశూలఖట్వాంగ చక్రచంద్రహాస మహాంకుశ గదాపాశపాషాణప్రముఖంబు లగు మహాస్త్రశస్త్రంబులు వహించి వికటగర్జారవభరంబున నంబరంబు పిక్కటిల్ల నొక్కపెట్ట యమ్మహానగరంబు వెడలి తదీయస్యందనంబుఁ జుట్టుముట్టి. 158

మ. ఘనశస్త్రాస్త్రమహాతివర్షము నొగి న్గర్జామహాడంబర
ధ్వనిసంవీతఘనాఘనౌఘనిపతద్ధారాళధారామహా
శనివర్షంబుల ద్వంద్వ మొందఁ బయిపై సంరంభశుంభద్గతి
న్వనధుల్ ఘూర్ణిల బిట్టు వాసవి పయి న్వర్షించె నొక్కుమ్మడిన్. 159

క. వాలికమెఱుంగుఁదూపులు, నాళీకోదరునిమఱఁది నలిదైత్యులపైఁ
గీలించెఁ బేరుపేర, న్ఫాలమునఁ బదేసికంకపత్రములు వడిన్. 160

మ. అలుకం దానవు లొక్కయుమ్మడి తదీయస్యందనోరుద్యుతి
స్ఖలనంబు న్సురసిద్ధచారణమహాశ్చర్యంబు గావించుచు
న్గలహాక్షోణియు నాకసంబు దిశలుం గాండప్రకాండంబులం
గలయం గప్పి యదల్చి యార్చిరి సమాకంపింప భూతావళుల్. 161

తే. భయభరంబున వెలవెలఁ బాఱి రపుడు,
త్రిదశసారథి ధృతి దప్పె తేరు గడప
భ్రమసియుండినఁ దాన సారథియు రథియు,
నగుచుఁ బరిమార్చె నరికోటి నర్జునుండు. 162

క. నిర్జరసారథి యర్జును, దుర్జయవిక్రమము సమదదోహలతయు దోః
ఖర్జూభరంబు సారథి, యార్జిత్యముఁ జూచి మిగుల హర్షముఁ బొందెన్. 163

సీ. అసురు లుద్ధతి శూలహలభిందిపాలంబు లడరించి రడఁగించె నర్జునుండు
దైత్యులు ద్దండించి దండశంకులశక్తు లిగిడించి రుడిగించె నింద్రసుతుఁడు
దైతేయు లేచి ముద్గరగదాంకుశములు పఱపించి రదలించె ఫల్గునుండు
సురవైరు లల్కఁ దోమరకుంతగుణములు సారించి రెడలించె సవ్యసాచి
తే. కణయకంపరఖేటకక్రకచకులిశ, చక్రఖట్వాంగకుద్దాలచంద్రహాస
వివిధశస్త్రాస్త్రములు వైచి రవఘళించె, శుక్రశిష్యుల ద్రోణశిష్యుండు గెలిచె.

వ. అయ్యవసరంబున. 165

శా. జంభారిప్రభవప్రయుక్తనిబిడజ్యారావగంభీరసం
రంభభ్రామితగాండివప్రసరదస్త్రవ్రాతదీవ్యత్పరా
సంభిన్నాంగములై సురారితనువు ల్సంగ్రామరంగంబునం
గుంభద్రోణము లట్ల బిట్టు గురిసెం ఘోరంబుగా రక్తముల్. 166

క. చేయునది లేక దనుజులు, మాయాయుద్ధంబు సేయ మదిఁ దలఁచి ధృతిం
బాయక వైచిరి విద్యా, వైయాత్యము మించఁ బరుషవర్షాస్త్రంబుల్. 167

క. వడిఁ బాము ప్రేలఁగట్టిన, వడువున నలుగడల ముసరి వార్వాహంబు
ల్జడివడి కురియఁదొడంగెను, వెడవెలుపును లేక పాండవేయునిమీఁదన్. 168

మ. బలభిద్ధ్వంసివరంబునం గొనినదివ్యన్మారుతాస్త్రంబుచే

జలవాహంబులు కట్టఁజేసె నరుఁ డత్యుగ్రప్రతాపంబున
న్నలయం గప్పిరి దారుణాశ్మముల నుగ్రస్ఫూర్తులై యేచి దై
త్యులు పార్థుం గులిశాస్త్ర మేసి రవి తోడ్తోఁ ద్రుంచె నాతం డొగిన్. 169

చ. అనలసమీరణాత్మకము లైనమహాస్త్రము లేసి రుద్ధతిం
దనుజులు గాడ్పుతోఁ బెరసి నల్గడ లొక్కట విస్ఫులింగము
ల్గనకనఁ గ్రాలఁ బావకశిఖ ల్వెస ముంచె సురేంద్రనందను
న్గనలి యతం డణంచె నవి గ్రక్కున వారిమహాశుగంబులన్. 170

చ. తిమిరమహాస్త్ర మేసి రణతీవ్రత నూపిరి దైత్యపుంగవుల్
క్రమమునఁ గప్పె నల్గడల గాఢమహోద్ధతిఁ జిమ్మచీఁకటుల్
తెమలె దిశావివేకమును ధీరతయు న్వెస నెల్ల వారికిం
బ్రమసి సురేంద్రసారథియుఁ బాఱఁగ వైచెఁ బ్రతోద మవ్వలన్. 171

క. రథ్యములు పఱవ నేరక, మిథ్యాభిమతంబు లయ్యె మేయి మఱచి సమి
ద్రథ్య ధనంజయుఁ గానక, తథ్యమునకు లేక యుండఁ దత్సారథియున్.

వ. భయం బంది యర్జున! యెటపోయె దని యెలుంగెత్తి యాహ్వానంబు సేసి తొల్లి దేవాసురసమరంబు లనేకంబులు చూచితిం గాని యిట్టిభయోద్రేకజన్యంబు లగుజన్యంబులుకూడ వీరు వరజనితవీర్యదర్పితులు గావున వీరిసంప్రహారంబు ఘోరంబు. అని పల్కిన మాతలి నూఱడించి యించుకసేపు మద్భుజావిహారంబు చూడు మని ఫల్గునుండు. 173

శా. జంభధ్వంసివరంబునం గనినయస్త్రంబు న్మహాసారమున్
గుంభద్విక్రమబాహుదర్పములు సంక్షోభిల్ల సేసెం దమ
ల్సంభారం బడఁగన్ దిశ ల్విపులవైశద్యంబు నొందన్ సుర
ల్సంభావింప భయంపడంగ దితిజు ల్సంగ్రామరంగంబునన్. 174

మ. జవ మేపాఱఁగఁ గూలె దైత్యతనువు ల్సర్వంసహాపీఠిఁ బాం
డవగాండీవధనుఃప్రకాండభవకాండప్రస్ఫుటోచ్చండతాం
డవపాండిత్యవిశేషవిభ్రమకృతాడంబప్రతీకంబులై
యపసీధ్రంబులభంగి నింగి యద్రువన్ హాహానినాదంబులన్. 175

వ. ఇట్టినివాతకవచులు నిరవశేషులై మడసిన సంక్రందననందనుండు (తదీయనారీసమాక్రందనంబు) తత్పురంబులోనికిం జని యంతయుం గనుంగొని మాతలి కిట్లనియె. 176

తే. కనకమయహట్టకుట్టిమకాంత మగుచు, వివిధమణిసౌధములును వస్తువులు గల్గు
నిప్పురంబునఁ గాఁపుండ కితర మైన, పురమునం దేల నిల్చె నిర్జరవిభుండు. 177

ఉ. నావుడు నిట్లనుం ద్రిదశనాయకసారథి నిర్జరేశ్వరుం

డీవనరాశిలోన సృజియించెను దైత్యభయంబుచేత దే
వావలి కుండ నిప్పుర ముదగ్రగతిం దనుసూను లంత రా
జీవభవుం బ్రసన్నునిగఁ జేసి మహాబలవీర్యవంతులై. 178

క. ఇందుండఁగ నింద్రాదిక, బృందారకవరులతోడఁ బెనఁకువ సెందుక్
గ్రిందుపడకుండఁ దపమున, నందిరి వర మఖిలభువనహననోత్సుకతన్. 179

వ. కావునం దద్విజయార్థంబుగా విజయ నిన్ను వాసవుండు పనిచె, నిమ్మహాసురులు మరుద్గరుడగంధర్వసిద్ధసాధ్యులకసాధ్యు లిట్టివారల విక్రమంబునంజంపి పెంపు గాంచితివి. భవదీయసత్వసాహసంబులకుం గొలఁది యెక్కడిదియది యని యర్జునుం బ్రస్తుతించి మాతలి రథంబు గ్రమ్మఱించె. ఇట్లు నివాతకవచులఁ బరాభవించి భవ్యతేజోదుర్నిరీక్ష్యుండై పాండవేయుండు మరలి వచ్చువాఁడు ముందట. 180

ఆ. వివిధవృక్షగుల్మవిస్తీర్ణమై కడుఁ, బొలుపు మిగులు నొకతపోవనంబు
నతివిచిత్రశిల్ప మగుపట్టణంబును, నుజ్జ్వలంబు లగుచు నున్నఁ గాంచి. 181

క. సురసారథి ! యిది యెవ్వరి, పుర మిమ్మహనీయఘనతపోవిపినం బె
వ్వరిది యిది నాదుదృష్టికి, హరహర ! యతివిస్మయంబు నాపాదించెన్. 182

వ. అనవుడు నమ్మహాత్మున కాతఁ డిట్లనుఁ దొల్లి పులోమియు గోవికయు నను నసురకాంత లిత్తపోవనంబున దివ్యసహస్రవర్షంబు లత్యుగ్రనియమంబునఁబద్మగర్భునారాధించి తత్ప్రసాదంబునం గనకమయంబై కామగమనంబైన యిప్పురంబునం దనసుతు లాహవంబునం ద్రిదశులఁ దొడరి వధ్యులు గాకుండ వరంబు వడసి రిది హిరణ్యపుర మిందుఁ బౌలోమకాలకేయు లనునసురు లుండుదురు. వీరలింద్రాదిదేవతల కసాధ్యు లనిన నట్లేని యిప్పురంబుమీఁదం దేరు వఱపుమని ఫల్గునుండు మాతలిం బనిచిన. 183

సీ. సంవర్తమాతరిశ్వమనోహరరయమ్ము లగునశ్వములును దివ్యద్విభూతిఁ
జిత్రచంక్రమము సుస్థిరనేమిఘోషంబు నత్యద్భుతంబులై యంద మొంద
నమరారిపురముపై నాతఁడు దుష్పరవీథి నరదంబు వఱచిన నసురవరులు
వెసశతాంగములు షష్టిసహస్రకంబుతోఁ బెరసి యెక్కుడుగఁ బురము వెడలి

తే. యింద్రుఁ డనుబుద్ధి నల్కతో నింద్రతనయుఁ
దాఁకి రార్చుచు నతఁడును దారుణాశ్మ
వృక్షజన్యంబు లగుశస్త్రవితతి యేసి
తద్రథాళికి గతినిరోధంబు సేసె. 184

వ. వారును మాయాయుద్ధనిబద్ధబుద్ధులై తమపురంబులతోడ నంతరిక్షంబునను

నెగసిన నిశితశరనికరపంజరప్రపాతంబున నూర్ధ్వగతినిరోధంబు చేసి వారి
నేలంబడ నేసి ఫల్గునుండు వీరి నన్యప్రకారంబున జయింపరా దని. 185

సీ. బ్రహ్మాదులును నాత్మ భావించి నిజముగా నేదేవుమహిమంబు లెఱుఁగలేరు
భూర్భువస్స్వర్ముఖంబులు లోకజాలంబు లేదేవుకృపఁ బేర్మి నెలమి చెందు
భక్తి నేదేవునిపాదపంకజములు తలఁచువారల కసాధ్యంబు లేదు
గజరాక్షసాదిమూర్ఖవ్రాతముల నెల్ల నేదేవుఁ డడఁగించి యింపుఁ జెందె

తే. భక్తపరతంత్ర మేదేవుభవ్యమూర్తి, యట్టిదేవుని హృదయంబునందు నిలిపి
పాశుపతదివ్యబాణంబు పరమనిష్ఠఁ, దొడి ప్రయోగించెఁ ద్రిదశశత్రువులమీఁద.

చ. శరభతరక్షుసింహకిటిసైరిభఖడ్గమహోక్షపక్షిసం
జరసురయక్షరాక్షసపిశాచమహోరగభూతరూపము
ల్సురనరకిన్నరద్యుచరలోకభయంకరముల్ విచిత్రముల్
వరుసను నుప్పతిల్లి వెసఁ బట్టి గ్రసించె సురారివీరులన్. 187

వ. ఇవ్విధంబున నర్జునుండు సురల నఱువదివేలరథంబులవారల హిరణ్యపురనివా
సుల గీటడంచి వచ్చి వాసవునకుం బ్రణామంబు చేసిన నతండు నివాతకవచ
పౌలోమకాలకేయాదిరాక్షసవధప్రకారంబు మాతలివలన విని. 188

క. సురలకు హిత మొనరించితి, ధర కేఁగుము నిన్నుఁ జూడఁ దద్దయు వేడ్కన్
ద్వరితపడుచున్నవారలు, హరివిక్రమ! నీసహోదరాదులు పెరిమన్. 189

క. కదనమున నిన్నుఁ దొడరఁగ, ద్రిదశమరుత్సిద్ధసాధ్యదేవాదులలో
నెదు రెవ్వరు లే రనినన్, బదపడి యిఁక మానవుండు ప్రతియే నీకున్. 190

ఉ. ద్రోణుఁడు భీష్ముఁడుం గృపుఁడు ద్రోణసుతుండును గర్ణుఁడున్ రణ
క్షోణి నవశ్యమున్ భవదిషుప్రహతిన్ మహితానుభావసం
ప్రాణబలాఢ్యులయ్యు నిట రాక్షసు లట్లనె యోడు టెంక న
త్రాణుల ధార్తరాష్ట్రుల దురంబున గెల్చుట నీకుఁ బెద్దయే. 191

వ. అని పల్కి వాసవుం డనేకమణివిచిత్రపీతాంబరాభరణంబులు గట్ట నిచ్చి
యనిపిన నర్జునుం డవనీభువనంబునకు వచ్చి యగ్రజులకుం బ్రణమిల్లి తమ్ములం
గౌఁగిలించుకొని ధౌమ్యాదులకు నమస్కరించి ద్రౌపది నుపలాలించి తక్కిన
వారలకు యథోచితంబు సేసి తనవృత్తాంతం బాద్యంతం బెఱింగించి. 192

క. క్రమమున సమస్తరిపులన్, సమరమున జయించి యగ్రజన్ముని మాన్యున్
బ్రవిమలమతి ధర్మాత్మజుఁ, బ్రమదమునన్ విశ్వ మెల్లఁ బాలించెన్. 193

వ. ఈయాఖ్యానంబు వ్రాసినం జదివిన వినిన నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధియుం బుత్రపౌత్రాభివృద్ధియు నగును. 194

## ఆశ్వాసాంతము

శా. వ్యాపారిప్రవరాన్వవాయగణనీయప్రౌఢిగంభీరస
ల్లాపానందితవిశ్వ! విశ్వభువనాలంకార! లంకాదిక
ద్వీపానీతసువస్తుతర్పితసమాధేయాఖిలక్ష్మాప! వి
ద్యాపాండిత్యవివేక! నిత్యకృతకృత్యా! బంధుచింతామణీ! 195

క. అర్థినికరార్థితప్రద!, సార్థవహకులాభినంద్య! సంచితధర్మా!
సార్థచరితార్థ! సంగర, పార్థ! యశోవర్ధనార్థ! పరమార్థనిధీ! 196

మాలిని. అచలవిపులధైర్యా! హారివిద్వత్సపర్యా!
ఖచరవినుతకీర్తీ! కామినీహృద్యమూర్తీ!
యుచితజనవివేకా! యూరుజన్మప్రవేకా!
సుచిరశుభవినోదీ! సుస్థిరశ్రీప్రమోదీ! 197

గద్య. ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర వినయవిధేయ శ్రీనాథనామధేయప్రణీతంబైన హరవిలాసం బనుమహాప్రబంధంబునందు సర్వంబును సప్తమాశ్వాసము.

## హరవిలాసము సంపూర్ణము

# లఘుటీక

## పీఠిక

పద్యము 1. శ్రీ...హారము=లక్ష్మీదేవి స్తనములపై పచ్చలహారమైనవాఁడు, హస్తిభూధరస్వామి = కరిగిరిప్రభువు, జన్నము = యజ్ఞము, మండితుండు = అలంకరింపఁబడినవాఁడు. ప. 2. మావిడిమోక = శివకంచిలోని ఏకామ్రము, నిగమత్రితయము = మూఁడువేదములు, పదను=తడి. ప. 3. తుఱుము = కొప్పు, కరిగిరీశ్వరుఁడు = వరదరాజు, కింకరులు = సేవకులు; ఒడయులు = ప్రభువులు-అధికారులు, త్రిపురారి = తిప్పయ, అర్థి = ప్రీతి. ప. 4. ఏణాంకశకలము = చంద్రరేఖ, ఉపాస్తి = సేవ. ప. 5. గండూషితోన్ముక్త = పుక్కిలించి యుమ్మఁబడిన, వప్రక్రియాకేళి = కొండచరియలను పెల్లగించుట, విశీర్ణ = జాఱిన, (ముద్రణమున 'వికీర్ణ' అని యుండుట పొరపాటు.) కండూల = దురదకలిగిన, గండక = చెక్కిలి, కర్పరములు = కటాహములు, శాంభవి = పార్వతి, అమృతాశనులు = దేవతలు, విభ్రమములు = విలాసములు. ప. 6. వేదండవదనుఁడు = గజాననుఁడు, షాణ్మాతురుఁడు = కుమారస్వామి, గరుడలీలావతీ = గరుడస్త్రీల యొక్క, వీరభద్రవికీర్ణ = వీరభద్రునిచే చిమ్మఁబడిన. (మూలములోని 'వితీర్ణ'ను 'విశీర్ణ' అని దిద్దుకొనవలెను.) ప. 7. కమల...తారుండు=వైశ్యకులమునఁబుట్టిన వాఁడనుట, స్తంభాయమాన = స్తంభములుగా అగుచున్న, దిగంతదంతావళుండు = దిగ్గజములు కలవాఁడు, ('జలనోగి' అనుదానికి 'జోణంగి' సరియైన పాఠ మని పెద్దలు.) 8. పాత్రుఁడు = అర్హుఁడు, అధ్వర్యుఁడు = యజుర్వేదతంత్ర మెఱిఁగిన ఋత్విక్కు, వేదశాఖాధీతినిష్ణాతుఁడు = వేదశాఖల యధ్యయనమున నాఱితేఱినవాఁడు, అబ్జభవుని = బ్రహ్మను - నిర్జాతను, తాత్పర్యము = ఆసక్తి, అలకాధిరాజు = కుబేరుఁడు - ఐశ్వర్యవంతుఁ డనుట. 9. మంటిఁగా = జీవించితిని, 10. హర్మ్యంబులు = మేడలు - భవనములు, తటాకాంభోధి = సముద్రమువంటి చెఱువు. 11. నా యభీష్టంబో = నాకోరికయో, కడుఁగా=మిక్కిలి, భక్తిపథము = భక్తిమార్గము - ఇచట 'భక్తిపరత' అను పాఠాంతరమున్నది. అది సరసము. పరత = ఆసక్తి. 12. ఖని = గని, అవధరింపుము = కూర్పుము. 13. కృతిస్వామి = కృతిపతి. 14. మున్నేడువాసరంబులు = ఇరువదియొక్క దినములు, (ఇందలి రెండవపాదము "తా నొక్కరుఁడు దక్కఁ దక్కొక్క శివయోగి

యూరలే కుండంగ మేరవెట్టి" అని కొన్ని ప్రతులలోఁ గలదు.) భోనము = భోజనము, నిజము గనిపించెన్ = నిజస్వరూపమును జూపెను, నీలగళుఁడు = శివుఁడు, కైవారము = సేవ. 15. కుధరధరుఁడు = విష్ణువు, కల్యాణము = శుభము. 17. సింహవిక్రమపట్టణము = విక్రమసింహపురి - నెల్లూరు, నగరేశుఁడు = నగరపువేలువు. 19. ఈపద్యము కొన్నింట నీ క్రిందిరీతి నున్నది— 'విశ్వజగత్ప్రసిద్ధ సువివేకనిరంజనరామనాథయో,గీశ్వర పాదసేవకుఁ డహీనదయాగుణశాలి వీరమా,హేశ్వరచక్రవర్తి తరుణేందుకళాధరభక్తిభావనా, శాశ్వతమానసుండవచి......మర్త్యమాత్రుఁడే'. 20. అహర్నిశముల్ = రాత్రింబగళ్లు, స్ఫీతము = సమృద్ధి. 22. ఖుసి = సంతోషము, సురధాణ = సుల్తాను. (ఇచట సురధాణి యని యొక పాఠము). చంద్ర...రోలంబముల్ = కర్పూర కస్తూరుల వీవనల గాలియం దుయ్యాలలూఁగు సమయమునఁ గల్గిన గాఢమైన సువాసనలచే మత్తిల్లిన తుమ్మెదలు. 23. పట్టుంగొమ్మున్ = ఆధారయష్టియైనవానిని, నిధానమ్మున్ = నిధియైనవానిని. 24. ఫేరొజసహాసురధాణ = ఫిరోజ్ షాసుల్తాను, గజాధిపుఁడు = గజపతిప్రభువు. 25. సుమనః...ధామున్ = సత్పురుషులనెడి కలువల సమూహమునకు చంద్రుని, యామినీశ్వరకళోత్తంసుఁడు = చంద్రశేఖరుఁడగు శివుఁడు. 26. పంజార = పజ్జారు లేక పంజారీమాసీస్, (బంగారుమొలకు బదులు 'పన్నీరుమొలక' అని యుండఁదగునని శ్రీ ప్రభాకరశాస్త్రులుగారు.) హురుమంజి = హోర్మోజ్, గంధసింధురంబులు = మదపుటేనుఁగులు, తేజిహరులు = ఉత్తమజాతిగుఱ్ఱములు, యాంప = జాఫ్నా, బోట = భూటాన్, (ఈ పద్యములో 'తెచ్చి' అను క్త్వార్థకములు 'తెచ్చె' అను సమాపకక్రియలుగా ఉండుట యుచితము.) 27. అర్థులు = యాచకులు, బేహారమాడు = బేరమాడునట్టి. 28. తరుణాసీరి = తర్నాసరి - మలయాద్వీపములోని ఒక పట్టణము, రమణా = బర్మాదేశములోని భాగము, కప్పలిజోగులన్ = నావలందును, పడవల మీఁదను, 29. మౌళి = శిరస్సు, యానపాత్ర = ఓడ. 31. గోచరమే = సాధ్యముకాదనుట. 32. మధుకరము = తుమ్మెద. 33. సంధాభార్గవుఁడు = ప్రతిజ్ఞయందుఁ బరశురాముఁడు. 34. వాచా...త్యునకున్ = చెప్పశక్యముకాని జ్ఞానవైశిష్ట్యము కలవానికి. 35. వాణిజ్యచణునకున్ = వర్తకమున సమర్థునకు, అంత...మతికిన్ = విద్వాంసులచే కొనియాడఁబడు గొప్పబుద్ధికలవానికి, (ఇచట "...చణునకుం గ్రియమాణామిత సుకృతి కర్థిమందారునకున్" అను పాఠాంతరము ప్రత్యంతరములలో నున్నది.) 36. వితీర్ణిదీక్షానిధికిన్ = త్యాగదీక్షకు నిధియైనవానికి.

## ప్ర థ మా శ్వా స ము.

పద్యము 1. కిరాటకుల శ్రేష్ఠుండు=వైశ్యకులమున నుత్తముఁడు. 2. తాత్పర్యము = ఆసక్తి. 3. అనుసంధించి = నెఱవేర్చి, నీవారపాయసాన్నంబు = నెవ్వరిధాన్యపు క్షీరాన్నము, నితంబిని = యువతి - భార్యయనుట. దృక్కర్ణభూషణుండు = కన్నులే చెవులుగాఁగల పాము లాభరణములుగాఁగల శివుఁడు; అంగుళిస్ఫోటనంబు = చిటికెవేయుట, బిట్టు=ఎక్కువగా, (ఇచట 'దుర్వాసుం' డనుటకు 'నీవార ముష్టింపచుండు' అని పాఠాంతరము. అనఁగా యోగి యని యర్థము.) 4. మర్త్యుడు = మానవుఁడు, ఇంకంగన్=నశింపఁగా. 6. హరిహయరత్నము = ఇంద్రనీలమణి, దాంతిశాంత్యాభరణా! = ఇంద్రియనిగ్రహ మనోనిగ్రహములు ఆభరణములుగా కలవాఁడా! 7. అనుకంప=దయ, చెడ్డ = కీడు. 8. అమోఘంబు = తిరుగులేనిది, భోగ్యంబు = అనుభవింపఁదగినది, పురాకృతఫలంబు = పూర్వజన్మకర్మఫలము, శాపాంతంబు = శాపమోక్షము, కృపసేయుం= అనుగ్రహింపుము, క్రమ్మఱ = మఱల, పారిషదపదవి = ప్రమథునిపదవి, దాక్షిణ్యంబు=దయ. 9. తొలిపాదమున 'ఇంతటి తప్పొనరించి తట్టెయిూ' అను పాఠము కలదు. అదే యుచితమైనది. ఈప్రాద్దుగుణంబునన్ = ఈదినవిశేషము వలన, నెగులు=కోపము, ముద్దియ=యువతి, అవగన్ =అవిధముగా నీవుకోరినట్లు. 10. నదీ...భరా=నదీజలముపై ఆధారపడిన (పంట) భూమి, పంకజాసనుఁడు = బ్రహ్మ, హస్తిగిరిశిఖరము!= కరిగిరిమీఁది ప్రదేశము, ఘూట=ఘట్టము, హాటకము= బంగారము, వైకుంఠుఁడు = విష్ణువు, కౌతుకాగారంబు = విలాసగృహము, ఆవసథంబు=గృహము. 11. ఔర్జిత్యంబు = వృద్ధి, షట్కాలంబు = ఆఱువేళలు - ప్రాతస్సంగమ మధ్యాహ్నపరాహ్ణ సాయంరాత్రులు, ప్రమదము = సంతోషము. 12. అతని పురంధ్రి=అతని భార్య, అవతరించి = పుట్టి. 13. ప్రకృతిబంధులు= దగ్గఱిచుట్టములు, (పాఁడిపంటయు - అనుటకు బదులు పాఁడిపంతంబు - అనియు పాఠాంతరము.) తగవు=న్యాయము. 14. తుషారగిరికన్యకా = పార్వతి, వ్రతంబుగాఁబట్టి = నియమముగా నేర్పఱచుకొని, తిరుబాస = దేవునిపై నొట్టుపెట్టుకొనుట. 15. కావికోకలు=కాషాయవస్త్రములు, తుమికఫలంబు = తిందుకఫలము- తుమ్మికపండు. 16. ఒసపరిమన్మథుండు=అందమున మన్మథుఁడైనవాఁడు-జంగము, మన్మథమథనుఁడు = శివుఁడు, జగజెట్టిసెట్టి = గొప్పవాఁడైన కోమటి; కారుణ్యంబు=దయ. 17. గట్టుతూము = పెద్దకంచమై యుండు నేమో! ఇక్షురసము= చెఱకురసము. 18. పురారి = శివుఁడు, తేల్పక = తేలించక-అభిషేకము చేయిం

పక, ఆగమము=పూజావిధానము, అభ్యర్థింతుఁ=కోరుచున్నాను. 19. కక్షంబు =చంక, ఆలాబుంపుంగాయ=సొరకాయ, వైశ్యబృందారకుండు=వైశ్యశ్రేష్ఠుఁడు, మందస్మితము=చిఱునవ్వు, విందు=చుట్టము. అతిథియై, గరగరగాఁ = రుచ్యములై యుండునట్లు, అత్యుత్తమ... మిక్కిలి గొప్పదియు ఉత్తమమునగు బేరమువల్ల లభించినధనము, పుండ్రేక్షువాటంబులు = చెఱకుతోఁటలు, ఘట... సంవర్ధితంబులు = ఏతాములుతోడి, పెట్టిననీటియొక్క యెడతెగని ప్రవాహములచే తడిపి పెంచఁబడినవి, చెఱకుంగోలలు = చెఱకుఁగఱ్ఱలు. 20. దండములు = కఱ్ఱలు, జట్టియాడక = బేరమాడక, ద్రవిణంబు=ధనము, మురుఁదీవెలు = గట్టితీగలు, వాడెపట్టులు = చెఱకుల చివరిభాగములు, చేవలఁతి = భుజబలము, పుండ్రేక్షు ఘటలు = చెఱకుగడల కట్టలు. 21. వెగ్గలము = అధికము, వీఁక=బలము, గణ ముఖ్యుఁడు = ప్రమథులలో ముఖ్యుఁడు, సరిఁ = (అతనితో) సమానముగా, దెప్పరము = అధికము. 22. వైచి = ఇంటఁబడవైచి, ఆచాయ = ఆవైపు, చే జంత్రము = చేగానుగ. 23. దైవాఱఁ = పొంగి పొరలునట్లు-దిగువాఱునట్లు, కొమరుజంగము=యువకుఁడగు జంగము. 24. ప్రతానంబు=సమూహము - మోపు, అస్తోన=ఎక్కువగానున్న, మందాకినీమౌళి = గంగాధరుఁడగు శివుఁడు, గిరిరాజ నందన=పార్వతి. 25. ప్రేంకణములాడెడు = నాట్యముచేయుచున్న, కేళిసరసీరుహము=విలాసపద్మము, మధూళికాపరాగములు=పూవుఁదేనెయు, పుప్పొడియును. 26. కందర్పవికారంబు=మన్మథవికారము, గోవింద...రాదులు=విష్ణువు, బ్రహ్మ, ఇంద్రుఁడు మున్నగువారు. 27. అర్ధదేహంబు = (నా) సగముశరీరము, పొరుపున=పొరుగున-ప్రక్కను, పుష్పాసవంబు=మకరందము, నెఱసెఁ=విజృంభించెను-చెలరేఁగెను. 29. హాటకగోత్రము = మేరుపర్వతము, కర్ణాట...పూరితా! = కర్ణాటాది మండలముల యవధులయందు విజృంభించుచున్నట్టియు, చంద్రుని కాంతివలె నిర్మలమైనట్టియు కీర్తిచే నిండినవాఁడా! 31. రామానుజన్ముఁడు = లక్ష్మణుఁడు.

## ద్వితీయాశ్వాసము.

పద్యము. 1. శ్రీరాజరాజ = సంపదయందు కుబేరుఁడా! 3. నేరెటిదీవి = జంబూద్వీపము, లెస్స=మేలైనది, తదంతరమునందుఁ=దానిలోపల, మేల్= ఉత్తమము, 'కాంచికామండలంబందుఁ గాంచిపురము - అనుదానికిఁ గొన్ని పాఠాంతరము లున్నవి. అవి '(1) కాంచిధామ మాభూమికిఁ గాంచిపురము. (2) కాంచిధామ...పురము.' వీనిలో 'కాంచిధామ...పురము' అనునదే సరి

యైనది. కాంచిపురము - కాంచిధామము = మొలనూలిస్థానము - భారతభూమికి నడుమనున్నదని భావము.) 4. అంభోధి = సముద్రము, రాకాపూర్ణనిశాకరుండు =పున్నమనాఁటి నిండుచంద్రుఁడు, (మూలములోని ''పాయకుండు'' అనుదానికి 'ఏమఱండు' అనునది పాఠాంతరము.) 5. కందువ = ప్రతిజ్ఞ - నియమము, ఏపు = ఆధిక్యము, ఎడగాన్ = అవధిగా, ఘటించి = కూర్చి. ('కందువవేఁడినం దిరముగా' అనుటకుబదులు 'కందువవేఁడి రద్భుతముగా' అని పాఠాంతరము.) వసుంధర = భూమి. 6. ఊరూద్భవవంశసంభవుఁడు = వైశ్యుఁడు, ఓలార్చ దన్ = జలకమార్చెదను, నేమించినన్ = దీక్షవహింపఁగా. 7. భూతి - విభూతి - భూతియందుకొనుట యనఁగా - సమ్మతిని తెలుపుట. (ఇచట మూఁడవ పాదమున 'బట్టుంగొమ్మలు మంచి నల్లఁ జెఱకుల్ బారాది దిప్యించి' అను పాఠాంతరము కలదు. 'దిప్యించి' అనుదానిని 'దీయించి' అని గ్రహించినచో ఆ పాఠమే సరియైనదని గ్రహింపవచ్చును, బారాది = ఎక్కువైనవి.) 9. వ్రామెఁడు = రాసెఁడు, పుండ్రేక్షులతలు = చెఱకుగడలు, వట్రువగన్ = చుట్టుకొను నట్లు, దామములు = త్రాళ్లు. 10. పరిటెఁడు = కండెడు, రసాలకాండంబులు = చెఱకుగడలు. 11. భారము = బరువు, డస్సి = అలసి, 12. చనవులు = అవకాశములు. 13. వలచుట = ప్రేమించుట, భక్తి...పతి = శివుఁడు భక్తికి లొంగినవాఁ డనుట, ప్రాఁతమాట = నానుడి. 14. పంచవదనుఁడు = ఐదుముఖములు గల శివుఁడు - (సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశానములు శివుని పంచముఖములు.) పాకశాసనుఁడు = ఇంద్రుఁడు. 15. ముయ్యేడువాసరంబులు = ఇరువదియొక్క దినములు, మొగుళ్లగములు = మేఘముల గుంపులు, కుంభద్రోణములుగాఁగన్ =కడవలతోను కుంచములతోను క్రుమ్మరించినట్లు, అంభోధరములు = మేఘములు. 17. ఇంద్రచాపంబు = ఇంద్రధనుస్సు, అగడపలు = దొంతరమేఘములు. 18. మదనసంహరుదెస = ఈశాన్యదిక్కు. (ఇచటి నాల్గవ పాదమున 'గఱవఱ గఱవఱగ యనుచు గట్టున నఱచెన్' అని పాఠాంతరము కానవచ్చుచున్నది.) 19. దూఁటి = పొడుచుకొని, (ఇచట 'దివి ధూళి భ్రమింపఁగఁజొచ్చె, దివిఁ దూలి భ్రమింపఁగఁ జొచ్చె - అని పాఠాంతరములు కలవు.) గబ్బులుఁగు = ఒకజాతి శకునపక్షి, క్రోల్చెన్ = అఱచెను, వానికి వానికాడిరి= ఒకరితో నొకరు చెప్పుకొనిరి. 20. నిహారరుక్సహవాసంబు = చంద్రునితోఁ గలిసియుండుట, అభ్రము = ఆకాశము, పరివేషస్థాయి = (చంద్రుఁడుకట్టిన) గుడియం దున్నది, (ఇచట 'బహుబాధల్' అనుటకంటె 'బహువర్షంబు' (అనఁగా ఎక్కువ వర్షము) అనుపాఠమే గ్రహింపఁదగినది.) గృహమేధుల్ = గృహస్థులు;

ఇంధనము = వంటచెఱకు. 21. పుంఖానుపుంఖంబులు = గుంపులు గుంపులుగా వచ్చునవి, కంధరంబులు = మేఘములు, (కబంధంబు లనుచోట 'సలిలనిధికబంధంబు'లని పాఠము. అది మేలైనది, సలిలనిధికబంధంబులు = సముద్రపు నీళ్ళు) చటుల...నంబు = చలించుచున్న మెఱపనెడి కణ్ణదెబ్బ, ఓపి = ఓర్చి, పర్జన్య కోదండంబు = ఇంద్రధనుస్సు, కెరలి = విజృంభించి, ఇరుచక్కియలు = రెండు వైపులు, ఉక్కడంబునడవఁ = సేనలను కావలికాచుచుండఁగా, కోరగింపఁ జేయఁ = చెదరఁగొట్టఁగా, కట్టావి=ఎక్కువతాపము, ఆహ్లాదంబాపాదింపఁ = సంతోషమును కలిగింపఁగా, పురుడించుచుండఁ = అనుకరించుచుండఁగా, డీలు కొనఁ=చెదరఁగా, మెండుకొని = దట్టముగానుండి, ఖండపరశు = శివుని యొక్క, పటలంబుభంగి = సమూహపువిధమును, ('నిర్భిన్నపథికమార్గంబు' అను దానికి 'నిర్భిన్న విటంకమార్గంబు' అని పాఠాంతరము.) లాంగలీ ప్రసూనము= తరిగొట్టుపువ్వు, గిరినిర్ఝర ప్రవాహంబు = సెలయేళ్ల ప్రవాహముకలది, కరాళ ధారాకదంబడంబరంబు = భయముఁగొల్పు వర్షధారాసమూహపు విజృంభణము కలది, (ఇచట 'కరికరాభధారా...డంబరంబు' అను పాఠాంతరము కలదు. మూలములో నదే గ్రహింపఁబడినది. ఆపాఠముపక్షమున ఏనుఁగుతొండమువలె నున్న వర్షధార అని యర్థము.) విశ్వంభరామండలంబు = భూమండలము, ధారాపాతంబు = జడివాన. 22. తటిదభిఘాతము = మెఱుపుదెబ్బ, (జోరున జాఱుచుండఁగా - అనుదానికి 'జోఁఅని కురియుచుండఁగా' అనునది పాఠాంతరమున్నది. అదియే మేలైనది.) పిడుగుతండము = పిడుగులగుంపు, మఘవపుత్త్రుఁడు = ఇంద్రపుత్త్రుఁడగు అర్జునుఁడు. (అర్జునుని పేళ్లు పది - అవి అర్జునుఁడు, ఫల్గునుఁడు, పార్థుఁడు, కిరీటి, శ్వేతవాహనుఁడు, బీభత్సువు, విజయుఁడు, కృష్ణుఁడు, సవ్యసాచి, ధనంజయుఁడు. ఈ పదిపేళ్లను పఠించినయెడల పిడుగువలని భయముండదని పెద్దలనమ్మిక.) 23. ఊలవడి = హోరుమని, ఒత్తరించెఁ=అతిక్రమించెను. (ఇచట 'ఊలవడఁజొచ్చె' అని పాఠాంతరము.) 24. (నిలుపులేక = వెలుపులేక - అని పాఠాంతరము.) నింగి, అవని = ఆకాశముపగిలి, పురందరకీటకంబులు = ఇంద్రగోపములు, గండూపదములు=వానపాములు, కచ్ఛపోత్సేకము = తాఁబేళ్ళ గుంపు, అంపజాలంబు = బాణములగుంపు. 25. జడిఁ = జడివానవలన, ఉబ్బరవోయెదు=బాధపడునట్టి, దయ్యము నెత్తికోలు=దేవుని సంకల్పము, తేఱవాఱుట= తేఱుకొనుట, పయ్యెరపట్టె=దక్షిణపుగాలి, వీచెను, నచ్చుగఁ=మందముగా, ఉదఙ్ముఖంబులై = ఉత్తరదిక్కునకుఁ బోవునవై. 26. ఎడ=నడుమ, హేరాళము =

అధికము, ఉడుమార్గంబు = ఆకాశము, శాణోత్తేజనంబొంది = సానబెట్టఁబడి, పుల్కడుగంబడ్డ = మురికిపోవునట్లు శుభ్రముచేయఁబడిన - తోమఁబడిన, నిశాత ఖడ్గము=వాఁడియైన కత్తి. 27. మహోత్పాతము = గొప్పయుపద్రవముఁగల్గించి నది, అకాలవృష్టి=కాలముకానికాలమునందుఁ గురియువర్షము, వీడు = పట్టణము, వైదేశికులు=విదేశములందలివారు, కోలంగొట్టిన తెఱంగున=కఱ్ఱలతోఁగొట్టి తఱిమి నట్లు, ('జలోపద్రవంబు లిట్టువాఱై - అనుదానికి 'జలోపద్రవంబునం దట్టువడి - అను పాఠాంతరముకలదు. ఇయ్యదియే మేలుగా తోఁచుచున్నది. జలోపద్రవ మునఁ జిక్కుకొని యని దీని యభిప్రాయము. 'మూఁడామడ మేరయంతయు' అనుచోటను 'మూఁడామడమేర యీఁతయు' అను పాఠాంతరముకలదు. మూఁడామడమేరలోఁ గొంతభాగ మీదఁదగియు, కొంతభాగము పుక్కిటిబంటి నీటితో నిండియు నున్నదని యర్థము నూహింపవచ్చును. ఈ పాఠము సరసముగా లేదు.) 29. సీమాభూమి = అవధి. 30. అనిశమునన్ = ఎల్లపుడును, (ఇచట నాల్గవచరణమున 'దినములు రేల్ పయోఘృతదధిప్రచురాన్న సమర్పణంబునన్' అను పాఠము కలదు.) 31. అవ్వారిగాఁగన్ = సమృద్ధిగా, భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్యములు చతుర్విధాన్నములు. 32. తాలనియొల్వఁబప్పు = చెడి పోని పొట్టుతీసిన (చాయ) పప్పు. 33. ఉరవగు = విశాలమైన, మడుఁగులు = వస్త్రములు, ఓరెములు = ఆహారములు. 34. శతైకవృద్ధిలబ్ధంబులు = నూటి కొక్కటిచొప్పునఁ దీసికొనిన వడ్డీవలన లభించినవి, కిరాటవంశము = వైశ్యవంశము. ('ఆధారంబుగా' అనుటకు 'తోరంబుగా' అని పాఠాంతరము. 'తోరంబుగా = అధికముగా) కల్పాంతకాలకల్పంబులు = ప్రళయకాలముతో సమానములైనవి, దుర్దినంబులు = వర్షపుదినములనుట. 35. ఒదవకున్నన్=దొరకనియెడల, బాసవాఁడు = ప్రతిజ్ఞపట్టినవాఁడు. 36. సమయము = ఆచారము. 37. విభూతిమంగళస్నానము = విభూతిని పూసికొనుట, ధౌతపరిధానము = మడుగు దోవతి, త్రిపుండ్రధారి = నొసట మూఁడు విభూతిరేఖలు ధరించిన వాఁడు, అమృతాంశుమౌళి = చంద్రమౌళి - శివుఁడు. (ఇచట మూఁడవపాదమున ('చేనమృతాశనార్చితు నిశిత మయూఖధరున్ ధరించి' అను పాఠాంతరము కలదు.) తత్పరభావము = ఆసక్తి. 38. జలకమార్చెన్ = స్నానముచేయించెను, ('తాంబూలమొసరించె' అనుటకు 'తాంబూలమొసఁగూర్చె' అని పాఠము. అదియే సరసమైనది.) ఉపహారము=నైవేద్యము, ఉరుసజ్జ = పెద్ద పూజాసంపుటి. 39. ('ఒకళ్లులేమి' అనుటకు 'ఒకండులేమి' అని పాఠాంతరము. అదే సరియైనది.) 40. మగుడి=మఱల, మంద్రఫణితి=మెల్లఁగా. 41. మోసల = మొగ

చాల, భసితవిభూషణుల్ = భస్మముధరించినవారు, శైవ...యణుల్ = శైవపురాణముల నభ్యసించుటలో ఆసక్తికలవారు, అసితసరోరుహాక్షి = నల్లకలువలవంటి కన్నులుకలది-(ఇది తిరువెంగనాంచిని గూర్చిన సంబోధనము.) 43. ఇచట 'చందనం...ధరియించి' అనుటకు బదులుగానుండు "చందనసంగ యందియీ జందియంబు దుప్పటంబును బుచ్చుకొని ధరియించి" అనుపాఠమే మేలైనది. చందనసంగవారి దాని పేరు. 44. వేల్పుటిండులు = దేవాలయములు, సురావసథంబులు = మద్యశాలలు, జంగిలిసాలలు = సేనలుండుచోట్లు, ఆణకశాలలు = జోస్యులుండు స్థలములు, అర్థితోడుతన్ = కోరికతో. 45. 'భ్రమసితప్పిన పసరంబు వెదకినట్లు' అనుదానికిబదులు అర్థసూచికలోనున్న పాఠాంతరమునే గ్రహింపవలెను. బ్రమసి = భ్రమపడి, పసరంబు = పశువు, సెమకినట్లు = వెదకినట్లు, బెరసి = లభించి - తనదగ్గఱనుండి, అరసినట్లు = వెదకినట్లనుట. 46. అచ్చుగన్ = నియమముగా, బచ్చు = వైశ్యుడు. 47. కిరాటకుల శ్రేష్ఠుఁడు = ఉత్తమవైశ్యుఁడు. దవ్వుగాన్ = దూరముగా, వాహ్యాళి = విహారము, అశీతివర్షదేశీయుఁడు = ఎనుఁబదేండ్ల వయస్సుకలవాఁడు, జరాజర్ఝరితదేహుండు = ముసలితనముచే శిథిలమైన శరీరముకలవాఁడు, పలిత = పండినది, భసితము = భస్మము, గ్రుడ్డియవ్వ = గ్రుడ్డవ్వయను పతివ్రత-శివభక్తురాలు, పులికళాసంబు = పులితోలు, శరణార్థి = శరణుచొచ్చినవాఁడు. 47. కరాంబుజద్వయము = పద్మములఁబోలు రెండు చేతులు, మాయక్కడ = మాయింట, చరితార్థుఁడు = కృతార్థుఁడు. 48. ఈ రెలుఁగుపడుచు = గద్గదకంఠుఁడగుచు, తేరకొనంగఁజూచి = రెప్పపాటులేకుండునట్లు చూచి, (ఈపద్యమునఁ దొలి మూఁడు పాదములును వేఱొకప్రతిలో వేఱువిధముగా నున్నవి. 'తలవడంకంగ నొయ్య నీరెలుఁగుపడుచు, నంబి నెమ్మోము తేరకొనంగఁజూచి, బొక్కణములోన నున్న విభూతి యిచ్చి' అని యీ పాఠాంతరము. 'బొక్కణము = విబూదిసంచి'). 49. వదనము = ముఖము, చేవెలుఁగిడి = (ఎదుటివారిని జూచుటకు) చేతినడ్డముగాఁ బెట్టుకొని, వీనులు = చెవులు, ఒత్తుచుఁ జెప్పుము = నొక్కి చెప్పుము. 51. కూడుసీరకున్ = కూడుగుడ్డలకు, కొదవ = లోపము, అనువుపడునె = సాధ్యమగునా? ఎదిరివాంఛ = ఎదుటివారి కోరిక, ఘటించుట = వెలవేర్చుట, దెప్పరము = చిక్కయినది, చల్లఁజంపులు = లేనిపోని చిక్కులు పెట్టునవి, జంగకోలములు = జంగముల వంశములు, ఒరయ నేల? = బాధింపనేల? (ఇచటి ఎత్తుగీతి రెండవభాగమున 'శైవవీరవ్రతాచార సాహసంబు, పదిలమగునేని యిపుడు నాపనికిఁజాలు' అని పాఠాంతరమున్నది. అదియే యుచితమైనది.) 52. వృథాలాపంబులు = వ్యర్థమైన సంభాషణలు. 53. ఉద్యాపనంబు = వ్రతసమాప్తి, భవుఁడు = శివుఁడు. 54. పాదచర్య =

పాదసేవ. 55. పారంబుఁబొందఁజేయు = పూర్తియగునట్లు చేయునట్టి, ఓడర గూడదు = నెఱవేఱదో, తిరుబాస = దేవునిపైనొట్టు. 56. అభ్యంజనస్నానము = తలంగడుగు, అవధరించినయంతలోన = జరిగించునంతలో, ఆయితంబులు = సిద్ధమైనవి. 57. మోఱకుఁడు = మూర్ఖుఁడు, వృద్ధను = ముసలివాఁడను, రామా రత్నము = భార్యయనుట, కాదు, కూడదు అనినన్ = సమ్మతింపనియెడల, నీచోటికిన్ = నీ నివాసమునకు. 58. ఉదరమునన్ = గర్భమునందు, అదవదయైన = కలఁతపాటుపొందిన. 59. కతంబు = కారణము, (ఇచట 'ఇటకృతం' బని పాఠాంతరము, 'ఇంతకుఁ బూర్వమని దాని యర్థము) విచారించుకొనునది = ఆలోచించుకొనునది. 60. అందునది = అందుకొనవలెను, ఒకకుత్తుకైనఁగాక = ఒక్కయభిప్రాయముతో ఉండినచేతప్ప, మిన్నక = ఊఱక, ఏలకలుగున్ = ఎట్లు నెఱవేఱును. 61. హంతవ్యుఁడు = చంపఁదగినవాఁడు. 62. తివుట = కోరిక, దుస్తరము = మీఱరానిది. (ఇచట 'చావు దుస్తరముగాని' అనుటకు బదులుగా 'చావంగనఱిదిగాని' అను పాఠమున్నది. అదియే యుచితమైనది.) 63. ఈపద్యమున మొదటి రెండుపాదములకు 'పాడయినట్టి చిత్తమొకపాటున నిల్వక మాటిమాటి కూఁటాడుచు నుండుఁగానఁ దన యాత్మయునుం దన కిట్టిదౌనన్' అని పాఠాంతరముకలదు. 64. దీని పాఠాంతరము - 'క. శివభక్తుఁడ! యిదె గైకొను, మువిదకును విభూతి యీ ప్రయోజనమునకై, యవుఁగాకన నిచటికిరా, యవంచియే కంచినీకు నడుగామడయే!' అని. అదియే సమంజసమైనది. మాయజోగి చిఱుతొండనంబితో 'ఈవిభూతి తీసికొనిపోయి నీభార్యకిమ్ము; ఆపై సమ్మతించినచో మేము వత్తుము. పోయిరమ్ము; కంచి అవంతి యంతదూరము కాదుగదా! అడుగుదూర మామడ యెట్లగును?' అని యనుచున్నాఁడని యిందలిభావము. 65. ఉత్తరప్రత్యుత్తరంబులకున్ = వాదవివాదములకు, నెట్టుకొనఁజాలక = పూనుకొనలేక, ఛందోనువర్తనంబు = అతనికోరిక ననుసరించియే వర్తించుట, నిజమందిరంబు = తనయిల్లు. 66. ముఖరాగము = మొగమునందలి తేటఁదనము, ప్రమదమొందెన్ = సంతోషించెను. 67. సంభవించుట = తటస్థపడుట - లభించుట, ఆదిమధ్యావసానంబు = పూర్తిగాననుట, మిసిమింతురాలు = ఆయాసపడునది. 68. నేతకున్ = ప్రభువునకు, పాల = మాంసము, (ఇచట '...పుత్రుఁ డొకండెననేల? నేను న,వ్వల మఱి నీవుఁ బ్రాపులగువార మెకామె...' అని పాఠాంతరము. అదియే మేలైనది.) భక్తుని నేమము = భక్తుని నియమము. 69. ఏకోద్యోగంబు = ఒకేప్రయత్నము. 70. ఖండశశాంకధరుండు = చంద్రరేఖను ధరించినశివుఁడు. 71. ఇచటి యీవచనమునకు బదులుగా 'జటాధారియై జంగమరూపమనం

లలాటలోచనుండు వచ్చెనప్పుడు' అను పాఠాంతరమున్నది. 72. హస్తగృహీత పుస్తకము = చేతిలోఁబట్టుకొనిన పుస్తకము, లిఖించినయట్టి=వ్రాయఁబడినట్టి, ఉడురాజు = చంద్రుఁడు. 73. కెలనన్ = సమీపమున. 74. హాలామదోన్మాది = మద్యమువలని మదముచే ఒడలు తెలియనివాఁడు, సంపన్నస్నేహము = నిండు స్నేహము. 75. నంజుడుఁగుడుపులు = మాంసాహారములు. 76. దానవుఁడు = రాక్షసుఁడు, వసవల్చు = వసయొక్క వాసనకొట్టు, బత్తుఁడు = భక్తుఁడు. 77. జీవన్ భద్రాణిపశ్యతి = జీవించియున్న శుభములు చూచును, బారి = ఆపద. 78. వీనులు = చెవులు, పరార్థమై = ఇతరులకొఱకై; తనూధనము = శరీరమనెడి ధనము. 79. ఎఱుక = జ్ఞానము, పరోపకారార్థమిదంశరీరం = ఈ శరీరమితరుల యుపకారముకొఱకే, సంయమివరేణ్య = ఓమునిశ్రేష్ఠుఁడా! 80. అధ్రువంబు = అస్థిరము, కీర్తికాయంబు = కీర్తి యను శరీరము, ఆర్తియేల = బాధపడనేల? 82. హరుఁడు = శివుఁడు, అక్షరాచార్యుఁడు = గురువు. 83. ఉచ్చులు గ్రమ్మ = చొంగలు వ్యాపింపఁగా, మై = శరీరము, తారకా...కరింప = కనుపాపలాడుట నిలిచిపోఁగా, గ్రీవారంధ్రంబున = కంఠనాళమునందు, సిరాలుండు = సిరియాళుఁడు; ధరిత్రి = భూమి, నిరాలస్యతన్ = ఆలస్యములేక. 84. మోహము = మూర్ఛ, ఉసురుడుగుటయున్ = మరణింపఁగా, గురుకులంబున = గురువుగారియింట. 85. ఫాలము = నొసలు, ప్రాముట = పులుముట - రాచుట. 87. కోల, ఊదికొని = కఱ్ఱ ఆధారముచేసికొని, బూదిబొక్కణ = విబూది సంచి, లాతము = దండము, శరణీయులు = రక్షణకావలసినవారు, సందడికి=జనసమ్మర్దమునకు, ఓసరిలుచు = తప్పుకొనుచు, జనకోటి = జనసమూహము, ఇచ్చగింప = మెచ్చుకొనఁగా - (పాఠాంతరము - పిచ్చలింప = అతిశయింపఁగా) 88. ఆమ్నాయాం...భరణము = వేదాంతసిద్ధాంత మను స్త్రీయొక్క కుంతలములను ముత్యాలసరమైనవాఁడు, మందాకినీశేఖరుండు = గంగాధరుఁడు, భర్గుఁడు= శివుఁడు, వహియించెన్ = మోసెను. 89. వాల్గంటి = స్త్రీ, భార్య, ధౌతవస్త్రములన్=మడుగుబట్టలు. 91. (ఇచట 'ఎలపాసెమునడుక్కలు' అనుదానికి పాఠాంతరమైన 'ఎలఁబ్రాసఁగుటడుక్కలు' అను పాఠమునే గ్రహింపవలెను. ఎలఁబ్రాసఁగుటడుక్కలు = క్రొత్తప్రాసంగు ధాన్యపుటటుకులు.) నంబివియ్యములు = చిఱుతొండనంబి బావమఱదులు, అర్మిలిన్ = ప్రీతితో. 93. కమ్మదోయి = రెండు కమ్మలు, కావిగంత = కావిరంగుబొంత, పుట్టంబు = వస్త్రము, కేదారవలయంబు= ఒక హస్తాభరణము, పచ్చడపుఁగండ = పచ్చడపుతునుక, సంతరించి = కూర్చి, పురంధ్రి = స్త్రీ. 94. మక్కువరేఁగి = ప్రేమ అధికమై, నెయ్యపుఁగుమారుఁడు=

ముద్దుకొడుకు, ఆఱితేరాయము = ఆటంకము, అక్కటికంబు = దయ, జోగెత = సన్న్యాసిని. 95. శూలిసాంచారు = శివునిభార్య - పార్వతి. 97. క్రంథ క్రంతల = వీథివీథులను, నిస్త్రింశభావంబునన్ = కనికరములేనట్లుగా, దుర్నిర్వాణి = చెడ్డతపని. 98. ప్రాగల్భ్యంబు = నేర్పు, నిధానము = నిధి, ఓగిరముగ = ఆహారముగా. 99. భూతి = విబూది, నిసువు = బిడ్డ. 100. ఏమిటివాఁడు = ఎంతవాఁడు - అధికారములేనివాఁడనుట. మగవాఁడో, మ్రానో = మగవాఁడు మ్రానుపోలిక మొరటుస్వభావము కలవాఁడనుట. 101. అర్థప్రాణంబులు = ధనము, ప్రాణమును, కర్త = కారకుఁడు, భోక్త = అనుభవించువాఁడు, తడవు = ఆలస్యము, అలమటఁజెందునో = విచారించునో - దుఃఖించునో! వ్యాపారంబులు = ప్రయత్నములు. 102. ఇచట 'ఒజ్జలగృహంబునకు చోటు' అనుటకు బదులుగా 'ఒజ్జవారింటికేఁగి' అను పాఠాంతరము కలదు. 103. చేతడి = చేతితడి, అనంతరక్షణమ = ఆమఱుక్షణమునందే. 105. 'నేతను దోఁచితోఁచి' అని పాఠాంతరము. తోఁచి = ముంచి. 107. జొబ్బిలఁగ = తడియునట్లుగా, సంకుమదము = జవ్వాది, ఉద్వర్తనంబుచేసి = నలుగుపెట్టి, చిరుబంతిపసుపులో చెవపు నలది' అనుదానికి 'చిఱుబంతిపసపుతోఁ జెవపునలది' అని పాఠాంతరము. 'చెవపు'న కర్థము విచార్యము. పొరపిన = కలిపిన, గంధసారము = చందనము, ఒరపు = రాపిడి, ఈటార్చి = తడియార్చి. 108. కయిసేసి = అలంకరించి. 109. పారణ = భోజనము, పలలము = మాంసము. 111. మత్స్వాంతంబు = నామనస్సు, ఉడుగుఁడీ = విడువుఁడీ, వైక్లబ్యసంభావనల్ = కలఁతపాటును గూర్చిన యూహలు. 113. ఇయ్యకొనిన = సమ్మతించిన. 115. బాగున = విధమున, జనయిత్రి = తల్లి, కరవాఁడి = మిక్కిలి వాఁడిగలది, గంటిఁదీఁడె = గంటి పెట్టెను. 117. శివార్థముగ = శివునికొఱకే యనెడి, (ఇచట 'శంక' అనుటకు 'చింత' అనునది పాఠాంతరము.) 118. గాజువాఱక = కాంతివిహీనముకాక, (జాఱక - అనుటకు 'ఆఱక' అని పాఠాంతరము.) 119. పన్నిదంబాడి = పందెమువేసి, గారంపుసుతు = ముద్దుకుమారుని. 120. కరాంబువు = లవంగము, కటికిడెందము = కఠినమైన మనస్సు. 121. నల్లచారు = రక్తముతోడి చారు, బలియించి = సమృద్ధిగాఁగూర్చి, తాలఁబోసి = తాలింపుపెట్టి. 122. ఆనాలు = ఆనవాలను భక్ష్యములు, బోనాము = భోజనము. 123. పాటించి = ఆదరించి, ఒడఁగూర్చి = సిద్ధపఱచి, కలయన్ = అంతటను, రాగిపడిగెంబు = వెడల్పుంచుగల పాత్ర, గరగ = పానపాత్రము, సర్వాయితంబు = అంతయు సిద్ధపఱుచుట, అవసరంబు = సమయము, (ఇచటి యెత్తుగీతిలోని చివఱి రెండుపాదములకును

'సెట్టి తోడ్తెచ్చెఁ దగ నయ్యశీతివృద్ధుఁ, దోడ గుడ్డైన గ్రుడ్డవ్వతోడఁగూడ' అని పాఠాంతరముకలదు. అశీతివృద్ధు = ఎనుఁబదేండ్ల ముసలివాఁడు.) 124. వ్యాపారి = వర్తకుఁడు. 125. కదళీపలాశంబు = అరఁటియాకు, ప్రక్షాళించి = కడిగి, ఉపస్తరించి = అభిఘరించి, పొలసు = మాంసము, మేలోగిరంబులు = మంచియాహారములు, ముక్కలుమఱియని = మొక్కవోని, మడుంగుటోగిరంబులు = పరిశుద్ధాన్నములు. 126. నంజుడు = మాంసము, మస్తకము=తల, ఉత్తమాంగము=తల, నిసర్గమోహముల్ = స్వభావసిద్ధములైన ప్రేమలు. 127. ఉజ్జగించి = విడిచి. 128. వదనంబు = ముఖము, (చిట్టమిడుచునంతఁ దలకాయపొ (పా) లమే లోగిరంబు - అనుదానికి 'చట్టువంబునం దలకాయ యెఱచి' అని పాఠాంతరము. చట్టువము = త్రెడ్డు, ఎఱచి=మాంసము) బెడందకాండ్రు = బాధలుపెట్టువారు - చిక్కులుపెట్టువా రనుట. ఏపాకము = కలఁతపాటు, కుహనాభైరవుండు = వేషధారియగు శివుఁడు. 129. ఇందలి చివఱి రెండుపాదములకును "అఘము భుజియించుఁబో 'కేవలాది' యనుచు, వేదవాక్యంబు బుధులన వినమె చెపుమ" అని పాఠాంతరముకలదు. 131. ఈపద్యము మఱికొన్ని ప్రతులలో నిట్లున్నది - 'మొదలం దేవర యానతిచ్చితిర; యేమం జిత్తవృత్తిన్ మఱా, మది; నాకుం గొడుకింకనుం గలఁడు; వాఁడాడంగ నెందేఁగెనో, చదువం బోయెనొ పిల్వఁబంచెద నవశ్యంబుం బ్రతీక్షించు నీ, యదనంగూరలు చల్లనారవె మహాత్మా! యోగిచూడామణీ! ఇదియే సరియైనపాఠము; మఱాము = మఱచిపోము. 132. ఒఱగొడ్డెంబులు = ఆటంకములు, గొడ్డేఱుగా జిడ్డుపఱచుట = వ్యర్థముచేయుట, పురంధ్రీరత్నము = ఉత్తమసతియగు తిరువెంగనాంచి. 133. వణి...ధామ = వైశ్యవంశమను సముద్రమునకు చంద్రుఁడైనవాఁడా! ఘనా...రాజ = గొప్పత్యాగమున కుబేరుఁడా! సమగ్ర...జేయ = పరిపూర్ణమగు బుద్ధియందు బుధుఁడా! 134. అత్యుచ్చైశ్శ్రుతి = మిక్కిలి గట్టిగాపలికిన మాట, ఛీరినఁ = పిలువఁగా, ప్రతానంబు = సమూహము. 135. రక్షాపాండురము = భస్మముచేఁ దెల్లనైనది, అహిగ్రైవేయము = సర్పహారము, కంధరా = కంఠము, కప్పు = నలుపు, శశాంకార్ధము = నెలవంక, హృదాహ్లాదంబు = మనస్సంతోషము. 139. వర్ణనకెక్కి = పేరుపడి, వాసివట్టము = ఎక్కువ, తక్కువ, తారకరాజశేఖర = చంద్రశేఖరా! 141. ఇచటి పద్యమున రెండవ, మూఁడవపాదములకు పాఠాంతర మిట్లున్నది - "వాసె కోమటి పిళ్లయర్వ్వలనుగూడి, యఖిలజీవజంతువులును నభ్రవీథి." 142. కూటస్థుండు = మూలపురుషుఁడు. 143.

చాముండా...శ్వర్య!=చాముండేశ్వరీదేవియొక్క గొప్పదయవలన వృద్ధిపొందిన సంపదకలవాఁడా! నిస్సీమ...గ్రజ! = హద్దులేని ప్రభుత్వము (అధికారము)న రాముఁడా! సుధా...లాప! అమృతము లొలుక్కునట్లు మాటలాడువాఁడా! శర్వరాధీశ్వరుఁడు = శివుఁడు. 144. సర్వ...సేవక! = శివునిపాదములను సేవించువాఁడా! అహర్పతి = సూర్యుఁడు. 145. అలకాధిపతి = కుబేరుఁడు, చంద్రము=కర్పూరము, ఝుషలక్ష్మనిభా=మన్మథునివంటివాఁడా!

## తృతీయాశ్వాసము

పద్యము. 3. మహాసురుఁడు = గొప్పరాక్షసుఁడు, తామరసాసనుఁడు = బ్రహ్మ, ప్రాలి = అతిశయించి, ఏఁచి = బాధించి. 4. నిర్జరులు = దేవతలు, గంధవహుఁడు = గాలి, చిత్తంబువడసి = అనుగ్రహమును సంపాదించి. 5. స్నేహదశ = స్నేహావస్థ, నూనెవత్తి, పర్వంగా=వ్యాపింపఁగా, నిశీథంబులు=రాత్రులు, శుద్ధాంతంబులు = అంతఃపురములు, చక్షుశ్శ్రోత్రబృందారకుల్ = నాగులు, 6. మార్తాండుఁడు = సూర్యుఁడు, పంకేరుహములు = పద్మములు. 7. ఈపద్యము ప్రత్యంతరమున నిట్లున్నది—"ఇట దైతేయుఁడు కేళిదీర్ఘికలలో నిచ్ఛావినోదార్థమై, యటవుల్లాఁ గనకాబ్జముల్ పెఱికి పాయందెచ్చి నాఁటింపఁగాఁ, బటుదిగ్వారణగండమండలసత్ప్రోత్యగ్రదానచ్ఛటా,కటుగంధంబుగ నీరచిక్కను వియద్గంగా ప్రవాహంబులోన్." కటుగంధంబు = ఘాటైనవాసన, హేమాంబుజము=బంగారుపద్మము, దేవాళి = దేవతలగుంపు. 8. ఐంద్రము = తూర్పు, ఆసురము=నైఋతి, ఐలబిలము = ఉత్తరము, వారుణంబు = పడమర, యామ్యము = దక్షిణము, సురలక్క, కైకోఁడు = దేవతలను లెక్కసేయఁడు. 9. పాకశాసనుఁడు= ఇంద్రుఁడు, పరేతరాజు = యముఁడు, పలలాశి = నిరుతి, పాశి = వరుణుఁడు, పవనుఁడు = వాయుఁడు, పౌలస్త్యుఁడు = కుబేరుఁడు, పన్నగాభరణుఁడు = ఈశానుఁడు, వెన్నునూచి = తఱిమి, బడలుపఱచి = శ్రమపడఁజేసి, రాజసంబు-ఉడిపి = అహంకారమునుపోఁగొట్టి, ధర్షించి = తిరస్కరించి, అప్రతీపంబు = ఎదురులేనిది, అస్తోకంబు = తక్కువకానిది, (వివేకంబున - అనుదానికి 'ఉత్సేకంబున' అని పాఠము. ఉత్సేకము = గర్వము.) 10. అదవదలైరి = కలఁతపడిరి, అంగలార్చిరి = విలపించిరి, విచ్చిరి = చీలిపోయిరి, అరడిఁబొందిరి = భంగపడిరి, పల్లటిల్లిరి = చలించిరి, బెగ్గడిల్లిరి = భయపడిరి, వికావికలైరి = చెదరిపోయిరి, సొలసిరి = అలసిరి, కుతిలపడిరి = కూలఁబడిరి, గగ్గులకాడైరి = చెల్లాచెదరైరి, ఓటాఱిరి = బలహీనులైరి, గుజగుజయైరి = బాధపడిరి, డస్సిరి = శ్రమపడిరి,

ఒల్లఁబోయిరి = మూర్ఛిల్లిరి, వెగ్గిరి = వాపోయిరి, తల్లడిలిరి = తత్తఱపడిరి, ఒచ్చ
పడిరి = అవమానపడిరి, ఇస్సిస్సియైరి = అసహ్యపడిరి, బృందారకులు=దేవతలు,
11. విబుధులు = దేవతలు, కనుఁగాఁపులు = కనిపెట్టుకొనియుండు సేవకులు,
వెట్టియుఁజేసిచేసి = ప్రతిఫలములేనట్లు పనులుచేసిచేసి, వేసరి = విసిగి, పద్మ
జుఁడు = బ్రహ్మ. 12. జంభారి = ఇంద్రుఁడు, బర్హిర్ముఖులు = దేవతలు,
మయూఖమంజరి = కాంతిసమూహము, జాహ్నవి = గంగానది, శుకీపంజర =
ఆఁడుచిలుకలకు పంజరమైనవాఁడా! నిరంజనుఁడు = పరమాత్మ, నిరీహుఁడు =
కోరికలులేనివాఁడు, అవ్యయుఁడు = నాశములేనివాఁడు, 13. మూర్తిప్రభేదము=
స్వరూపభేదము, గుణసంవిభక్తి = గుణవిభాగము, ఊఁదితి = నాఁటితివి, నిగమ
పఙ్క్తి = వేదములు, 14. అవధరింపుము = వినుము, విచారింపుము, తడవు = ఆల
స్యము. 15. వెన్నడితిమి = దుఃఖపడితిమి, ఎల్లవెంటలన్ = అన్నివిధములను.
18. సంయములు = మునులు, వాఁడి = శౌర్యము, మ్రందించుట = చంపుట,
యోగనిర్ముక్తదేహ = యోగముచే విడువఁబడిన దేహము కలది, ఉద్భవించి =
పుట్టి అనువు = ఉపాయము. 19. పురందరుఁడు = ఇంద్రుఁడు, శతానందుఁ
డు = బ్రహ్మ, గంధవాహము = వాయువు, అనుసంధించుచు = మనస్సునకు
పట్టించుకొనుచు. 20. దక్షకన్యక = సతీదేవి, ఉజ్జగించి = విడిచి, అజ్ఞాత
యోని = తెలియని పుట్టుక కలది, అభిజనాఖ్య = పుట్టుక ననుసరించినపేరు,
పొగడఁబడినపేరు, పురారి = శివుఁడు, అర్ధాంగలక్ష్మి = భార్య. 22. విద్యుల్ల
తాభము = మెఱుపుయొక్క కాంతి, కారుకాలంబు = తొలకరిసమయము, ఉద్ది
= సాటి. 23. కందుకక్రీడ = బంతియాఁట, రాగంబు = ఎఱుపు, ప్రవాళం
బులు = చిగుళ్లు, వేదండము = ఏనుఁగు, వలీవిభంగంబులు = వళిత్రయము,
కంధరంబు = కంఠము, ప్రోవి = బుడ్డి, పాత్రము, కటివంకబొమలు = నల్లనై,
వంకరగనున్న కనుబొమలు, సముచ్చయంబు = సమూహము, దిదృక్ష = చూచు
కోరిక, ఆమోదంబు = సంతోషము. 24. ఇభయాన = గజగామిని యగు
పార్వతి, సురముని = దేవముని - నారదుఁడు. 25. ఉడుగణేశుఁడు=చంద్రుఁడు,
ఈరేడులోకంబులు = పదునాలుగు భువనములు, 26. జోటి = స్త్రీ, సోమకిరీ
టుఁడు = చంద్రశేఖరుఁడగు శివుఁడు. 27. నివృత్తాన్యవరాభిలాషుండు=వేఱొక
వరుని కోరనివాఁడు, యోషారత్నంబు = ఉత్తమస్త్రీ, శేషభూషణుఁడు=శివుఁడు,
అభ్యర్థనాభంగభయము = (తన) కోరిక పొల్లుపోవునను భయము. 28. నగపతి=
(హిమవంతుఁడు) పర్వతరాజు. 29. అపరిగ్రహుండు = వివాహముచేసికొనని
వాఁడు. 30. అభ్యున్నత = మిక్కిలి ఎత్తయిన, విషయనివృత్తుఁడు విషయముల

నుండి విముఖుఁడైనవాఁడు. 31. నమేరువృక్షములు = సురపొన్నచెట్లు, పరిధానములు = వస్త్రములు. 32. పసిరిక = పచ్చిక, మృగేంద్రములు = సింహములు, 33. ఆత్మమూర్త్యంతరంబు = తనయొక్క వేఱురూపు, అష్టమూర్తి = ఎనిమిది రూపములు కలశివుఁడు. (పంచభూతములు, సూర్యచంద్రుఁడు, యజమానుఁడు - అష్టమూర్తులు.) 34. అర్చలిచ్చి = పూజించి, నిజతనూజ = తన కుమార్తె యగు పార్వతి. 35. రమణి = యువతి, సమధికవిఘ్నంబు = గొప్పయాటంకము. (ఇచట అర్థసూచికయందుఁగల పాఠాంతరమే గ్రాహ్యము.) 36. పాటించి = ఆదరించి, రహిమీఱు = బాగుగానున్న, సమ్మార్జవిధి = ఊడ్చుట - తుడుచుట, నిర్వర్తించు = నెఱవేర్చును, ప్రత్యహంబును = ప్రతిదినమును, స్తబకము = సమూహము, శ్రాంతి = ఊఱట - విశ్రాంతి. 37. పాకశాసనుండు = ఇంద్రుఁడు, కల్పానోకహంబులు = కల్పవృక్షములు, దివిజులు = దేవతలు, కందర్పుఁడు = మన్మథుఁడు. 38. వలరాజు = మన్మథుఁడు. 39. ఉజ్జగించి = విడిచి (ఇచట 'ఆశ్రితులపేర' అనుదానికి బదులుగా 'ఆశ్రితుల కీరె' అనుపాఠమే గ్రాహ్యమైనది. ఈరె = ఈయరా?) 40. మరుస్వామియనుఁడు = దేవేంద్రుఁడు. 42. పతిప్రసాదంబు = ప్రభునియనుగ్రహము, మోడ్చి = జోడించి. 43. అవధరించిన=తలంచిన. 44. ఎరియించుచున్నాఁడు = బాధించుచున్నాఁడు, కైవల్యపదవి = మోక్షపదవి, ఏపాకము = కలఁతపాటు, దంభోళిహేతి = వజ్రాయుధము, నీలోత్పలధార = నల్లకలువరేకుదారు, అతకరింతు = క్రిందుపఱతును. 45. (చేయాడు - అను పాఠమునకంటె చేయాక - అనునదియే ఉచితము. చేయాక=దొరకక.) స్వయంగ్రహాశ్లేషణంబు = తనయంతవచ్చి కౌఁగిలించుకొనుట. 46. ప్రవాళశయ్య = చిగురుపాన్పు. 48. ప్రాపు=సహాయము, కంతుఁడు=మన్మథుఁడు. 49. సంకల్పసంభవుఁడు = మన్మథుఁడు, ఏము=మేము, కుధరకన్యక = పార్వతి, జలజభవుఁడు = బ్రహ్మ. 50. అంధకారాతి=శివుఁడు, ప్రణిధివర్గంబు = చారులగుంపు. 52. అభ్యర్థనము = ప్రార్థన, సంస్పృహణీయవిక్రముఁడవు = మిక్కిలి కోరఁదగిన పరాక్రమముకలవాఁడవు. 53. హుతాశనుండు = అగ్ని, సమీరణము = వాయువు, ముత్యాలసేస = ముత్యాలయక్షతలు, వాస్తోష్పతి = ఇంద్రుఁడు. 54. సంయమికోటి=మునులగుంపు, ప్రతికూలవర్తి=విరుద్ధముగా ప్రవర్తించువాఁడు, షట్పదము = తుమ్మెద, జాలకము=సమూహము, ఝషలాంఛనుఁడు = మన్మథుఁడు. 55. ఉష్ణరశ్మి = సూర్యుఁడు, దక్షిణాశాపురంధ్రి = దక్షిణదిక్కనెడి స్త్రీ. 56. ప్రత్యగ్ర...శ్రంబుగ = క్రొత్తచిగుళ్లగుంపుతోఁ గూడునట్లుగా, నీహారాద్రికుంజంబు = హిమవత్పర్వతమునందలి పొద,

షత్వంబు = పరాక్రమము. 57. గతి=ఠెక్కు, చిత్తజాఁడు=మన్మథుఁడు, అళి = తుమ్మెద. 58. నవకములు = అందమైనవి, విపినము = అడవి, తెఱుట = వలపు, షల్లవుఁడు = విటుఁడు. 95. కరఁచె = కఠిఁగించెను. 60. వనౌకసులు = అడవిలో నివసించువారు, మధుకరంబులు = తుమ్మెదలు, గండూషము = పుక్కిటఁబట్టిన నీరు, సందోహము = సమూహము, కండూయనము=గోకుట. 61. పల్వలవారి = పడియలోని నీరు, కరేణువు = ఆఁడేనుఁగు. మదావళంబు = మగయేనుఁగు, అర్ధభుక్తము = సగము భుజింపఁబడినది, 62. దేసికగానము = దేసిపద్ధతినున్న గానము, పుష్పా...ణములు=పూవుఁదేనె త్రాఁగుటవలనఁ దిరుగుచున్న కన్నులు. 63. ప్రసంఖ్యానము = జపము, సమాధినిష్ఠ, అంతరాయములు=విఘ్నములు. 64. వామ...వేత్రకుండు = ఎడమచేతియందున్న బంగారు బెత్తముకలవాఁడు, నిష్కంపవృక్షంబు = కదలికలేని చెట్లుకలది, నిభృతద్విరేఫంబు = కదలని తుమ్మెదలుకలది, మూకాండజంబు = ధ్వనిచేయని పక్షులుకలది, మనోభవుండు = మన్మథుఁడు, చక్కటి = చోటు, పక్కియ=ప్రక్క, పురస్కృతంబు = శుక్రునకెదురుగా, జగజెట్టి = గొప్పవీరుఁడు, చలికొండచట్టుపట్టు = హిమవత్పర్వతమునందలి ఱాతిప్రదేశము, విలంబమాన = వ్రేలాడుచున్న, అధిజ్యశరాసనుండు = విల్లెక్కు పెట్టినవాఁడు. 65. వలుద = లావైన, పాఁపతలపాగ = తలపాగగాఁ జుట్టినపాము, కప్పి = నలుపు, ఒఱపు = అందము, నిస్తరంగకము = అలలులేనిది, మున్నీరు = సముద్రము, ఘనఘనాఘనము = పెద్దవర్షకాలపుమేఘము, ఇందుధరుఁడు = శివుఁడు, ప్రసవనారాచుఁడు = మన్మథుఁడు, 66. అమరేంద్రునెచ్చెలి = ఇంద్రుని మిత్రుఁడగు మన్మథుఁడు, ఉప్పతిల్లఁగా = కలుగఁగా. వయ్యము = వ్యర్థము, నిలింపులు = దేవతలు, బెగ్గిలఁగా = భయపడఁగా. 67. స్థావర...భవ = పార్వతి, హేవాకప్రౌఢి = తెలివిడియందలి గొప్పతనము. 68. పద్మ...ప్రతతి = కెంపులనగలగుంపు, ప్రవాళములు = చిగుళ్ళు. 69. వ్రేప = బరువు, నడతీవ = నడుచుచున్నతీగ, 70. అచలభావంబు = చలనములేనిస్థితి, అభవుమ్రోల = శివునియెదుట. 71. (ఇచట 'చిమ్ము' అను పాఠముకంటె 'చోఁపె' అనుపాఠమే యుచితముగ నున్నది. చోపె=పాఱఁద్రోలెను.) 73. సముజ్జ్వల...శము = మిక్కిలి ప్రకాశించు కోటిమెఱుపుల కాంతి కలది. 74. అసదునడుము = సన్నని నడుము. 75. పాద...కంబు = పాదపద్మద్వయము, శ్రవోవతంసము = కర్ణమునకు ఆభరణమైనది, అంధకారి = శివుఁడు. 76. అన్యథాత్వము = వేఱు విధముగానుండుట. 77. పంచశరుండు = మన్మథుఁడు, బాణవిమోక్షణము = బాణమును విడుచుట, ఉరరీ...ధుర్యుఁడై

= అంగీకరింపఁబడిన దేవకార్యమును నిర్వహించువాఁడై. (ఇచట 'చెంత నురరీకృత—' అనుదానికి "చెంతను స్వీకృత" అనుపాఠాంతరము కానవచ్చుచున్నది.) 78. పసని పయ్యెద = బాగైనపైఁట, ప్రసన్నమైన = మనోజ్ఞమైన, పద్మబీజమాల = తామరపూసలదండ. 78. అక్షమాల్యంబు = జపమాల, ఇంచువింట = చెఱకువింటియందు. 79. శమనారాతి = యమునిశత్రువగు శివుఁడు, నివృత్తధైర్యుఁడు = తొలఁగిన ధైర్యము కలవాఁడు. 80. భావంబుకీలు = చిత్తవృత్తిలోని మర్మము, కేకరాలోకనంబులు = కడకంటి చూపులు, కెల్లుమలఁగి = మరలిపోయి. 81. అతర్కితంబు = ఊహింపనిది, వదియించి = బిగియఁబట్టి, చేతోవికారంబు = మనోవికారము, దిశాంచలంబులు = దిక్కుల చివరి భాగములు, ఆనతాంగుండు = వంచఁబడిన శరీరముకలవాఁడు, ఆకుంచిత = కొంచెము వంచఁబడిన, ప్రహారోద్యుక్తుండు = కొట్టుటకు సిద్ధపడినవాఁడు, తపఃపరామర్శము = తపోభంగము, భ్రూభంగదుష్ప్రేక్ష్యము = బొమముడిపాటుచేఁ జూడశక్యముకానిది, కృపీటయోని = అగ్ని, మీనకేతనుఁడు = మన్మథుఁడు. 83. బిట్టు = శీఘ్రముగా, ప్రబలాభిషంగము = తీవ్రమగు సోకుడు, ఆమని = వసంతుఁడు, చారు = అందమైనది, నిర్విణ్ణభావ = దుఃఖముచే క్రుంగినది. 84. ఉన్మీలితంబులు = తెరువఁబడినవి. 85. నెఱజాణలు = నేర్పరులు, చిక్కనివారు = గట్టివారు, మినిమింతురాలు = అలసినది, మృగేక్షణలు = స్త్రీలు. 86. ప్రతికూలాచరితంబు = విరుద్ధమగు (ఇష్టములేని) పని, అధ్వాన్నపుంబట్టు = దిక్కులేనిస్థితి. 87. గోత్రస్ఖలనంబులు = ప్రసంగవశమునఁ బొరపాటున ఇతరస్త్రీల ప్రస్తావనతెచ్చుట, జఘనసూత్రము = మొలనూలు, (ఈపద్యములోని రెండవ యర్ధభాగమునకును "తలఁతె, మదీయవసంతోత్పలకలికా బంధనంబుఁ దత్స్వమయములన్" అను పాఠాంతరముకలదు. అదియే సరియైనపాఠము.) 88. పయోధరవేళ = మేఘము లావరించిన సమయము, ఇఱుఁజీఁకటినిశలు = దట్టమైన చీకటిగలరాత్రులు. 89. బింబాధరలు = స్త్రీలు, విడంబనములు = అనుకరణములు, ఉడువల్లభుఁడు = చంద్రుఁడు, మధుమాధవములు = చైత్ర వైశాఖములు. 90. భేషజంబు = యథార్థముకానిమాట. 91. నిసర్గము = స్వభావము, భువనంబులు = లోకములు, ప్రణిపాతము = కాళ్లపైఁబడుట, ఆర్తవంబు = ఋతుసంబంధమైనది, పతంగమార్గము = సూర్యమార్గము, ఇంగలంబు = అగ్ని. సుహృదీశ్వరుండు = ఉత్తమమిత్రుఁడు, భ్రూభంగము = బొమముడిపాటు, వెచ్చి = కాఁగి, పరిదేవనము = వాపోవుట, తూఱనాటుట = చొచ్చుకొని నెలకొనియుండుట, నొచ్చి = బాధపడి, ఊరార్చుట = ఊఱడిం

చుట, 92. అళటుప్రదేశంబు = పెడతల, తాటంకయుగళంబు = కమ్మలజత, ఆక్రోశ...వ్రాతంబు = నిందాపూర్వకముగ వాపోవుచుఁ బలికిన అక్షరముల గుంపు, హరినీలములు = ఇంద్రనీలములు, ముఱిసిపడఁగ = మిట్టిపడఁగ, వీఁగుఁ జనుదోయి = నిక్కు స్తనద్వయము, అడిచికొనుచు=కొట్టుకొనుచు, సంబెరంబు= నివాపాంజలి. (ఇచట 'అమలిన వసంతుసెదుట' అనుటకు 'అప్పుడు వసంతు సెదుట' అను పాఠాంతరము కలదు. అదియే మేలైనది.) 93. రామ = యువతి, అవని = వసంతము, అధికము, ఆర్తి = దుఃఖము, కపోతకర్బురంబు = పావురము వలె చిత్రవర్ణములు కలది. బిసతంతుగుణంబు = తామరతూటి దారము నారిగాఁ గలది. కోదండంబు = విల్లు, జగశ్శెట్టి = మహావీరుఁడు, సంపాతాహతంబు = వీచుటచేఁ గొట్టఁబడిన, (ఇచట జోరుగా వీచు గాలిచే నార్పఁబడిన - అనియర్థము ) పాడి = ధర్మము, విభావసుఁడు = అగ్ని. 94. తమ్మితేనె = తామరపూఁదేనె, సహకారమంజరి = తీయమామిడిపూగుత్తి, వలరాజు = మన్మథుఁడు. 95. తెంపు = సాహసము, కనకగర్భుఁడు = బ్రహ్మ, రోసి=ఏవగించి. 96. అంబిక= పార్వతి. 97. వ్యవసాయము = ప్రయత్నము, మందీభవింపఁజేసెను = తగ్గించెను, శంబరారి = మన్మథుఁడు. 98. ఏణాంకుఁడు = చంద్రుఁడు, వైరి... కుశ ! = శత్రువులనెడి భద్రజాతిగజములకు అంకుశమైనవాఁడా! 100. ధీచతుర్వక్త్ర ! = బుద్ధియందు బ్రహ్మయైనవాఁడా!

## చతుర్థాశ్వాసము

పద్యము. 1. దర్వీకరభూషణుఁడు = నాగభూషణుఁడగు శివుఁడు. 3. అసమశరుఁడు = మన్మథుఁడు, చెలువు = చక్కఁదనము. 4. అవంధ్యప్రతిజ్ఞ = వ్యర్థముకాని ప్రయత్నముకలది. (ఇచట 'తపస్సమాధి వశంబున సుధాకరకళాధరు వరించునదియై మేనకాదేవికి నిజాభిప్రాయం బెఱింగించిన' అని పాఠాంతరము కలదు.) 5. సమీప్సితదాతలు = కోరినవరముల నిచ్చువారు, పటుసాహసిక్యము = గొప్పసాహసము, తక్కు = విడువుము, మధువ్రతంబు = తుమ్మెద, విహగము = పక్షి. 7. ఈప్సితార్థంబు = కోరిన కోరిక, నిమ్నము = పల్లము, ఓడిగిలు=ప్రవహించు. 8. ఫలోదయాంతంబు=ఫలసిద్ధికలుగువఱకును జరుగునది. 9. దిగఁద్రావి= తీసివైచి, పయో...సంహతులు= స్తనమండలపు ఔన్నత్యముచే శిథిలమైన (సడలిన) కూర్పులు, మహీరుహవల్కలంబులు=నారచీరలు. 10. చంచ...చ్ఛాయ= ఆడుతుమ్మెదల రెక్కలకాంతి, గౌరి=పార్వతి. 11. మౌంజి=ముంజత్రాటితోనల్లిన మొలనూలు, కందుకక్రీడ = బంతియాట, గారాబు = ఇష్టము, అక్షమాల=

జపమాల, అంగకాంగములు = మైపూఁతలు, ధవళభూతి = తెల్లనివిభూతి, గంత = బొంత, పులి...సంబు = పులిచర్మము. 12. తలాడ = తలగడ, స్థండిలము = ఉత్తనేల. 13. శతవృద్ధులు = నూతేండ్ల ముదుసలులు. ధరశిఖరంబు = పర్వతాగ్రము, అరణ్య...దానంబు = అడవిలోని తిండిగింజల నిచ్చుట, కృష్ణా...వతి = జింకచర్మము ఉత్తరీయముగాఁగలది, భసితా...స్నాన = భస్మముచే అభ్యంజన మంగళస్నానము చేసినది, కాంక్షితంబు = కోరిక, కడఁగానక = నెఱవేఱక, తెంపు = సాహసము, అర్కమండలంబు = సూర్యమండలము, పక్ష్మ...స్థితంబులు = కనురెప్పలయందు క్షణకాలముండునవి, పయో...తంబులు = ఉన్నతస్తనములపైఁబడుటవలన శిథిలములైనవి, స్ఖలితంబులు = జాఱినవి, తోఁగి = మునిఁగి, ఇవతాళించు = మిక్కిలి చల్లనగు, అంబుచుళుకంబులు = పుడిసెళ్లతోఁబట్టు నీరు, ఉడుపతికరంబులు = చంద్రకిరణములు, సురకరువలి = సుడిగాలి, డుల్లిన = రాలిన, జీర్ణతరుపర్ణంబులు = చెట్లపండుటాకులు, దుష్కరంబు = మిక్కిలి కఠినము. 15. అజినా...రుండు = కృష్ణాజినమును, పాలాశదండమును ధరించినవాఁడు, ప్రౌఢ...ల్భుండు = ప్రౌఢముగా మాటలాడుటలలో గొప్పనేర్పరి, నీరజ...తేజుఁడు = సూర్యుని తేజములో సరియగు తేజస్సుకలవాఁడు, జటా...మూర్ధజుఁడు = జడలగుంపుయొక్క కాంతిచే ఎఱ్ఱనైన కేశములు కలవాఁడు, ఏకాకి = ఒంటరి, వనాంతంబు = వనమధ్యభాగము. 16. కలిత...గ్రంథి = సుకుమారమగు దర్భముడితోఁ గూడినది. 17. బహుమానపురస్సరంబుగా = సగౌరవముగా, కొండరాచూలి = పార్వతి, మెయివడిచూపు = సౌమ్యమైనచూపు, ప్రస్తావోచితంబుగా = సందర్భానుసారముగా. 18. సలిలంబు = నీరు, త్రిషవణ...క్షమంబు = మూఁడుసంధ్యలయందును స్నానముచేయుటకుఁ దగినది, ఇధ్మ...బులు = సమిధలు, దర్భలు, చిగుళ్లు, సత్త్వంబులు = జంతువులు, ఆయితము = సిద్ధము, నీవారపాకాది = నివ్వరి ధాన్యము మున్నగునవి, ఆగ్రహము = పట్టుదల, తామ్ర = ఎఱ్ఱని, ఆద్యము = ప్రధానము. 19. ముకుళంబులు = మొగ్గలు, పగ...మ్మోవి = పగడమువలె ఎఱ్ఱనైన పెదవి. 20. రంకు...కంబులు = మదించిన జింకపిల్లలు, జంకింపవుగా = బెదరింపవుగదా! 21. అభ్ర...తంబు = ఆకాశమునుండి జాఱిపడునది, అమరతటిని = ఆకాశగంగ, ధరణీధరరాజు = హిమవంతుఁడు. 22. సాప్తపదీనంబు = ఏడుపదములతో (మాటలతోఁగాని, అడుగులతోఁగాని) ఏర్పడునది, హెచ్చుకుందాడుట = ఎక్కువ తక్కువలు పలుకుట. 23. ప్రభవించితి = పుట్టితివి, సడి సన్నదానవు = పేరుపడినదానవు, అనశ్వరంబు =

నశింపనిది-స్థిరమైనది, నిరవధి = హద్దులేనిది, అత్యాయతంబు = మిక్కిలి విస్తారమైనది, భ్రాంతి = దుర్లభము, మనోరథము = కోరిక, డయ్యించుకొనఁగ = శుష్కింపఁజేసికొనుటకు, విచారమార్గంబు=ఆలోచనపద్ధతి. 24. వార్ధకము = ముసలితనము. వృథా = వ్యర్థము, అన్వేషింపఁబడును = వెదుకఁబడును, కలిమా...శంబు =వరిధాన్యపు చివటివలె పచ్చనిది. 25.తపోఽభిమానము=తపస్సునందలి పట్టుదల. 26. మిథ్యావటుఁడు = కపటబ్రహ్మచారి, వయస్య = చెలికత్తె, కాల...నివర్తితంబు = శివుని కఠినమగు కంఠధ్వనివలన మళ్లింపఁబడినది, పుష్పచాపుఁడు = మన్మథుఁడు, లలాట...లక = నొసటియందలి గంధముచే బూడిదరంగు కల ముంగురులు కలది. తుహిన...తలంబు = మంచుసమూహముతో గూడిన రాళ్లు కలది, ధృతి = సుఖము, దిగీశులు = దిక్పతులు, ఉజ్జగించి = విడిచి, వనాంతసఖులు = అడవిలోని చెలికత్తెలు, వగపించుచు = దుఃఖింపఁజేయుచు, త్రిభాగశేషంబులు=మూఁడవవంతు మిగిలినవి, భర్గుఁడు=శివుఁడు. 27. రాగము= అనురాగము, తరళాయతాక్షి = చలించుచు, విశాలములై యున్న కన్నులుకలది. పురశాసనుపాణి=శివునిచేయి, పరిగ్రహించుట=పట్టుకొనుట, మ్రొగ్గిన = వంగిన, (మ్రోఁగిన - అనుపాఠ ముచితముకాదు.) 28. రాయంచ...జీర = అంచులపై రాజహంసల బొమ్మలుకలచీర, జోక = సరియైనది, భసితము = విభూతి, ముద్రితంబు = గుర్తులుగలది. రుద్రభూమి = శ్మశానము, గ్రైవేయకంబు = కంఠహారము, పెంజిలువపేరు = పెద్దపాములహారము, మనువు = మగఁడు, నగరె = నవ్వరా? ముదిగోద = ముసలియెద్దు. 29. అంధపరంపర = శతాంధాః కూపం ప్రవిశన్తి అనున్యాయమున నొక గ్రుడ్డివాఁడు నూతిలోఁబడఁగా వాని ననుసరించి మిగిలిన యంధులును అనాలోచితముగ అందులోఁబడుట; వెడఁగవై = మూర్ఖురాలవై. 30. పోలదు=సాధ్యముకాదు, చేపట్టఁడు = గ్రహింపఁడు, కలకల్మి = ఉన్న సంపద, బైసి = గౌరవము. 31. వధ్యుఁడు = చంపఁదగినవాఁడు, తివియుట = గ్రుచ్చుట, వాఁడికొఱ్ఱు = వాఁడియైనకఱ్ఱ, యూపసత్క్రియ = యజ్ఞమునందలి యూపస్తంభపుగౌరవము. 33. పదిగ = గట్టిగా - అధికముగా, (ఇచటి 'పదిగ' అనుదానికి 'వడుగ' అని పాఠాంతరము. వడుగ = ఓబ్రహ్మచారీ!) ఆలముచేసి = చులకనచేసి, ఎమ్మెయిన్ = ఏవిధమునైనను, తొరంగఁగన్ = విడుచుటకు. 34. కెంపు = ఎఱుపు - కోపము, సూకుండు = త్రోయుఁడు. 35. అలుక = కోపము, తుషారశైలసుత = హిమవత్పుత్రిక-పార్వతి, నాలుగేన్ = నాలుగైదు, మలఁగి = వెనుదిరిగి, శఠుఁడు = మోసగాఁడు. 36. మహేశానుండు = మహేశ్వరుఁడు, ధాత్రీ......త్యము = పార్వతి, వ్రీడా = సిగ్గు,

ప్రమోదము = సంతోషము. 37. అరుదు = ఆశ్చర్యము, అమ్ముడుపోయితిని = విక్రయింపబడితిని, వరవుడను = సేవకుఁడను, వేదనాభరము = ఎక్కువబాధ, భావము...చుఁ=మనస్సులో సంతోషించుచు. 38. దేవరకు='తమకు' అనుట, ఏను=నేను, పితృపరాధీనను = తండ్రికి లొంగియున్నదానను. 39. అమృతకర మౌళి = శివుఁడు, తారగిరి = కైలాసపర్వతము, సప్తమునులు=కశ్యపుఁడు, అత్రి, భరద్వాజుఁడు, విశ్వామిత్రుఁడు, గౌతముఁడు, వసిష్ఠుఁడు, జమదగ్ని అనువారు, అరుంధతీసంయుతముగ = అరుంధతీదేవితోఁగూడ. 40. భాసందోహము=కాంతి సమూహము, సూర్యచంద్రరుచులు=సూర్యచంద్రుల కాంతులు, శ్రీకంఠుఁడు = శివుఁడు. 41. చదురు=నేర్పు, సంయములు=మునులు, సంభావన = గౌరవము. 42. అఘమర్షణస్నానము=పాపములు పోవుటకై అఘమర్షణమంత్రములు పఠించుచుఁ జేయుస్నానము, అహరహంబు=ప్రతిదినము, భానుమంతుఁడు=సూర్యుఁడు, ఉర్వి=భూమి, ఉదధి=సముద్రము, సర్గము=సృష్టి, గగనమునులు = దివ్యమునులు, ఏడువురు=ఏడుగురు, కందర్పశాసనుండు=శివుఁడు. 43. అంధకారి=శివుఁడు. 44. దారపరిగ్రహమువెంట=వివాహమునందు. 45. సంప్రరూఢము = దృఢమైనది, శర్వుఁడు=శివుఁడు, వెఱ=భయము, అనంగుఁడు=మన్మథుఁడు, నిర్వృతి=ఊఱట, (ఇచట 'తపంబు పండినఁ' అను పాఠముకంటె 'కతంబు వచ్చినఁ' అను పాఠమే మేలైనది. కతంబు=జాడ [సూచన]) 46. కంట...భాగులు=గగుర్పాటుపొందిన కపోలములు కలవారు, భువనాధ్యక్షుండు=లోకములకుఁ బ్రభువు, మనోరథాగోచరంబు=కోరికల కందనిది, సోమార్కులు=చంద్రుఁడును, సూర్యుఁడును, చక్కి=చోటు, సంస్మరణానుగ్రహంబు = స్మరించుట యను కనికరించుట, సంభావనా=గౌరవించుట, ప్రత్యయంబు = నమ్మకము, యుష్మ...వంబు = మీరు తలఁచుటవలనఁ గల్గినది, ప్రమోదభారంబు = ఆనందాతిశయము, అంతరంగంబులు=మనస్సులు, అంతికోపస్థితులు = దగ్గఱకువచ్చినవారు. 47. శశాంకరేఖ = చంద్రరేఖ, దీధితిసమాజము=కాంతిసమూహము, లలాటలోచనుఁడు = శివుఁడు, పురణించు=సరిపోలునట్టి. 48. ఏకృతులను=ఏపనులయందును, మన్మహామూర్తులు=నాయొక్క మహాస్వరూపములగు అష్టమూర్తులును – (పంచభూతములు, సూర్యచంద్రుఁడు, యజమానుఁడు – అనునవి.) భువన...బునక = లోకములను రక్షించుటయను కార్యమునకే. 49. విప్రకృతులు = అపకారముపొందినవారు, బందివేల్పులు = నిర్బంధముననున్న దేవతలు, మత్ప్రసూతి = నాసంతానము, వారివాహంబు=మేఘము, ఘనవృష్టి=గొప్పవర్షము. 50. సంఘటింపవలయు = కూర్పవలెను, వసుం...ధూర్వహుండు=భూభారమును మోయువాఁడు, భవత్ప్రణిహితం

బులు=మీచేఁ జెప్పఁబడినవి, పురంధ్రీజనంబులు = స్త్రీజనులు, విస్రంభగంభీరంబుగా=నమ్మకముచే గంభీరముగానుండునట్లు. 51. సమస్త...ద్యుఁడు=యోగిజనులందఱిలోను మొదటివాఁడు, సురమహర్షి వరేణ్యులు = దేవమునిశ్రేష్ఠులు, ప్రాక్తనులు=ప్రాచీనులు, పరి...సంభవంబు = వివాహసంబంధమువలనఁ గలిగినది. 52. అంబరమార్గంబు=ఆకాశమార్గము, డాయంజని=సమీపించి. 53. ఇందుబింబంబు=చంద్రబింబము. 54. పాదన్యాసములు=పాదముల నుంచుటలు, ధరిత్రి=భూమి, (ఇచట 'అంభోదాకారముతోడి' అనుదానికి బదులు 'అంభోదాధ్వంబుననుండి' అనుపాఠమును గ్రహింపవలెను. అంభోదాధ్వంబు=ఆకాశము.) అర్ఘ్య...బ్జుఁడై=అర్ఘ్యముతో నిండిన - పద్మములవంటి హస్తములుకలవాఁడై. 55. ధాతు...ధరుఁడు=గైరికాదులే యెఱ్ఱని పెదవులుకలవాఁడు, దేవ...భుజుఁడు = దేవదారు వృక్షములు భుజములుగాఁగలవాఁడు, సానువు=చరియ, వటస్కంధుఁడు = మఱ్ఱిచెట్టు మూఁపుగాఁగలవాఁడు, మంచు...రాజు=హిమవంతుఁడు. 56. విధిమార్గము=నియమపద్ధతి, వీసరపోకుండ = వెలితిపడకుండ, అల్లన = మెల్లఁగా, గాఢ...కాయు = ఎక్కువవినయముతో వంచఁబడిన పూర్వ (మీఁది) దేహముకలవాఁడు, మొగిచి=జోడించి, యావదర్థపదంబు = సంపూర్ణమగు నర్థముకల పదములుకలది. 57. అప...ద్భవంబు = మేఘములులేకుండఁగనే కలిగినది, అనధి...జాలకంబు=పూవులసమూహము లేకుండ సంభవించినది, తారసిలుట = వచ్చుట. 58. పావనుఁడను = పవిత్రుఁడను, అంఘ్రులు = పాదములు, మూర్ధము = తల, అభ్రగంగ = ఆకాశగంగ. 59. స్థావరంబగు మేను = పర్వతరూపముననున్న దేహము, (ఇచట 'కతికృతార్థతఁబొంద' అనుదానికి 'కల్మికృతార్థత' అను పాఠాంతరమును గ్రహింపవలెను, జన్మకల్మి = జన్మపొందుట, కృతార్థతన్, కడఁగంటి = కృతార్థత్వమును పొందితిని.) కానఁబడసి = చూడఁగలిగి, యుష్మత్...షంబు=మీ దయవలనఁ గల్గిన సంతోషము, కలు...లంబు = పాపములను నీళ్ల సమూహము. 60. పర్జన్యము= మేఘము, ఎన=సమానము, శీతాచలేంద్రుండు=హిమవంతుఁడు, ఇనుమాఱ్=రెండుసారులు. 62. ఉల్లము=మనస్సు, అఖర్వములు=ఉన్నతములైనవి. 63. భూభువనంబు=భూలోకము, భుజంగమశేఖరుఁడు=ఆదిశేషుఁడు, మృణాళపేశలంబు = తామరతూఁటివలె మృదువైనది, ఇడి=ఉంచి, తిర్య...స్థానంబులు=అడ్డముగను, మీఁదుగను, క్రిందుగను ఉన్న ప్రదేశములు, విష్వక్సేనుఁడు=విష్ణువు. 64. సుధాధాముఁడు=చంద్రుఁడు, అవని ప్రధానంబులు=భూమి మున్నగునవి, ఏకతంబున=ఏకాంతముగా, సూక్ష్మేక్ష = సూక్ష్మదృష్టి, పునరావృత్తిశూన్యకము=పునర్జన్మములేనిది. 65. తలిరుఁబోఁడి =

యువతి-పార్వతి, అమరులు=దేవతలు, గురుండవు=పూజ్యుఁడవు, అఖిలపతి=సమస్తమునకును ప్రభువగు శివుఁడు, రాజబింబాస్య = చంద్రబింబమువంటి ముఖము కలది-పార్వతి, అద్రికులము=పర్వతకులము, సకల...భవన = యజ్ఞాంగములగు వస్తువు లన్నింటికిని పుట్టినచోటయినవాఁడా! 66. సంధాతలు = సంబంధము కూర్చువారు, గౌరి=పార్వతి. 67. దేవర్షి=అంగిరసుఁడు, మధురవ్యాహారము = మధురమైన సంభాషణము, లజ్జాభరంబు = ఎక్కువసిగ్గు, మౌగ్ధ్యంబు = ముగ్ధత, నమ్ర...జాత = వంగిన ముఖపద్మముకలది, అల్లనల్లన = మెల్లమెల్లగా, పాణి...బులక్ = విలాసార్థము చేతియందున్న తామరపూవుయొక్క దళములను. 68. భూమిధరరాజు=హిమవంతుఁడు, సద్గేహినులకు = ఉత్తమమైన గృహిణులకు. 70. సర్వ...ణ్యుఁడు = సర్వలోకములకును దిక్కయినవాఁడు, అమృతాంశుమౌళి = చంద్రశేఖరుఁడు, అర్థులు = కోరువారు, శిరోమణి = ముఖ్యురాలు, త్రిలో...వినుత = ముల్లోకములచేఁ గొనియాడఁబడునది, గృహమేధి = గృహస్థు, అబ్జ...లికి=అరుంధతికి. 71. ఈప్సితార్థము=కోరినవస్తువు, అంజలిపాణి=చేతులు దోయిలించినది. 72. అభి...హాల=కోరినవరము లభించుటవలనఁ గలిగిన వేడుకకలది, హంసగమన=హంసనడకలుగల పార్వతి, వినిశ్చితకార్యులు = నిశ్చయింపఁబడిన కార్యముకలవారు, ఆమంత్రించి = పిలిచి, సిద్ధంబైన = నిశ్చితమైన, పశుపతి = శివుఁడు. 73. ఓషధీనాథుఁడు = చంద్రుఁడు, జామిత్రగుణము = కళత్రస్థానగుణము, సంధిల్లుచుండ=కూడుచుండఁగా, ఉద్వాహకల్యాణము = వివాహమంగళము. 74. కౌతుక...నికాయము = వేడుకలసందడిలోనున్న స్త్రీలసమూహము కలది, అనుపమస్ఫూర్తి = సాటిలేని ప్రకాశము, సాను...పురంబు = హిమవంతుని పట్టణము - ఓషధీప్రస్థము. 75. సంతానక...తంబు = సంతానకవృక్షముల నీడలతోఁగూడిన రాజవీథులచేఁ బ్రకాశించునది, చీనాంశుకోత్తమము=మేలిరకపు పట్టువస్త్రము, కేతుమండనంబు=పతాకలు అలంకారములుగాఁ గలది, కాంచనతోరణావళి=బంగారుతోరణములగుంపు, మేళనము = కలయిక, ఉత్తేజితమిహిరదీప్తి=ఉజ్జ్వలముగాఁ జేయఁబడిన సూర్యకాంతి కలది, సందానితము=కూర్పఁబడినది, అంగనాశ్రేణిభరితము=స్త్రీలగుంపుతోఁగూడినది, విలో...కరము=కన్నులకు సంతోషమును కలిగించునది. 76. హిమ...వర్తి=హిమవంతుఁడను పర్వతరాజు, నందనులు=కుమారులు, ఉమబోటి=పార్వతి. 77. అంకము=తొడ, మండనంబు=నగ, ఊడ్చి=తీసివేసి, ఒక్కపగిది=ఒకేవిధము. 78. మైత్రముహూర్తంబు = సూర్యసంబంధమగు ముహూర్తము, మత్తకాశిని = యువతి - పార్వతి. 79. గౌరసిద్ధార్థములు=తెల్లావాలు, ఆత్మముఖంబు = తన్ను రక్షించు

కోసు బాణము, నైపథ్యము=అలంకారము. 80. కంకపత్రము=బాణము, కెంగేలు=ఎఱ్ఱనిహస్తము, గిరినందన=పార్వతి, శశికళ = చంద్రకళ. 81. లోధ్రకల్కంబు ఒక సుగంధద్రవ్యము, అపనయించి=పోవునట్లుచేసి, అశ్యామము = మిక్కిలి నల్లనిది, అంగరాగాలేపము = మైపూఁత, సంతరించి = కూర్చి, మడుగుటొల్లియ=పరిశుద్ధమగు పలుచనిచీర, నిర్ణాభిబిలముగా = బొడ్డుకానరాకుండునట్లు, నెటిక=పట్టుపావడ, చలువనెలవు=చల్లఁదనమునకు స్థానము, ముత్యాలచవికె = ముత్యాలమండపము, శశికాంతపీఠి = చంద్రకాంతములతోఁ దయారైన పీఠము. 82. విశుద్ధగాత్రి=పరిశుద్ధమగు దేహముకలది, గృహీత...వసన = ప్రఫుల్లకాశ=వికసించిన రెల్లుపూలుకలది, వసుంధర=భూమి, అభిరామంబు=మనోహరమైనది, వితానవంతము = మేలుకట్టుకలది. కౌతుకవేది = వివాహవేదిక. 83. అగరు...ధూపము=అగరుధూపసమూహముచే తడియారినది, అంతర...మాల్యము=ధరించిన (ముడిచికొన్న) పూలమాలలుకలది, అవిమనోజ్ఞంబు = తుమ్మెదలవలె ఇంపైనది, ధమ్మిల్లము=కేశపాశము. 84. గోరోచనాపత్రకములు=గోరోచనములతో వ్రాయఁబడిన మకరికాదిపత్రకములు, కరము = మిక్కిలి, సైకతములు = ఇసుకతిన్నెలు. 85. తమ్మి=తామరపూవు, జలదము=మేఘము. 86. సైరంధ్రి=చేటి, లోధ్ర...రూక్షంబు=లొద్దుగవలె నెఱసై కఱకైనది, కపోలభాగంబు=చెక్కిలి, కర్ణావతంసంబు=చెవికినగ, యవప్రరోహంబు = వరిమొలక, చంచలాపాంగి = చలించు క్రేగంటిచూపులుగల యువతి, అంబిక = పార్వతి, నెట్టుకొని = అతిశయించి, శాతోదరి = కృశించిన కడుపుకలది, వనిత, కళింద...మంతములు = యమునానదియందలి నల్లకలువల రేకులకాంతివంటి కాంతికలవి, కాలాంజనంబు = నల్లనికాటుక, సందోహంబు = సమూహము, మందాకిని = గంగానది. 87. హరితాళము = హరిదళము, మనశ్శిల = మణిసిల, తోఁచి = ముంచి, అవిహతలీల = చెరిగిపోనివిధమున, ముకురము = అద్దము, అమలము = నిర్మలము. 88. దంత...బ్భాసి=దంతముతోఁ జేయఁబడిన చెవికమ్మలనెడి నగలతోఁ బ్రకాశించునది, ఆననాంభోజము=ముఖపద్మము, మలయజంబు = చందనము. 89. స్తనోద్భేదనంబు = కుచములు పొటమరించుట, ఆదిగా=మొదలుకొని, అధిష్ఠా...సన్నివేశంబు=వేఱొకచోటనుంచఁబడినది, ధాత్రీప్రతి సార్యమాణంబు = పెంపుడు తల్లిచే అందించఁబడినది, ఊర్ణా...సూత్రంబు=ఉన్నితోఁజేయఁబడిన దీక్షాబంధము, బాష్పకలలోచన=కన్నీళ్లతో నిండిన కన్నులుకలది, నవఫేనపుంజ = క్రొత్తనురుగుగుంపుకలది, దుగ్ధాబ్ధివేల=పాలసముద్రపుటొడ్డు, పట్టుపుట్టంబు=పట్టువస్త్రము, అఖిల...వృత=సమస్తపరివారముతోఁ జుట్టుకొనఁబడినది, మహోక్షలాం

భవుఁడు=శివుఁడు. 90. సంపాదించె=కూర్చెను, భసితాంగరాగంబు = విబూది మైపూఁత, వెలఁచి=శుద్ధిచేసి, భిక్షాకరోటిక=భిక్షాపాత్ర, దువ్వలువ=కట్టుబట్ట, ఇఱ్ఱి=జింక, కైసేసె=అలంకరించెను, ఆకల్పపంక్తి = ఆభరణముల సమూహము, భూషావ్రజంబు=నగల సమూహము, ఆదికాలంబు=పూర్వమనుట, సవదరించె = అలంకరించెను, సమ్మోదము=సంతోషము, ఆవహిల్ల=కలుగఁగా. 91. భసితంబు= విభూతి, అంగరాగము=మైపూఁత, విభ్రమము=విలాసము, వొఱ్ఱిలు=ప్రకాశించు, భోగిభోగంబులు=పాముపడగలు, చందంబు=విధము, హరి...గరిమ = హరిదళపు తిలకపు గొప్పతనము, దీటుకొనఁగ = నిండుకొనఁగా, శైశవంబు = పసి తనము, చూడామణిత్వము = శిరోభూషణముగా అగుట. 92. గంగాధరుండు= శివుఁడు, గణోపనీతంబు = ప్రమథగణముచేఁ దేఁబడినది, పల్యాణబంధము = జీను, పరివేష్టింప = చుట్టును జేరియుండఁగా, త్రయస్త్రింశత్కోటి = ముప్పది మూఁడుకోట్లు, సహస్రరశ్మి = సూర్యుఁడు, విధాత = బ్రహ్మ, కలహాశనుఁడు =నారదుఁడు, జలధరంబులు = మేఘములు, పొలయించుట = సంచరింపఁ జేయుట - పరుగిడునట్లుచేయుట, చామీ...ణంబులు = బంగారు చిఱుగంటల ధ్వనులు, నగేంద్రగుప్తంబు = పర్వతరాజగు హిమవంతునిచేఁ పాలింపఁబడునది. 93. వన...రాజి=మదించిన యడవియేనుఁగుల సమూహము, అధిక...హననుల్= ఎక్కువైన వ్యాయామముచే హెచ్చయిన దేహముకలవారు, మేదినీధరములు = పర్వతములు, తీహారగిరీశ్వరుండు=హిమవంతుఁడు, సుమనః...హరుఁడు=శివుఁడు. 94. పురాసురాంతకుఁడు=శివుఁడు. 95. వలిపంపుదోయి=సన్నని వస్త్రద్వయము, భవుఁడు=శివుఁడు, శ్రీకంధరుండు=శివుఁడు. 97. ఉమబోఁటి = పార్వతి, బోటి కత్తియలు=చెలికత్తెలు, కుసు...డారి=శివుఁడు, పరమేష్ఠి = బ్రహ్మ. 98. విభావ సుఁడు=అగ్ని, అహస్త్రియామంబు = అహోరాత్రములు, దాక్షాయణి = పార్వతి, నిర్వృత్త=జరుపఁబడిన, పాణిగ్రహణమహోత్సవులు=వివాహోత్సవము కలవారు. 99. పద్మాతపత్రంబు = పద్మమను గొడుగు, కమల = లక్ష్మీదేవి, కైవారము = సేవ, కాళింది=యమున, ఇఱుచక్కి=రెండువైపుల, రమణమై=ప్రీతితో, చిత్తసంభ వుఁడు=మన్మథుఁడు. 100. కందర్పుఁడు = మన్మథుఁడు, బృందారకులు = దేవ తలు, సంభావన=గౌరవము, నికుంభప్రధానములు=నికుంభుఁడనువాఁడు మున్నగాఁ గలవి, నీహారభానుమౌళి=శివుఁడు. 101. సాధ్వసము=భయము, అమందమందా క్షము = తక్కువకాని చిఱునవ్వు, నీవీబంధము = కోకముడి, కిలికించితము = ఒక శృంగారచేష్ట, శతా...రాదులు=బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుఁడు మున్నగువారు. 102. భోగీంద్రధరుఁడు=శివుఁడు, అపదానము=పరిశుద్ధవృత్తము. 103. క్షమా...కుంజ

యుఁడు=రాజశ్రేష్ఠుఁడు, ఘనసారము=కర్పూరము, సంకుమదము=జవ్వాజి, మనో...ద్రుమా!=కోరికలకు కల్పవృక్షమగువాఁడా! 105. అట్టహాసము = పెద్దనవ్వు, శంకరాచలము=కైలాసము, అమరాపగ=ఆకాశగంగ, వితీర్ణి = దానము, శస్తము = ప్రశస్తము.

## పంచమాశ్వాసము.

పద్యము. 1. కుమారశైలము=స్వామిమల, హేమాచలధీర! = మేరుపర్వతమువలె ధైర్యముకలవాఁడా! ధరి...చరిత!=భూమికి అలంకారమైన చరిత్రకలవాఁడా! 3. కుసుమకార్ముకుఁడు=మన్మథుఁడు, పారిషదవ్రజంబు=ప్రమథగణము. 4. ఆర్య=పార్వతి, పేర్మి=ప్రేమ. 5. జమిలిపాములు = జంటపాములు, సాతకంబు=సంపర్కము, త్యజించి=విడిచి, గడితంపు=చిక్కనైన, భస్మాల...పని = బూడిదను పూసికొనుపని, అనురక్తి=ప్రీతి, వర్జించి=విడిచి, చొళ్లెంబు=చుట్టగాఁ జుట్టినచుట్టు, లేఁతరిక్కలరాయఁడు = బాలచంద్రుఁడు, సమ్మదము = సంతోషము, మదనవైరి=శివుఁడు. 6. హేషమాణాశ్వములు=సకిలించుచున్న గుఱ్ఱములు, వాహ్యాళి = విహారము. 7. ఆర...హాసులు=ప్రౌఢమై, మిక్కిలి కఠినముగా నున్న నవ్వుకలవారు; ఉదం...హాసులు=ఒప్పుచున్న ఖడ్గములు కలవారు, అంగార...క్షులు=అగ్నితో సమానమగు కన్నులుకలవారు, ప్రకామ...వక్షులు = మిక్కిలి అందమై, విశాలమగు వక్షస్థలముకలవారు. కంబు...రుల్=శంఖమువలె ఇంపైన కంఠముకలవారు. 8. ప్రల్లదములు=చెడ్డపనులు, అభవులెంకలు=శివుని సేవకులు, అంకకార్లు=చలముపట్టువారు, కుటి=కుటీరము. 9. 'కుంభోద్భవుపాళెమున' అను దానికి బదులుగా 'కుంభోదరు పాళెమున' అను పాఠమున్నది. అదియే సరియైనదని పలువురి యభిప్రాయము, కులపతి=యజమానుఁడు-నాయకుఁడు, "కింకరులు గర్వ-" అనుటకు బదులు 'కింకరులఖర్వ' అను పాఠాంతరము కలదు. 10. పులికళాసంబు=పులితోలు, వ్రాతంబు = సమూహము, లాఁతాలు = లాతములు, దండములు, మోది=కొట్టి, కకసాల=సంచి, ప్రామి=పులిమి, అప్సరః పల్లవకులు=అచ్చరల విటులు, భుజంగప్రతానము=విటులగుంపు, ఆగడీలు = ఆగడముకలవారు - చెడ్డపనులు చేయువారు, ఆగడుఁగాకులు=నిందావరులు, గొంట్లు = కఠినులు, పలుగాకులు=దుష్టులు, ఉదురుమిడుకులు=దుర్వినీతులు, ఆకతాయిలు = తుంటరులు. 11. మంతనంబుండి=రహస్యముగ నాలోచించి, పొత్తు = కలిసియుండుట. 12. అసంఖ్యాత=లెక్కలేని, సంభావించుక్=గౌరవించును. 13. దుర్ద...ధింతుర్ = కష్టములు కలిగింతురు. 14. ప్రసూనము=పుష్పము, మాధ్వీ...చిత్తులు = మధు

ళ్ళు చేమదించిన మనస్సులుకలవారు. వేలుపులేములు = దేవతాస్త్రీలు. 15. ద్యావా పృథివీ=స్వర్గమర్త్యలోకములు, ధైర్త్యము = ధూర్తత్వము - దుడుకుతనము, కళి కంఠుఁడు=శివుఁడు. 16. చదలేరు=ఆకాశగంగ, నిడుపేరులు = పొడవైన హార ములు, ఆఁబోతుతత్తడి=నందివాహనము, కడియంపుఁబాములు = కడియములుగా నుండు సర్పములు, కకసాల=సంచి, భూతి=విభూతి, తమ్మి.. పుసుక=బ్రహ్మకపా లము, 18. విసువు=చిరాకు, చారజనంబులు=సేవకులనుట, వేసట=అలసట. 19. కతిపయ = కొందఱు; మామ వీడుకొనక=మామవద్ద సెలవుపుచ్చుకొనక, నభో మార్గంబు = ఆకాశమార్గము. 20. వృద్ధ...వీఁపు = ఆదికూర్మముయొక్క వీఁపు, అంఘ్రిపీఠంబు=పాదపీఠి, సుర...వెల్లి=ఆకాశగంగాప్రవాహము. (ఇచట 'వెల్లి' అనుదానికి బదులు 'వెల్ల' అను పాఠాంతరముకలదు. అప్పుడు 'తెల్ల' అనియర్థము.) శిరసుపాగ=తలపాగ, మానదండము=కొలఁతకఱ్ఱ, పూర్వా...బ్ధులు=తూర్పు, పడ మర సముద్రములు, కాత్యాయనీదేవి=పార్వతి, బేసికన్నులవేల్పు=ముక్కంటి- శివుఁడు, పెండ్లికొడుకు=అల్లుఁడు, పాలనీయము = పాలింపఁదగినది, ఓగిరంబు = ఆహారము. 21. బృందారకులు= దేవతలు, కందర్పుఁడు=మన్మథుఁడు. 22. అహీ శ్వరుఁడు=ఆదిశేషువు, అంచిత=ఒప్పియున్న, రోచి...జాలము = కాంతియొక్క ఉదయముచే తిరస్కరింపఁబడిన సూర్యచంద్రులకాంతిసమూహముకలది, కంద రా=గుహ, యవనికాయితము=తెఱగాఁజేయఁబడినది. 23. హేమశైలంబు = మేరుపర్వతము, దోగ్ధ=పాలుపితుకువాఁడు, సురభి=గోవు, 24. ఆమోదంబు = సంతోషము, నీహారాద్రి=హిమవత్పర్వతము, కాంతారము = అడవి, చాపటంకృ తులు = ధనుస్సుయొక్క టంకారధ్వనులు, గంధద్విపశ్రేణులు = మత్తగజముల గుంపులు, క్షామ...మలు=మిక్కిలి కృశించి, అందముగానున్న నడుముకలవారు, గుంజా...కృతుల్=గురివిందగింజల నగలను అలంకరించుకొన్నవారు, వ్యామ... ధరల్=బారలచే గ్రహింపఁదగిన స్తనములుకలవారు, సీమంతినుల్=యువతులు - భార్యలనుట. 25. మృడు...సాము=శివుని యర్ధశరీరమైనది, జడ...కాఁడు = సముద్రునిమిత్రుఁడు, సర్వంసహ=భూమి, నిడుగోల=మానదండము, కడలి = సముద్రము, వడఁకుంగుబ్బలి=మంచుకొండ, వసుధాధరముల్=పర్వతములు. 26. తాటంకిత=చెవికమ్మలుగాఁ జేయఁబడిన. 27. జాహ్నవి=గంగానది, ఝూత్కార ...యిత=ధ్వనిచేఁ బ్రతిధ్వనించుచున్న, గుహాకుహరము=గుహాముఖము, నిషా ణము=కొమ్ము, కోణాభిఘాతము=కోణముగాఁగొట్టుట, నీరంధ్రము=దట్టము, సంకేత ...మాన = సంకేతగృహముగాఁ జేయఁబడిన, కనక=సంపెఁగ, కేతకీ=మొగలి, క్రోడంబు=లోపలిభాగము, నఖముఖస్ఫాల్యమాన=కొనగోళ్లతో మీటఁబడుచున్న,

నిర్ణిరోధము=అడ్డులేనిది, సంబాధ=ఇఱుకైనది. 28. కర్ణికా=తామరదుద్దు, కురుంగములు=పొదరిండ్లు, చింతారత్నము=చింతామణి, ఆపగాశ్రేణి = నదులసమూహము, కదంబము=సమూహము, కామ...తోడ = కోరిన కోరికలనిచ్చు గోవుల సమూహములతో, మదనవైరి=శివుఁడు. 29. సంయమసందోహము=మునులగుంపు, పంచబాణుఁడు=మన్మథుఁడు, బృందారకసతులు=దేవతాయువతులు. 30. భ్రమరకంబులు=ముంగురులు, ప్రస్వేదకణములు=చెమటబిందువులు, నూలుకొలుప=చెదర్పఁగా, దరవిశ్లథంబు=కొంచెము శిథిలమైనది, ధమ్మిల్లము=కేశపాశము, చిమ్మ... మిడువ=చీఁకటులను తిరస్కరింపఁగా, దీప్తులు = కాంతులు, నిర్ఝరాంభస్సు = సెలయేటినీరు. 31. మఖము=యాగము, త్రేతానలము=ఆహవనీయ, గార్హపత్య, దక్షిణాగ్నులను అగ్నిత్రితయము, పాతకసంఘంబు = పాపములగుంపు, పర్యంతములు=చుట్టుపక్కలు. 32. సమ్మదము=సంతోషము, శారికలు = గోరువంకలు, ఆగమములు = వేదములు, నీలగళంబులు=నెమిళ్లు. 33. కాముకా = మన్మథుని, చీరికిఁగొనక=లెక్కింపక, ఆముష్యాయణులు=ప్రసిద్ధవంశమున బుట్టినవారు, నీవారముష్టింపచుల్=పిడికెఁడు నెవ్వరిధాన్యముతిని జీవించువారు-యోగులు. 34. పుచ్ఛములు=తోఁకలు, ప్రసువు=తల్లి, ఊధస్యము=పాలు. 35. కాయక్లేశము = శరీరశ్రమము, ఉజ్జగింతురు=విడుతురు. 37. నిలయవ్యాపారంబులు=గృహకృత్యములు, అలపులు=శ్రమలు. 38. చిఱుబంతి పసపాడి = చిన్న బం - పూరంగు పసుపుతో స్నానము చేసి, సేసబ్రుమ్ములు=పాపటకురుల ముడులు, పుట్టములు = వస్త్రములు, కంకేళి=అశోకము, చేఁతలు=చేష్టితములు - పనులు, గారవమ్మున=లాలనము. 39. నీలకంఠాంగన=ఆడునెమిలి, పుష్పాపచాయంబు=పూవులుకోయుట, ప్రసవకందుకము=పూలబంతి, పాంచాలిక=బొమ్మ, కాంచనకుంభాంబువు = బంగారు కడవల నీరు, సజ్జీకృత=సిద్ధపఱుపఁబడిన. 40. విద్యుత్కాండంబు=మెఱుపులగుంపు, వదనగహ్వరంబు = గుహావంటి నోరు, శంబరారాతి = మన్మథుఁడు, అన్వయంబులు=వంశంబులు, ఉత్పన్నంబులు=పుట్టినవి, లాంఛనంబులు = గుఱుతులు, పటలంబులు=సమూహములు, భిత్తి=గోడ, కోరకిత=ముడిఁగిన, నేత్రత్రిభాగము = క్రేగన్ను, కంకపత్రంబులు=బాణములు, అత్తమిల్లు = ఒఱఁగు, తారకరాజు = చంద్రుఁడు, చీటంబు=శృంగారచేష్ట, ధృతిమాలి = ధైర్యముచెడి, కుశికనందనుఁడు = విశ్వామిత్రుఁడు, విభాండకసుతుఁడు=ఋష్యశృంగుఁడు, వనితామండలము=స్త్రీసమూహము, ముకుందుండు=శ్రీకృష్ణుఁడు, అంబురుహాసూతి=బ్రహ్మ, ఆడుపట్టి=కుమారై-సరస్వతి; పురుహూతుండు=ఇంద్రుఁడు, గౌతమకళత్రంబు=అహల్య, చీఁకటితప్పు=జారత్వము, చేడియలు=యువతులు, కుసుమనారాచము=పుష్పబాణము, కల

మంజుఘోష=అవ్యక్తమధురధ్వనికలది, వరారోహలు=యువతులు, అలవోక=విలాసము, హాటకతులాకోటి = బంగారపుటందె, త్రిభువనంబులు = ముల్లోకములు. 41. శాద్వలంబు=పచ్చికబయలు, హరితాంకురములు=దూర్వాంకురములు, చెల్లింపన్=చేయింపఁగా, పులినము=ఇసుకతిన్నె, మాతలు = బ్రాహ్మి మున్నగువారు, కందరంబు=గుహ, కొప్పెర=కమండలువు, లాతంబు=దండము, జోగపట్టియ = యోగపట్టి, కకపాల=కక్షపాల, జాతిగా=ఘనముగా ననుట. 42. వేశవాటంబు =వేశ్యలవాడ. 4?. ప్రాలేయా...ధిపతి=శివుఁడు, ప్రమ్లోచ = ఒక యప్సరస, మోచాఫల=అరఁటిపండు, అపూప=అప్పము, తోరంబు=అధికము, నఖాంకురద్యుతులు=కొనగోళ్ల కాంతులు, మయూఖకందళము = మొలకకాంతులు. 44. రంభా=అరఁటి, ఆమ్రము=మామిడి, కామారి=శివుఁడు, రారాజుపట్టి = నలకూబరుఁడు. 45. నిక్వాణంబు=ధ్వని, రవలి=ధ్వనిచేయు, దీప్తులు = కాంతులు, వాలారుగోళ్లపై=వాఁడియైన గోళ్లమీఁద, జాలువాఱ=వ్యాపింపఁగా, అల్లన్ = మెల్లఁగా, అర్హితముగ=పూజింపఁదగినట్లు, మదనవైరి=శివుఁడు. 46. అక్షయ్యంబుగన్=సమృద్ధిగా, దాక్షాయణీభర్త=శివుఁడు, చక్షూరాగము=కనులవలన వ్యక్తమగు అనురాగము. 47. నాల్కడపుఁబేసము=కొబ్బరిగుజ్జు, తనిపండ్లు=పండిన పండ్లు. 48. భూతభర్త = శివుఁడు, చనుకట్టు=స్తనాభోగము. 49. సహజసౌజన్య = స్వభావమున మంచితనము కలది. దోర్మూ...షంబులు = కక్షముల పర్యంతము వ్యాపించి యున్నవి. 51. చిత్తభవుఁడు = మన్మథుఁడు. 52. లేఖాంగనలు=దేవస్త్రీలు, కందర్పసూదనుండు = శివుఁడు, కనకగర్భకపాలము = బ్రహ్మకపాలము, అర్ధపూర్ణంబు=సగమునిండినది, మొరయ=ధ్వనింపఁగా, మోసలలు=మొగసాలలు, వారివాహము=మేఘము, ఇసితింతలు వాఱన్=చలింపఁగా, సంయమి=ముని, పర్యటించుట=తిరుగుట. 53. దరహాసంబులు = చిఱునవ్వులు, భంగులు=విధములు, చూఱలాడెన్=దొంగిలించెను. 54. గోత్రసంభవులు=వంశోద్భవులు, అన్వయాగ్రణులు=వంశములందలి శ్రేష్ఠులు, వంశధరులు=వంశములలోఁబుట్టినవారనుట, కుల సంప్రసూతులు = కులములందు జన్మించినవారు, రజని...మౌళి=శివుఁడు, విరాళి=విరహవేదన. 55. మహోక్షలాంఛనుఁడు = వృషభధ్వజుఁడు-శివుడు, మగలకన్నుమొఱంగి=భర్తలను మోసపుచ్చి, ఎడరు = సమయము, వేచి=నిరీక్షించి, నిబిరీస=దట్టమైన, కంకేళి=అశోకము-ఉపాంత్యమీపమునందలి, మిసిమింతుఁడు=అలసటగలవాఁడు. 56. మొలదిండు=మొలకఁగట్టు కాసెకోక, చిలువపోగులు = పాములపోగులు, వలరాచనీఱు=మన్మథుని బూడిద, అలఁది = పూసికొని, శిశిరాంశుఁడు=చంద్రుఁడు, పసిండిజలపోసనము = బంగారుకొలాము,

బిస...కర్పర = బ్రహ్మకపాలపాత్రము, ఖట్వాంగపాణి = శివుఁడు. 57. మన్మథమథనుండు = శివుఁడు, కళత్రంబులు = భార్యలు, పొలివుచ్చుచు=నశింపఁజేయుచు, నిలింపమానివ్రాతంబు = దేవమునుల సమూహము, గుజగుజపోవుచు = గుసగుసలాడుచు, ప్రకాశింపంజాలక = వెల్లడింపలేక, అప్పాటన్ = అవిధముగ, చీఁకటితప్పు=చౌర్యరతము, కట్టాయితంబై=మిగుల సన్నద్ధమై. 58. మిఱుతన్= మెఱకనేలపై, కసమస=తొందర, పెలుచన్ = అధికముగా. 60. హేమాచల స్థేమా!=మేరుధైర్యముకలవాఁడా! 61. సమరఫల్గున!=యుద్ధమున అర్జునుఁడైన వాఁడా! 62. ఉన్మేలనా = కలుపుట, ఘుసృణము = కుంకుమపువ్వు, దాన... నిధీశా!=దానమునందు కుబేరుఁడైనవాఁడా!

## షష్ఠాశ్వాసము.

పద్యము 3. హేమనగంబు=మేరుపర్వతము, గండశిలాతలంబునన్=బండ పాతిపైని, అర్మిలిన్=ప్రీతితో. 4. ఇంగితంబు=అభిప్రాయము. 5. కప్పు=నలుపు, కందము=మూలము. 7. శాంభవి=పార్వతి. 8. దంభోళి=వజ్రము, నిశాతహేతి= వాఁడియైన యాయుధము, ఆఖండలుండు=ఇంద్రుఁడు, అనుమోదంబున=సంతోషముతో, ఘనమార్గంబు = మేఘమార్గము, నాకము=స్వర్గము. 9. కైవారము = సేవ. 10. క్రచ్చఱన్=వేగముగా? జంభవైరి = ఇంద్రుఁడు, వేల్పుటేఱు= ఆకాశగంగ. 11. సంక్రందనుఁడు=ఇంద్రుఁడు. 12. ఐరావణానేకపము=ఐరావతమను ఏనుఁగు. 14. అంత...సుఁడు=విద్వాంసులచేఁ గొనియాడఁబడిన వాగ్విలాసము కలవాఁడు, కృత...సుండు = ద్వంద్వము నతిక్రమించినవాఁడనుట, ప్రసూన...విన్యాసుఁడు=పూలమాలగల కాంతితోఁగూడిన పద్మములవంటి భుజములుకలవాఁడు. 15. పావడము=కానుక, హరి=ఇంద్రుడు, దర్శనంబు=బహుమానము. 16. శునాసీరుండు=ఇంద్రుఁడు, దుర్వార=వారింపరాని - అధికమైన, పట్టికాలంకారము = నొసటియందలి పట్టికకు అలంకారమైనది, కరటి = ఏనుఁగు, అలవోకయుంబోలె = నిర్లక్ష్యముగా నేమో యనునట్లు, వసుం...శౌండంబు = భూభారమును భరించుటకు సమర్థమైనది, కపోలభిత్తిభాగంబు=గోడవంటి గండస్థలము, ఉప్పరంబు=ఆకాశము, చెందిరంబు=సిందూరము, వాస్తోష్పతి=ఇంద్రుఁడు, కువిటుఁడు = ధూర్తుఁడగు విటుఁడు, హరిణి=ఆడుజింక, కైవసము = స్వాధీనము, క్రుస్సియు=కృశించియు, నొగిలియు=బాధపడియు. 17. పాటల...లుఁడు=ఎఱ్ఱనైన చెక్కిళులుకలవాఁడు, దుర్నిరీక్షుఁడు=చూడ శక్యముకానివాఁడు, ఘట్టించి =అదలించి, ఉగ్రకటాక్షంబు=వాఁడియైనచూపు, గాఢాగ్రహవ్యగ్రత=మిక్కిలి

కోపమునఁ గలఁతపడుట. 18. అహంకారంబు=గర్వము, చీరికిఁ గైకొనక=లక్ష్య
ముచేయక. 19. బౌదలఁబూనవైతి=తలపై ధరింపకపోతివి, హస్తిచేతికి=ఏనుఁగు
తొండమునకు, దండనార్హంబె=శిక్షఁబొందుటకు దగినదా? 20. తపోబాధకము=
తపశ్శక్తికి భంగముకలిగించునది, ఉద్బోధకము=వృద్ధిని కల్గించునది, వైద్యుతాగ్ని=
మెఱుపువలనఁ గల్గు అగ్ని-అగ్గిపిడుగు, ప్రభవించుట=కల్గించుట. 21. కుధరము=
పర్వతము, నాకంబు=స్వర్గము, నిశ్శ్రీకంబు=సంపద లేనిది, విజృంభణము=మిడిసి
పాటు-గర్వము. 22. వేగన్నులు = వేయి కన్నులు, సువస్తుజాతములు = మంచి
వస్తువుల సమూహములు, అంబుధి=సముద్రము. 23. ఇందిర=లక్ష్మి, అమరద్రుమం
బులు=కల్పవృక్షాదు లనునైదు వృక్షములు. 24. కంధి=సముద్రము, తారకాధీశ్వ
రుండు=చంద్రుఁడు. 26. అసహ్య=సహింపరాని, శల్యములు=ములుకులు, పూజా
వ్యతిక్రమము=అవమానము. 27. దందహ్యమానుఁడు=మిక్కిలి దహింపఁబడు
చున్నవాఁడు, వీడు=నగరము. 29. వార్ధి=సముద్రము, కుజములు = వృక్షములు,
మున్నీటినీరు=సముద్రపునీరు, ఉదధి=సముద్రము. కామధుగ్ధేనువు=కోరినకోరిక
లొసఁగు గోవు, కాదంబరి=మద్యము - సోమరసము, బ్రహ్మముని=దుర్వాసుఁడు,
ప్రథమదిక్పాలుఁడు=తూర్పుదిక్కు ప్రభువగు ఇంద్రుఁడు. 30. ఉక్కుడఁగి =
సారహీనమై, ఒప్పుదఱిగి=శోభలేక (ఇచట 'ఉక్కువడియుండె బహుకాల 'మొప్పు
దఱిగి, విగతలక్ష్మీవిలాసమై వేల్పువీడు' అను పాఠము కలదు. అదియే సరియైనట్లు
తోఁచుచున్నది.) 31. నివహంబు=సమూహము, సుధారసాశనత్వము=అమృతమా
హారముగా నుండుట, అశోక వల్కపరిధానత=అశోక వృక్షపునారతో నేయఁ
బడిన వస్త్రమును ధరించుట, నముచివిధ్వూదనుఁడు=ఇంద్రుఁడు. 32. ఇందిరావ్యపా
యంబున=లక్ష్మీదేవిలేకుండుటవలన, నగ్నాటులు = నగ్నులై తిరుగువారని యర్థ
మేమో! హాటకగర్భుఁడు=బ్రహ్మ, నలినాసనుండు=బ్రహ్మ, వెన్నుఁడు=విష్ణువు.
33. భూమి...మూర్తి!=అష్టమూర్తులు కలదేవా! 34. శుభికాలంకార=శోభన
మగు నలంకారము, ధామ=తేజస్సు. 35. దివసావసానము=సాయంకాలము. 36.
సంసృతి=సంసారము. 37. అజర!=ముదిమిలేనివాఁడా! అనవద్య = దోషములేని
వాఁడా! నిర్ద్వంద్వ!=ద్వంద్వముల కతీతుఁడైనవాఁడా!, నిజభక్తవైకుంఠ! =
భక్తుఁడగు విష్ణువుకలవాఁడా!. 38. అనుకంప=దయ. 39. అవసరము = సమ
యము, ప్రధాన=మొదలైన, సముదయంబులు=సమూహములు. 40. అరసాతల
మగ్నము=పాతాళమువఱకును మునిఁగినది, మంథయష్టి=కవ్వము, సర్వ...ప్రవ
ణుండు=సమస్తభూమిని భరించుటకు సమర్థుఁడు, దందశూకస్వామి = సర్పరాజు-
శేషుఁడు, తరువుఁద్రాడు=కవ్వపుత్రాడు, చరమాంగము=వీఁపు, కితవకచ్ఛపరాజు=

మాయాకూర్మము-కూర్మావతారమెత్తిన విష్ణువు, దనుజులు = రాక్షసులు, త్రచ్చు
వారు = మథించువారు, ఏచి=చెలరేగి, తరువ=మథింపఁగా, ప్రభవింపఁగలవు =
పుట్టఁగలవు-లభింపఁగలవు. 41. కమఠపతి=ఆదికూర్మము, భువనభారంబు=భూమిని
మోయుట, నియోగించి=నియమించి, అచ్యుతుండు=విష్ణువు, పితామహుండు=బ్రహ్మ,
మున్నాడి=ముందుగా, పాలమున్నీరు=పాలసముద్రము. 42. గండోపలము=బండ
రాయి, నిర్ఝరవేణిక=సెలయేటిప్రవాహము, ఘుమఘుమ...ఘోషము = ధ్వనిచే
వ్యాపింపఁబడిన, దిఙ్మండలముకలది, పంచాస్య...శుండాలము=సింహముయొక్క
స్పష్టమైన కంఠమునుండి వెలువడిన గర్జనచే నశించిన యేనుఁగులుకలది, సంఛన్న=
కప్పఁబడిన, హింతాలము=వృక్షవిశేషము. 43. కదియంగ=సమీపింపఁగా, ఆది
వాలితోడ=జ్యేష్ఠానుక్రమముగా అని యర్థమేమో! అంబుజోదరుండు=విష్ణువు.
44. జంభారిప్రముఖులు=ఇంద్రుఁడు మున్నగువారు, ఎడగలుగన్=నడుమ కొంత
స్థల ముండునట్లుగా. 45. నునుఁజేల=సన్ననివస్త్రము, దిండుగట్టి=పటకావలె కట్టి,
గ్రక్కతిలఁగ=బెదరఁగా(శ.ర.) ప్రతిధ్వనింపఁగా సమధిక=మిక్కిలి అధికమైన,
అవష్టంభము=ప్రయత్నము, అసియార్చె=చలింపఁజేసె, పాఁతగల్చె=మొదలు పెక
లించెను, నెఱిసు=చీలునట్లుగా, లోకైక...ధరుండు = లోకమున బరువుమోయు
టలో అద్వితీయుఁడు. 46. అంగదాభరణంబులు=భుజకీర్తులు, వజ్రాలకీలన=వజ్ర
ములకట్టు, నెట్టెంబుసుట్టిన=గుండ్రని తలపాగగాఁజుట్టిన, నెమ్మిపించము = నెమిలి
పించము. కదియకుంద=కృంగిపోకుండునట్లుగా, కల్హారముకుళంబు = కలువమొగ్గ,
శృంగారకందుకంబు=విలాసార్థమైన బంతి - ఆటబంతి. 47. గోలాంగూలము=
కొండముచ్చు, జాలింబొందె = దుఃఖించెను, ఉలాయముల్=అడవిదున్నలు, సుడి
గొనెన్=చుట్టుకొనెను, సారంగముల్=జింకలు, విచ్చిలెన్= చెల్లాచెదరయ్యెను,
కోలంబుల్=వరాహములు, పంచాస్యముల్=సింహములు, తాలాంకావరజుండు=
బలరాముని తమ్ముఁడు-కృష్ణుఁడు, ధాత్రీధరంబు=పర్వతము. 48. ఏడు పాతాళ
ములు=అతల, ·వితల, సుతల, రసాతల, మహాతల, తలాతల, పాతాళములు, మహీ
ధ్రము=పర్వతము, ఇందిరాభర్త=విష్ణువు, బ్రహ్మాండకర్పరంబు = బ్రహ్మాండమను
కొప్పెర. 49. ధాత్రి=భూమి, బాహాచతుష్టయము = నాలుగుభుజములు. 50.
నిర్జరప్రతతి=దేవతలగుంపు, అబ్జగర్భుండు=బ్రహ్మ. 51. పురందరుఁడు=ఇంద్రుఁడు.
52. అంభోధివేల=సముద్రపు టిసుకతిన్నె. 53. సైకతస్థలము = ఇసుకతిన్నె,
హేరంబుఁడు = వినాయకుఁడు, తోరమై = అధికమై. 54. ఇభరాజాస్యుఁడు=
గజాననుఁడు, అదితిప్రభవులు = దేవతలు, దితితనూజులు = రాక్షసులు.
55. భవునిపట్టి = శివుని కుమారుఁడు - వినాయకుఁడు. 56. పుండ్రేక్షులు =

హామాలచెఱకులు, నవనీతపిండములు = వెన్నముద్దలు, చోష్యములు = నమలఁ
దగినవి, లేహ్యములు=నాకఁదగినవి. 58. శోణప్రభ=ఎఱ్ఱనికాంతి, ఇందుధారి =
చంద్రుని ధరించినవాఁడు, దంతావళాస్యా!=గజాననా! నమస్యా! = నమస్క-
రింపఁదగినవాఁడా! అవశ్యాయశైలము=మంచుకొండ, భాస్వత్ = ప్రకాశించు
చున్న, భాస్వరుఁడు=సూర్యుఁడు, సంతప్త...రాభా! = పుటముపెట్టిన బంగారు
వంటి కాంతికలవాఁడా! ఆఖువు=ఎలుక, విక్రియ=వికారపుఁబని. 59. నిర్జరులు
=దేవతలు, వననిధి=సముద్రము. వారణవక్త్రుండు=గజాననుఁడు, కడఁక=పూనిక.
60. బిట్టేచి=ఎక్కువగా చెలరేఁగి, తరిత్రాడు=కవ్వపుఁద్రాడు, మంథానంబు =
కవ్వము, దుగ్ధసింధువు=పాలసముద్రము, వారివాహవ్యూహంబులు = మేఘముల
గుంపులు; కడలు అవియన్=దిక్కులు బ్రద్దలుకాఁగా, చదలు = ఆకాశము,
ఉదిలకొనియె=చలించెను, డిండీరఖండంబులు=నురుఁగు తునకలు, అంభస్తరంగం
బులు=నీటితరఁగలు, ఆస్ఫాలించె=చఱచెను, ఆవర్తచక్రంబులు=సుడిగుండములు,
రటత్=అఱచుచున్న, శంబరంబు=చేఁప, వలద్ధుళి = తిరుగుచున్న ఆడుతాఁబేళ్లు
కలది, విరుత్కమఠంబు=అఱచుచున్న తాఁబేళ్ళు కలది, పరిభవంబు=అవమానము,
విత్రాసంబు=ఎక్కువ బెదరు, నఖంపచంబు=గోరువెచ్చనిది, సంవర్తసమయము =
ప్రళయకాలము, మర్యాద = హద్దు, అంత...లంబులు = లోపలనున్న మాణి
క్యముల తునకలు, అంభోనిధానంబు = సముద్రము, మథ్యమానంబు =
మథింపఁబడుచున్నది. 61. అశ్మసంఘాతములు = రాళ్ల సమూహములు, కటక
...నంబు=కొండ నడిమిభాగమందలి రాళ్ల రాపిఁడి, వ్రస్సె = చినిఁగెను, కుండ
లీం......సంబు = నాగరాజువీవుపై పొర, సానూ......త్కారంబు = చరి
యలయందలి ద్రోణములవంటి రాళ్ల గలగలధ్వని, దీటుకొనియె = నిండెను,
శిఖరకోటి=శిఖాగ్రము, సుపర్వులు = దేవతలు, పూర్వగీర్వాణులు = రాక్షసులు.
63. ఘూర్ణిల=తిరుగుడుపడఁగా, పొడ్మఁగ=పొడమఁగ-పుట్టఁగా, ఊష్మ=ఆవిరి,
ఉద్దవిడి=వేగము, క్రోయుచు=చాచుచు, దుర్నిరీక్షము = చూడ శక్యముకానిది.
64. విషధరము=పాము, ప్రబలంబు=సమృద్ధము. 65. విషా...బులు = విషాగ్ని
జ్వాలాసమూహములు, తూలి=పైఁబడి - కవిసి, పాలిసన్ = నలుగడల వ్యాపిం
పఁగా, దరికొనియెన్=దగ్ధమయ్యెను, తల్లడము=కలఁతపాటు, ఘూర్ణిలెన్ = కల
గుండుపడెను. 66. రక్షాదక్షంబు=రక్షించుటలో సమర్థమైనది, దక్షిణహస్తంబు=
కుడిచేయి, పలాయనపరాయణులు = పాఱిపోవుటయందాసక్తికలవారు. 67.
అప్రతిమ = సాటిలేని, అహంకృతి=గరువము, పరిషత్ = సమూహము, సంకో
చావహ = సంకోచమును కూర్చు, జ్వాలాజిఘృక్షార్థమై = జ్వాలలను

గ్రహించుటకొఱకు. 68. యుగాంతజలధరము = ప్రళయకాలమేఘము, అవష్టంభము=నిరోధము. 69. కరటి = ఏనుఁగు, సూకరాకృతి=పందియొక్క ఆకారము, పికంబుతో దొరసి=కోకిలతో సమానమయి, కలశపయోధి=పాలసముద్రము. 70. కటుకము=కారము, విషధరకటకంబు=పాము కడియముగాఁ గలది, ఘుటికాసంసిద్ధుఁడు=మృడుఁడు-శివుఁడు. 71. కంఠికానీలరత్నంబు = కంఠె యను నగయందలి నీలమను రత్నము. 73. పినాకేష్వాస!=పినాకమనెడి విల్లుకలవాఁడా! ఆర్తి=కష్టము. 75. అస్తమితంబయినన్=నశింపఁగా, కడంకమై = పూనికతో, తారు=తాము-దేవదానవులు, అహీశ్వరున్=వాసుకిని. 76. తరిగొండ = మంథర పర్వతము, శరనిధి=సముద్రము, సురభీకృతము=సువాసనకలది. 78. ఇరుప్రక్కయలనుండి = ఉభయపార్శ్వములనుండియు, సురసింధురంబులు = దేవగజములు, సారిది=క్రమముగా, వీచోపులిడఁగ=చామరములు వీవఁగా, మున్నీరు=సముద్రము, పాండువికచకమలము = వికసించిన తెల్లతామర, కాంచనకర్ణికాగ్రంబునందు = కేసరములతోఁగూడిన దుద్దుపైని, పద్మ=లక్ష్మీదేవి. 79. హేమపద్మము=బంగారు కమలము, కలిమి...పూఁబోఁడి=లక్ష్మీదేవి. 80. చలిగురికాఁడు=చల్లని కిరణములు కలవాఁడు, కలువలచెలికాఁడు=చంద్రుఁడు. 82. అందంద = మఱిమఱి, సందరము=సముద్రము, ఇందిరానుసంజాతములు=లక్ష్మీదేవి ననుసరించి పుట్టినవి. 83. పయోనిధానము=సముద్రము, జలూకికాసంతతి = జలగల సమూహము, హారీతకి=కరకకాయ, అనామయసౌఖ్యకారి=ఆరోగ్యసుఖమును కూర్చువాఁడు. 86. తనుదీప్తి=దేహకాంతి, ఉదధి=సముద్రము. 87. తార...వదన = చంద్రబింబమువలె విశుద్ధవర్ణముకల ముఖముకలది, తారహారము = పొడవైనహారము, ఉత్కరము = సమూహము. 88. ఐరావణంబు=ఐరావతమనెడి ఏనుఁగు, తొరఁగు=కారుచున్న, కఠోరగర్జితము=గొప్ప ఘీంకారము, నిర్ఘాతనిర్ఘోషముల్=పిడుగుయొక్క ధ్వనులు. 89. మధుకరంబులు = తుమ్మెదలు, వక్త్రేందుబింబములు=ముఖములను చంద్రబింబములు, తనూలతలు=తీగలవంటి దేహములు, వీచికావర్తితతులు=అలలయొక్కయు, సుడిగుండములయొక్కయు గుంపులు. 90. సుపర్వసురభి=దేవతలగోవు - కామధేనువు, దరి=తీరము. 91. విద్రుమ...చ్ఛటల్-విద్రుమవల్లరీ = పగడపుఁదీగలయొక్క, కిసలయవ్యాప్తైకశంకావహ = చిగుళ్ళయొక్క వ్యాపనమనెడి సందేహమును కల్గించు, అత్యంతస్వచ్ఛ = మిక్కిలి పరిశుద్ధమైన, రుచిచ్ఛటల్ = కాంతిసమూహములు, నర్తింపఁగా = నాట్యమాడఁగా, చింతారత్నశలాక = చింతామణి. 92. నాగ...నంబు = తమలపాకుతీగల గుంపు, సరసవృత్తి = రసముతోఁగూడిన స్థితి - ఎండిపోకయుండు పద్ధతి. 93. పవమానము =

వాయువు, తోయధి=సముద్రము, శ్రీయంశము = లక్ష్మీదేవియంశము. 94. గరుడాండము=గరుడపచ్చ, హరితములు=పచ్చనివి. 95. శశాంకుఁడు=చంద్రుఁడు, నాకంబు=స్వర్గము, హేరంబుండు=వినాయకుఁడు, కుస్తరించి=బుజ్జగించి, ఉద్యోగించి=ప్రయత్నించి. 96. దైత్యులు=రాక్షసులు, బాహు...ధులు=మద్దిచెట్ల వంటి (పొడవైన) భుజముల గర్వముచేఁ గన్నులు కానని వారు, ఒక్కమొగమై=ఏకమై, నిర్బంధము సేసి=బలాత్కారము చేసి, స్కంధము=భుజము. 97. తార=తామే, విభజించి=పంచుకొని. 98. గోత్రకలహంబు=కుటుంబకలహము. 99. కైటభారాతి=విష్ణువు, అనువు = పద్ధతి, అవమతింప = తిరస్కరింప. 100. ముహూర్తము=క్షణము. 101. నీలాంభోజపత్త్రాక్షి=నల్లకలువలఁబోలు కన్నులు కల యువతి, ఆకల్పంబులు=అలంకరణములు, ఆహా=ఆశ్చర్యము, నాకౌకశ్శ్రేణి=దేవతలగుంపు, విద్యుల్లేఖ=మెఱుపుతీగ. 102. బృందారకపథము, దేవమార్గము-ఆకాశము, ఎడమున=నడిమిభాగమున. 104. వైవస్వతుఁడు=యముఁడు, కరటిదానవుఁడు=గజాసురుఁడు, పాశపాణి=వరుణుఁడు; అలఁతినగవు=చిఱునవ్వు, ధననాయకుఁడు=కుబేరుఁడు, గంధవహుఁడు=వాయువు, కలికితనము=స్త్రీత్వము (వా. ని.) వార=వారే, తాన=తానే. 105. ఎడన=దూరముగనే, చొక్కె = పరవశమయ్యె, గంధఫలి=సంపెంగ. 106. పాలువోకుండె=పక్షపాతముకలది కాకుండెను-లొంగకుండెను, పాదపంకజములు=పాదపద్మములు. 108. పంచినయట్లు=ఆజ్ఞాపించినట్లు, నిధానము=నిధి, ఇరుదెసవారల్ = రెండుపక్షములవారు. 109. ప్రణతిసేసి=నమస్కరించి. 110. విలోచనాంచలము=కడకంటి చూపు. 111. వైరానుబంధంబులు=విరోధభావములు. 112. సుధారసము=అమృతము. 113. ఒక్కరూప = సమానమే. 114. అబ్బరు = లభింపరు. (ఈపద్యము వేఱొక ప్రతిలో 113 సంఖ్యగల వచనమునకుఁ బూర్వమున్నది. దాని మూఁడు, నాలుగు పాదములు "అన్నదమ్ములమైయుండి యకట! మేము, మిమ్ము మము మీరు వంచింప మేలె చెపుడ" అని కానవచ్చుచున్నవి.) 115. అల్పంపుఁబనియె=సామాన్యపు పనికాదు, త్రోవ=విధము-పద్ధతి. 116. చెఱపంజాల=కాదనఁజాలను. 118. పన్నికొనఁగ=(వరుసగా)ఉంచుకొనఁగా, అలసయానంబు=మెల్లనినడక. 119. పట్టు...చెఱంగు=పట్టుచీరకొంగు, ఆందోళనంబొంద=చలింపఁగా, తాటంకముల్=కమ్మలు, మొరయఁగ=ధ్వనిచేయఁగా, సురధేన్వాజ్యము = కామధేనువువలని నేయి, ప్రస్తరింపఁదొడఁగెన్=అభిఘరింపసాగెను. 119. చందన...మధ్యముల్=చందనముపూయఁబడిన వక్షఃస్థలముకలవారు, మౌన...ష్ఠులు=మౌననియమముకలవారు, అమత్సరచిత్తులు=అసూయలేనివారు, దానవులు=రాక్షసులు, సుపర్వులు=

దేవతలు. 120. హేమపూర్ణకుంభము=బంగారపు టమృతపూర్ణకలశము, పరిపూత=పవిత్రమైన, వదనులు=నోళ్లుకలవారు, ఉభయవంశ్యులు = దేవదానవులు. 121. నిజాలయమృతము=సత్యమైన అమృతము, సురలతోయంబు=దేవతలసమూహము, దైతేయులు=రాక్షసులు, ధీప్రౌఢి=నేర్పు. 122. వైమానికులు=దేవతలు, మృగ...మానము=ఎండమావుల యన్నముతో సమానమైనది, కర్బురులు=రాక్షసులు. 123. తథ్యము = సత్యము, మిథ్యా=అసత్యము, కామదుగ్ధేనువు = కామధేనువు, తోరంబుగా=అధికమగునట్లుగా, ఎలుంగెత్తి=గొంతెత్తి. 124. తేనియలుట్టు = తేనెలూరు, భుజించి = క్రోలి, త్రిదశులు = దేవతలు. 125. కోణపులు=రాక్షసులు, తక్కరి=అసత్యము. 127. మొఱంగి=దాఁగి, గ్రహరాజులు=సూర్యచంద్రులు. 128. వేల్పుచెంకి=దేవతలవరుస, ఉపాంతము = సమీపము, కర్బురయుగ్మము=ఇరువురు రాక్షసులు-రాహుకేతువులు. 129. ఇరుకంచములు=రెండుకంచములు, మురవైరి=విష్ణువు, అర్కశశాంకులు = సూర్యచంద్రులు. 130. కంఠాధఃప్రదేశంబు = గొంతుక్రిందిచోటు, ఆత్తుద్రోత్తమాంగంబులు = పెద్దతలలు, వీడ్కొక=విడువక, కట...మున = కంకణములతోఁగూడిన చేతియందలి చక్రముతో, శ్రీకాంతుండు=విష్ణువు. 131. అదరుపాటిల్లుటయుఁగా=కష్టముకలుగఁగా. 132. డిగఁద్రావి=విడిచి, నిజమూర్తి = ఎప్పటిరూపు, సరివేళ = మంచిముహూర్తము, బహువారములు = చాలపర్యాయములు, కలశపాథోరాశి = పాలసముద్రము, ఉక్కడియునికి = దైన్యమందినస్థితి, నాకము=స్వర్గము, లచ్చి=లక్ష్మి, నాగరిపుఁడు=గరుడుఁడు. 133. ఎలమి = సంతోషము, ఆవారలు = అట్టివారు. 134. సురా...విభ్రమ!=దేవతలకు విరోధులగు రాక్షసులను విరోధించు చంద్రునితోసమానముగ ప్రకాశించు కీర్తివిలాసముకలవాఁడా! శంకరశైలము=కైలాసము. 135. ధీపంజర! = ఆలోచన కాశ్రయమగువాఁడా! 136. విలాసశక్రా! = విలాసమున ఇంద్రుఁడగువాఁడా! నిఃశంకా! = సందేహములు లేనివాఁడా! నిజనిష్కలంకా!=శాశ్వతముగాకళంకములేనివాఁడా!

## సప్తమాశ్వాసము

పద్యము. 1. ప్రాకారాం...గుహా!=ప్రాకారమున నిర్మించిన పాతాళగుహకలవాఁడా! 3. రసాల=తీయమామిడి, తమాల=చీఁకటిమ్రాను, తాల = తాడి, నీప=కదంబము, అర్జున=మద్ది, లోధ్ర=లొద్దుగు, తిందుక=తుమ్మికి, వట=మఱ్ఱి, ఆమలకీ=ఉసిరిక, ఆమ్ర=మామిడి, కురంటక=గోరంట, ఆమ్ల=చింత, హరిచందన=పచ్చచందనము, నింబ=వేఁప, కేతకీ=మొగలి, కపిత్థ=వెలగ, పూగ=పోఁక,

ముఖ=మొదలైన. 4. ద్యూతము=జూదము, వ్రాతము=సమూహము, దివస్పతి=ఇంద్రుఁడు. 5. శరధి=అమ్ములపొది, అమరేంద్రుఁడు=ఇంద్రుఁడు, ప్రత్యనీకవిజయము=శత్రువులను గెల్చుట. 6. పాంచాలీవల్లభుఁడు=ద్రౌపదిభర్త-అర్జునుఁడు. 7. యష్టి=కఱ్ఱ, (ఇందు 'కత్తళము' అను పాఠమే యుచితము. కత్తళము=కవచము.) క్రీడి = అర్జునుఁడు, విరుద్ధము=విపరీతము. 8. పాషాణాగ్రతల్పుండు=రాతిపయిభాగమే పడకగాఁ గలవాఁడు, నాకేశ...నుండు=ఇంద్రుని కుమారుఁడగు అర్జునుఁడు, వాకు=మాట, వ్యాకీర్ణ=వ్యాప్తమైన, భల్లుకము=ఎలుగు, లులాయము = అడవిదున్న, ఆభీలము=భయంకరమైనది. 9. పతయాళు=పడుచుండు, నిర్ఝ...హంబులు=సెలయేటి నీటి ప్రవాహములు, అఘమర్షణస్నానము=అఘమర్షణమంత్రములను పఠించుచు ప్రాతఃకాలమునఁ జేయు స్నానము, శశ...మౌళి=బాలచంద్రుని ధరించిన శివుఁడు, జంభారి=ఇంద్రుఁడు, తడవు=చాలసేపు, కెరలి=విజృంభించి, కడిమి=బలము, శాత=వాఁడియైన, నిర్ఘాత=నశింపఁజేయు (లేక వజ్రాయుధమువంటి), కాండవితతి=బాణముల గుంపు, 10. చందనక్ష్మాజము=మంచిగంధపుచెట్టు. 11. కపికేతనుండు=అర్జునుఁడు, గాండీవరంబులు=గాండీవమను వింటినారి నిలాగి కొట్టుటవలన నేర్పడినకాయ యను గుర్తుచే శోభించునవి, నీవారపాకంబు=నెవ్వరిధాన్యము, పాంచాలకన్యక=ద్రౌపది, కుంకుమ...ణీయంబు=కుంకుమచూర్ణముచే సొగసైనది, నిర్భేదనచణ=భేదించుటకు సమర్థమైన, ఖాండవ...సంరంభంబు = ఖాండవవనమును అగ్ని దహించుసమయమున నేర్పడిన యాటంకమునకుఁ దత్తఱపడినది, హృదయాంభోరుహంబు = హృదయకమలము, కుంభసంభవుఁడు = ద్రోణుఁడు, ప్రతిష్ట = ఆజ్ఞాపింపఁబడిన, శాఖా...రూకంబు=కొమ్మచివరఁగల లక్ష్యమైనపక్షిని చూచుటలో జాగరూకత కలది, వీక్షణంబులు = చూపులు, నాసికా...నంబు=ముక్కుపై-నాసాగ్రముపై నుంచుట, వృద్ధోపసేవనంబు = పెద్దలను సేవించుట, ఆపాదనము = పొందించుట, ఇంద్రియభంగంబు = ఇంద్రియముల నరికట్టుట, ధురీణంబులు = సమర్థములైనవి, నెట్టుకొనఁ=అతిశయింపఁగా. 12. రోమ...శిరంబు = వెంట్రుకలచేఁ దెల్లనైన తల, మేధావిబొట్టు=ఔపాసన చేసిన నిప్పుమసితో పెట్టుకొన్న బొట్టు, జన్నిదములు=జందెములు, భూతి...కంబు=విభూతితో నొసటఁ బెట్టుకొన్న అడ్డబొట్టు, కంథోత్తరీయంబు = ఉత్తరీయముగా వేసికొనిన బొంత, ఇష్టికోల = యోగదండము, ఇఱ్ఱితోలు=జింకచర్మము, పంచాంగముష్టి=పంచాంగపుఁగట్ట, సంబెల=అడపము-లేక సంచి. (ఇచట 'జెత్తగొడుగును జక్కఁ దాల్చి కుతుకమున' అనుటకు బదులుగా నున్న 'నెడమచేతను నిడుగోల గొడుగుదాల్చి' అనుపాఠమే యుచితమైనది. కాన దానినే గ్రహింపవలెను.) సజ్జాతి=సహచరుఁడు. 13. సంగడంబు=సహవాసము,

అరసికొని=గమనించి, పరిశ్రాంతుండు=మిక్కిలి యలసినవాఁడు. 14. మోఱకుని చందమున=మూర్ఖుని విధమున, ఈఱతాఱచూపు=వంకరచూపు, పాండవేయుఁడు= అర్జునుఁడు, తార్చి=ప్రసరింపఁజేసి, నిష్పచ్చరంబు = దీనమైనది, పరిమళింప= వ్యక్తముకాగా. 15. మంత్ర...విధులు=మంత్ర తంత్రముల పద్ధతులు, పాక శాసనుఁడు=ఇంద్రుఁడు, ఎన్నిచూడ=ఆలోచించిచూడఁగా. 16. భాగ్యరేఖ = అదృష్టరేఖ, విపినము=అడవి, ఎలప్రాయము=యౌవనము, అకృతాత్ముఁడవు= తెలివి లేనివాఁడవు. 17. దాంతి=ఇంద్రియనిగ్రహము, చంక...జొరి = ఇతరులను చంపుటకుఁ జంకలో దుడ్డుకఱ్ఱుంచుకొని 'శరణు' అని యితరుల నాశ్రయించిన వాఁడు, చందము=విధము. 18. వైరి...ధారలు=శత్రువుల మదగజముల కుంభ స్థలములను చీల్చుటలో దారుణమగు కత్తినాదరగలవి, పరిఘాకారములు=అడ్డు గడియలవలె నున్నవి, కందమూలోద్ధారములు = దుంపలను ఊడఁబెఱుకుట. 19. భద్రాకృతి = శుభమైన ఆకారము, దీర్ఘకోదండము = పొడవైన విల్లు, ఆభీ లత్వము=భయంకరత్వము, ఒకండొకండ=ఒక్కొక్కటియే, భువ...హేతువు = లోకమునకు ఏకాధిపత్యమునుగల్గించు కారణమైనది, లాభంబు = ప్రయోజనము, ఆకీర్ణ=వ్యాప్తమైన, వనాంతరంబున=అడవినడుమ, ఏకాగ్రభావంబు=స్థైర్యము. 20. లెస్స=మేలు, మాకు హితవు=మాకు సమ్మతము, ప్రార్థ్యతరము = మిక్కిలి కోరఁదగినది, వజ్రధరుఁడు=ఇంద్రుఁడు. 21. తలిర్ప=చిగురింపఁగా, అద్రిభేది= ఇంద్రుఁడు. 22. ఆత్మసంశుద్ధి=ఆత్మపరిశుద్ధి, పరమసంశయమ = గొప్పమునియైన గౌతముఁడు, బాహావిక్రమము=భుజపరాక్రమము, భుజ...పాక = గరుత్మంతుని యీఁకరాలుట, సునాసీరుఁడు=ఇంద్రుఁడు, అహంకారగరిమ = గొప్ప ఆత్మాభి మానము, నెలవు=నివాసము, తాపసు...దండ=దుర్వాసుఁడిచ్చిన పారిజాతపుష్ప మాల, పడసెదవు?=పొందెదవు? వాసికలవాఁడు = ఆధిక్యమున్నవాఁడు. 23. అత్యంతధీరోదాత్తుండు = మిక్కిలి ధైర్యౌదాత్తగుణములు కలవాఁడు, వృద్ధ శ్రవుండు = ఇంద్రుఁడు. 24. గురుతనయుఁడు = అశ్వత్థామ, పరిమార్చునట్టి = నశింపఁజేయునట్టి, సత్త్వము = బలము, పురుహూతా! = ఇంద్రుఁడా! 25. సవ్యసాచి = అర్జునుఁడు. 26. అనిర్భేద్యబలులు = భేదింపరాని బలముకల వారు, ద్రౌణి = అశ్వత్థామ, సమరము = యుద్ధము. 27. తత్ప్రసాదంబు = అతని యనుగ్రహము. 28. ధనంజయుఁడు = అర్జునుఁడు, అభవుఁడు = శివుఁడు, 29. భసితో...యవుఁడు = విభూతిచేఁ బూయఁబడిన పరిశుభ్రములగు అవయవ ములు కలవాఁడు, శివ...ధ్యాత=శివుని ధ్యానమును గూర్చువాఁడు, మసృణ...

పీఠుండు=దట్టమై నునుపుగానున్న పులిచర్మము బొంతయే ఆస్తరణగా కలవాఁడు, అసమస్థేమ=సాటిలేని స్థైర్యము, పాశుపతదీక్షారంభము=శివునిఁగూర్చిన పాశుపత వ్రతదీక్షాప్రారంభము. 30. ప్రథమ...పాటి=తొలినంజకెంజాయతో సమానమైన, పంక...కములు=తామరమొగ్గలు, కందువాఱిన=వివర్ణమగు-మలినమై, విధుమండలము=చంద్ర మండలము, తరమైన వేఁబోక=బాగుగఁ దెల్లవాఱుట, తఱపివెన్నెల=కొంచెపు వెన్నెల, దివి=ఆకాశము, మత్తిల్లి=మదించి, అత్తమిల్ల=ఒరఁగియుండఁగా, మృదులు...శయ్య=మెత్తని విభూతియొక్క దుమ్ముకల పడక, పర్ణ...రమున = పర్ణశాలలోపల. 31. కపికేతుఁడు=అర్జునుఁడు, ప్రపాత...స్నాతుండు=చరియనుండి పడుచుండు ప్రవాహమున స్నానము చేసినవాఁడు, తపనోదయము = సూర్యోదయము, వ్యాళధరుఁడు=శివుఁడు. 32. అవధానంబున=హెచ్చరికతో, పాక...సుతుండు=అర్జునుఁడు, అర్ధేందుకోటీరుఁడు = శివుఁడు, సంగవకాలంబు = ఉదయ, మధ్యాహ్నముల నడిమికాలము, సర్జము=మద్ది. 33. మంచుం...కొడుకు=శివుఁడు, నిర్జర...నుఁడు=అర్జునుఁడు, సదాధ్యాసితక్=ఎల్లపుడు అధిష్ఠించియుండుటచే. 34. వైయాఘ్రాజినము=పులితోలు, శేవక్=ఒప్పిదముగా, బిల్వద్రుమము=మారేడుచెట్టు. 35. అంచితభక్తి=ఒప్పిదమైన భక్తి, సమర్చనావిధి=పూజావిధి, కాంచనకోరకంబులు=సంపంగిమొగ్గలు, కాంచన...ముఖంబులు = బంగారు గుహాగుహద్వారములు, సంస్కృతార్ధుఁడు=సంస్కరింపఁబడిన వస్తువులుకలవాఁడు. 36. కాలకంధరుఁడు=శివుఁడు. 37. గిరి...భాగంబు=కొండ కొమ్ము పైభాగము, లతాతరుప్రతతులు=తీగలయొక్కయు, వృక్షములయొక్కయు సమూహములు, కోరకముల్=మొగ్గలు, కుక్కురప్రకరము = కుక్కలగుంపు, బౌబౌమహారావముల్ = బౌబౌ-అను పెద్దధ్వనులు. 38. చాయగోసులు = చిఱుతపులులు, జల్లుకొని = గుంపుగాఁగూడి, సారమేయయూథములు=కుక్కలగుంపులు, వేదమయమూర్తులు =వేదస్వరూపములు - (నాల్గువేదములే కుక్కలుగామాఱినవని భావము.) 39. ప్రచయంబులవరుస = అనుదాత్తస్వరవిశేషముల క్రమము. 40. శృంఖలలు = గొలుసులు, త్రయి=వేదములు, సూరెలక్ = పార్శ్వములందు, లీలావనచరులు= మాయాకిరాతులు, కపటవైహారికుఁడు=మాయాకిరాతుఁడు. 41. వికట...భారంబు =ఎచ్చుతగ్గులుగానున్న ఎఱ్ఱనిజడలకిరీటము, కఱకైన=మోటైన, జుంజుఱునెఱులు= చింపిరిజుట్టు, సుధా...సంబు=చంద్రకళయను శిరోభూషణము, పీఁకె=ఈఁక, కనుచిచ్చు=అగ్నిరూపమగు మూఁడవకన్ను, గైరిక...కంబు = జేగురురసమునఁ బెట్టిన బొట్టు, క్రాలు=ప్రకాశించు, గెరిజ...సరులు=గురిగింజలతో చేయబడిన మాలలు, అగజ = పార్వతి, వివ్వచ్చు = అర్జునుఁడు, 43. జలధరము=మేఘము, యుగళి=

కెండు, దంష్ట్రలు=కోఱలు, భిదురము=వజ్రాయుధము, పోత్రము=ముట్టె, ఫుల్ల...ములు=వికసించిన నల్లకలువరేకులకాంతిగల చెవులు, పాటల=ఎఱ్ఱని, వర్తుల=గుండ్రని. 44. మహీప్రభవంబులు=నేలపైఁ బుట్టినవి, పెన్‌బుట్టలు=పెద్దపుట్టలను, గ్రొచ్చివైచుచును=పెల్లగించి వేయుచు, భూరుహషండము = చెట్లగుంపు, వెళ్లఁగ్రాయుచున్=వెళ్లఁగ్రక్కుచు. 45. పురందరనందనుఁడు=అర్జునుఁడు, నిశాకరధరుఁడు=శివుఁడు, దండడి=అధికమైనది, గోరిజలు=గిట్టలు, కందుకములు=బంతులు, శిలలు=రాళ్లు, గరువాఱంగన్=గగుర్పాటుచెందఁగా. 46. వాసవసూతి = అర్జునుఁడు, గాడిపాఱన్=నాటుకొని, దూసికొనిపోఁగా, శర...వేదనన్=బాణముల దెబ్బలవలని బాధచే. 47. అభవుఁడు=శివుఁడు, వ్యథ=బాధ, సంక్షుభితము = క్షోభపడినది, విలయ...క్రియన్=ప్రళయకాలమున, ఆకాశమునఁ దిరుగు వర్షకాలపు కాఱుమబ్బు విధమున. 48. హర...వ్యథ=శివునియొక్కయు, అర్జునుని యొక్కయు బాణములనెడి పిడుగులు పడుటవలనఁ గలిగిన గొప్పబాధ, అంతర్ఘూర్ణమానము = లోపల కలగుండుపడుచున్నది, క్రోడము = పంది. 49. పురారి = శివుఁడు, వలకేలు=కుడిచేయి, వాలమ్ము=ఆయుధము, జగజెట్టి=మహావీరుఁడు, ప్రావృషే...గంభీరంబు=వర్షాకాలపుటుఱుమువలె గంభీరమైనది, సాటోపంబుగా = ఆర్భాటముతో, సావష్టంభముగా = ఔద్ధత్యముతో. 50. బాహుదర్పంబు=భుజబలము, వనచరసార్వభౌముఁడు=ఆటవికులకు ప్రభువు. 51. వేఁటవెళ్లి=వేఁటకుఁబోయి, నిశితాస్త్రపాతము=వాఁడియైన అస్త్రమును ప్రయోగించుట, కిటి=పంది, వాక్ప్రతిజ్ఞానియమంబు=మాటపట్టింపు - శపథము నియమము, వెనుకజాడ=వెనువెంబడి. 52. ఏటలవి=బాణముతోఁగొట్టుటకుఁ దగినదూరము, ఓటమిపెట్టంగడంగి=ఓడింప సిద్ధపడి, కొఱఁతిడి=అవమానించి, చీటంబునన్=ఆటగా. 53. ధనువు=విల్లు, సత్త్వహింస=జంతుహింస. 54. బలునారసము = వాఁడియైన బాణము, శరము నిగుడింపన్ = బాణమువేయఁగా. 55. తబిసి = ముని, వేఁటపంతమా? = వేఁటయందలి నియమమా? - నియమము నతిక్రమించుటకాదా? (ఒకరుకొట్టిన మృగమును వేఱొకరు కొట్టరాదని వేఁటయందలి కట్టుబాటు.) (అబసరపుం దెఱంగున=తొందరపాటున-అను పాఠాంతరము ఇచట గ్రాహ్యము.) పరా...హతంబు = వేఱొక వేఁటకానియొక్క పెద్దవింటినుండి వెలువడిన గొప్ప బాణముచేఁ గొట్టఁబడినది, వనేచరజంతువు = అడవిమృగము, సబము = శవము, నిశాతశిలీముఖము=వాఁడి బాణము. 56. ఆటవికచక్రవర్తి = కిరాతరాజు. 57. చేవెఱవు=హస్తలాఘవము, సెగ్గు=తప్పు, వక్రభాషణంబులు=వంకరమాటలు, శబరుఁడు=కిరాతుఁడు. 58. అపేక్షించెదవో=కోరెదవో, కందువుగాక=పొందుదువు

గాక! 59. డాయంగనయ్యెడుఁ = సమీపించుచున్నది, ఏకాంత...బడుఁ = తగిన సమయమైయున్నది, విడు = విడుపును, వాగ్వివాదము = వాగ్వివాదము. (వాగ్వివాదము-అనుటకుబదులుగా 'ధన్వీ! వాదము' అనుపాఠము కానవచ్చుచున్నది. ధన్వి = విలుకాఁడు.) 60. జోటి = యువతి భార్య, కుర్కురకోటి = కుక్కలగుంపు, ధాటి పరిశ్రమము = వేఁటాడుపని. 61. గజ్జులాఁడు = గర్వముకలవాఁడు, మోఱకంబు = మూర్ఖత్వము, వేఁటపంతంబు = వేఁటయందలి నియమము. 62. భుజాయుగంబు = రెండు భుజములు, జ్యాకిణాంకితము = వింటినారివలని మాంసపుకాయచేఁ జిహ్నితమైనది, తలిసితనము = యోగము. 63. చాపమందు, ఆసమై = వింటియందలి యాశతో-బాణప్రయోగేచ్ఛచే, (ఇచట 'ఇట్లిచ్ఛాపరాధీనమై-' అను పాఠాంతరము కలదు.) భామాసన్నిధి = నాభార్యయెదుట, ఉబ్బుచున్నయది = పొంగుచున్నది, నిస్సీమంబేనిఁ = అవధిలేనిదైనచో-అధికమైనదయినచో, ఉజ్జృంభించి = విజృంభించి, నిగుడింపుమా = ప్రసరింపఁజేయుమా! నిశిత...చముల్ = వాఁడియైన పెక్కువిధముల క్రూరబాణములు. 64. వంచింపకు = తిరస్కరింపకుము, సంగ్రామము = యుద్ధము, సేబాసందుఁ = మెచ్చుకొందును. 65. తపస్విత్వమ్ము = తపస్సు, వ్యవధానంబు = ఆలస్యము, సైఁచవో! = ఓర్వఁజాలవా? అవార్యంబుగఁ = అడ్డులేకుండునట్లు. 66. ప్రదర.....యుము = బాణమును సంధింపుము. ఏయుము = కొట్టుము, ప్రాక్ప్రకారము = వెనుకటివిధము, ఘోర...పములు = భయంకరములగు వీరులయుద్ధములు. 67. క్రీడాకిరాతుండు = మాయాకిరాతుఁడు, జలధరధ్వానము = ఉఱుము, సిళ్ళుచూపిన = అంకుశమునుచూపిన, గంధద్విపంబు = మదగజము, అంబరంబు = ఆకాశము, భల్లంబులు = బాణములు. 68. ప్రవిముక్త = విడువఁబడిన, నిష్ఠుర = వాఁడియైన, కాండప్రకాండంబులు = బాణములసమూహములు, కందర్పవిద్వేషి = శివుఁడు, భుజా...కృతి = దండములవంటి భుజములశక్తి, శాత = వాఁడియైన, నారాచముల్ = బాణములు. 69. తృణప్రాయంబు = గడ్డిపోచలవిధము, క్రూరాజి = ఘోరయుద్ధము, హేలాగతిఁ = విలాసముగా-శ్రమలేకుండ, విజయాస్త్రవ్రాతము = అర్జునుని బాణములగుంపు. 70. శితికంఠుఁడు = శివుఁడు, ప్రతిహతములు = నశింపఁజేయఁబడినవి. 71. అస్త్ర...ధ్రము = అస్త్రసమూహముచే దట్టమైనది. 72. నభఃకటాహము = పెద్దపెనమువంటి యాకాశము, కపికేతుఁడు = అర్జునుఁడు. 73. ఓహరిసాహరి = ఎడతెగకుండునట్లు, 74. శరధులు = అమ్ములపొదులు, సముద్రములును, శరశూన్యంబుల్ = బాణములు లేనివి, సురపతిసూతి = అర్జునుఁడు, సమరాగ్రము = యుద్ధపూర్వభాగము. 75. తెలివిం...యుండెఁ = స్ఫురణకు రాకుండెను, శార...ధంబు = కృప,

ద్రోణుల యుపదేశము, వృథ=వ్యర్థము, సాంతర...సంబు = ఎడతెగక చేసిన యభ్యాసము, మాయారూపమైన వక్రభావమునందలి నేర్పు. 76. నిటలవిలోచనుఁడు=శివుఁడు, కుటిలముగ=వక్రముగా, కటకటపడఁదొడఁగె=కష్టపడసాగెను, కరము=మిక్కిలి. 77. కాండక్షీణత=బాణములు లేకుండుట, ఇషుచ్ఛటలు = అమ్ములపొదులు, చిట్టలొఁగాక=ఆశ్చర్యముకదా! వయిమైఁ = చెక్కుచెదరక, గంగాధరుఁడు=శివుఁడు. 78. మృడుఁడు=శివుఁడు, అడవందొడంగె = కొట్టసాగెనో, ఉడుగక=విడువక, పొడమెడు=కలిగిన, నడఁకుం...కుమారి=పార్వతి.79. పఱచు=ప్రవహించుచున్న, అవతంసము = శిరోభూషణము, శశిరేఖ=చంద్రరేఖ, నెట్టియంబు=తలపాగ, పెనుఁబాము=పెద్దపాము, అలిక...కీర్తి=నొసటికన్నగునగ్ని, ఆరజ్యమానము=మండుచున్నది, అగజ=పార్వతి, శృంగాటకంబు = నడిమిప్రదేశము, తాడింప=కొట్టఁగా. 80. ఘన...కలిత=గొప్పదై, అడ్డుగడియవలెనున్న=చేతిలోనున్న, ఖండపరశువు=శివుఁడు, పిండుకట్టి=గుమిగాజేరి, తరఁగదండు = అలలగుంపు. 81. జెట్టిబిరుదు=ఆ వీరుని పరాక్రమము, శూలపాణి = శివుఁడు, సంభావనములు=గౌరవములు. 82. ఉపజాత=కలిగిన, నియుద్ధము=బాహుయుద్ధము, ఉపతాయి=మల్లబంధ విశేషము. 83. తోరహత్తంబు = మల్లబంధవిశేషము, కడిమి=బలము, సరభసమున=తొందరగా, సీసాన=సీనమను బంధమున, నిశ్వాసపవనము=నిట్టూర్పుగాలి. 84. కంఠమూలము = పీక, డొక్కారము = మల్లబంధవిశేషము, ఇఱికె=ఇఱుకునట్లు చేసెను, ప్రకోష్ఠపీడన = ముంజేతిని బాధించుట, మిక్కిలికను = మూఁడవకన్ను, వెలికినుఱికె=పైకుబికె. 85. తాచుచు=తన్నుచు, ఏచుచు=బాధించుచు, ప్రాచీపతిసుతుఁడు = ఇంద్రపుత్రుఁడు - అర్జునుఁడు, బాహాబాహి=భుజములతోను, భుజములతోను చేయఁబడిన యుద్ధము. 86. నిష్టంకించి=మార్కొని, శశాంకశేఖరుఁడు = శివుఁడు, భుజావష్టంభంబులు=భుజగర్వంబులు, కైవారంబుగావింపఁగా = కొనియాడఁగా, దిష్టాం...మూర్తులు = మరణములవలె క్రూరస్వరూపులు, సాదృశ్యం...శ్యంబుగా = సాటిలేకుండునట్లు, ముష్టీముష్టి = పరస్పరము పిడికిళ్లతోఁ బొడుచుకొనునట్లు. 87. ఔడుగఱచుట=పెదవికఱచుట-లేక-పండ్లుకొఱుకుట. 88. తాటించె=ఆస్ఫోటించె, పేరణము = మల్లబంధవిశేషము, ఆస్ఫోటించె=తన్నెను, వృషాంకుఁడు=శివుఁడు, అఱక = విడువక. 89. చంద్రకళాధరుండు = శివుఁడు, నిజ...క్రాంతుండు = తన బాహువులయొక్క గొప్ప బాధవలన, అలసినవాఁడు, కృపావంతుండు=దయకలవాఁడు, అహిరాజు=సర్పరాజు, స్వర్వాహినీవేణి = ఆకాశగంగాప్రవాహము, దంతిత్వక్పరిధానపల్లవము=సన్నని గజచర్మవస్త్రము. 90. (ఇచటి మొదటి పాదమున "చెంచెత

రైనపార్వతియుఁ జెంచులు భూతములు న్నిజాకృతిఁ" అనునది పాఠాంతరము.) భూతములు=అణిమాదులగు అష్టభూతములు, నిజాకృతిఁగాంచిరి = స్వస్వరూపములతోఁ బ్రత్యక్షమైరి, నభముమీఁద = ఆకాశముపై, అలా...నించి=నొసట చేతులు దోయిలించి, వినీతి=వినయము. 91. విశ్వకద్రూత్వము=వేఁటకుక్కలుగా నుండుట, చంద్రార్ధమౌళి=శివుఁడు. 92. రోమాంచ...లాంగుండు = గగుర్పాటు పొందిన సమస్తావయవములు కలవాఁడు, కేలుదోయి = రెండు హస్తములు. 93. (ఇచట 'విద్దళి' అనుశ్లిష్టకాభాగమును విడుచుట మేలు. విద్దళిసార్వవిభక్తికము కాదు. 94. మంటిఁ=జీవించితిని. 96. వాచా...త్యుఁడు=మాటలకును అందని వివేకమునందలి దిట్టతనముకలవాఁడు, అర్థిన్ = ప్రీతితో, క్రొత్తవిరులు = అప్పుడే వికసించిన పూవులు, వేదండచర్మాంబరుఁడు = గజచర్మమును ధరించిన వాఁడు-శివుఁడు. 97. సాటి=ఈడు, నిశాటభూషుఁడు=చంద్రుఁడు నగాఁగల వాఁడు-శివుఁడు, కైటభారాతి=విష్ణువు, హాటకగర్భుఁడు=బ్రహ్మ, కరటి=గజము. 98. పాయక=విడువక, అనువు=ఉపాయము, అజుఁడు=బ్రహ్మ, తోయజనేత్రుఁడు= విష్ణువు. 99. కామాంతకుఁడు = మన్మథుని నశింపఁజేసినవాఁడు-శివుఁడు, చక్షుఃశ్రవః కుండలుఁడు=పాములు కుండలములుగాఁ గలవాఁడు-శివుఁడు. 100. కొండకిరాతుఁడు=కొండలపైఁదిరుగు వేఁటకాఁడు, కయికోక = లెక్కింపక, అసంగతభాషణంబులు = అసంబద్ధపుమాటలు, ముష్టిఘట్టన = పిడికిటిపోటు, క్రచ్చఱ = గట్టిగా, మౌళి=శిరస్సు. 101. ఖండపరశుండు=శివుఁడు. 102. ఈప్సితంబు = కోరఁబడినది, దివ్యబాణము=దివ్యాస్త్రము. 103. శాంభవి = పార్వతి, వాసరావసానము = సాయంకాలము, కూటపాకలజ్వరము = ఏనుగులకువచ్చు నొకవిధమగు జ్వరము, జల...రంబు=మేఘములగుంపునకు పెనుగాలియైనది, ప్రద్యోతనుఁడు = సూర్యుఁడు, శార్దూల...వాహంబు=వ్యాఘ్రాసురుఁడను అడవికి కార్చిచ్చయినది, సంప్రయోగంబు=ప్రయోగించుపద్ధతి, ఉపసంహారము=వెనుకకుఁదీసికొను పద్ధతి, కీలకంబు = మర్మము, అక్షయ...రంబులు = ఎడతెగని బాణములు కల అమ్ముల పొదులు, దండధరుండు=యముడు, పాశపాణి=వరుణుఁడు. 104. బలవిరోధి= ఇంద్రుఁడు, ఆపోనికూర్మి=తనివితీఱనిప్రేమ. సమ్మదాశ్రుకణంబులు=ఆనందబాష్పబిందువులు. 106. అశ్రమమ=శ్రమలేకుండగనే, పన్నగకంకణుఁడు=శివుఁడు, యోగ్యతఁజేసి=యోగ్యతవలన, విశ్వ...ధరంబు=సమస్తలోకములకు నుపకారము చేయుట యను నొకేసౌభాగ్యమున సాటితేఱినది, కురురాజు = దుర్యోధనుఁడు, నిజరాజ్యలక్ష్మి=తనరాజ్యసంపద. 107. త్రివిష్టపంబు=స్వర్గము, పెక్కుతోయములు=చాలపర్యాయములు, దైతేయులు=రాక్షసులు, రాజ్యలుబ్ధులు=రాజ్యముపై

నాశపడినవారు, నాకంబు=స్వర్గంబు, ఆపాదించుట = కలిగించుట, పరిమార్చి = చంపి, అపనయించి=పోఁగొట్టి, మధ్యమలోకంబు=భూలోకము, మాతలి సారథి కంబు=మాతలి సారథిగాఁ గలది, తత్కాల సన్నిహితుండు=ఆసమయమున దగ్గఱ నున్నవాఁడు. 108. వృక్షంబుక్రీనీడ = చెట్టుక్రిందినీడ, ఖేదమోక్షము=శ్రమను పోఁగొట్టుకొనుట. 109. మాళిక = తలపై, కోహాళి...క్రియక=ఆలవట్టము (ఉల్లడ) పట్టినవిధమున, శాళంబు = వాఁడియైనది, ప్రాలేయాహితుఁడు = సూర్యుఁడు, అర్కోపలము=సూర్యకాంతము, జటాలజాంగలము=మఱ్ఱిచెట్లయడవి ప్రదేశము, వాచాల=అఱచుచున్న, కోయష్టి=గుడ్డికొంగ. 110. అయితంబై= సిద్ధపడి. 111. పావన...హంబు = పవిత్రమైన ఆకాశగంగాప్రవాహము, కసటువో = మురికిపోవునట్లుగా, తెలినీరు = పరిశుద్ధమైన జలము, ఈటార్చిన = తడియార్చిన, సలిల...లము=నీరుకావిసారచీర, అలఁది=పూసి, దామములు=మాలలు, పులికళాసంబు=పులితోలు, సారిది=క్రమముగా. 112. దేహయాత్రనడపి=భోజనముచేసి, విశ్రాంతుండు = శ్రమతీర్చుకొన్నవాఁడు. పొడసూపిన = కానరాఁగా, సబహుమానంబుగా=మర్యాదతో, పురందరాదేశంబు=ఇంద్రునియానతి, స్యందనంబు=రథంబు. 113. ఆవహస్కంధము=వాయుస్కంధభేదము, తారకావీథి = నక్షత్రముల వరుస, శింశుమారము=మత్స్యము, భాస్వంతుఁడు=సూర్యుఁడు, ఇరువాడ= రెండువరుసలు, ఇందుభార్యలు = చంద్రుని భార్యలు, సుధాకరుండు = చంద్రుఁడు, కెలఁకులు=ప్రక్కలు, 114. జంభా...జుఁడు=ఇంద్రపుత్రుఁడు-అర్జునుఁడు, సావిత్రవర్త్మ=ఆకాశము, సంఫు...రంబులు = పొట్టవిచ్చిన - (వికసించిన) బంగరు పద్మముల పరిమళవస్తువులుకలవి, సోడుముట్ట = బ్రహ్మరంధ్రము ముట్టఁగా, సవిధము=సమీపము, స్వర్లోకకల్లోలిని=ఆకాశగంగ, వాతూలముల్ = వాయువులు. 115. పొలిచెక=వ్యాపించెను, పథ్యంతరమున=మార్గమధ్యమున, అభ్ర...లంబు=ఆకాశగంగయొక్క తరఁగలమీఁదనుండి వచ్చువాయువు, నవలతాంతములు=క్రొన్ననలు, సౌరభాసారము=పరిమళవర్షము, లహరి=ప్రవాహము, 116. ఒఱసికొనుచు = రాచుకొనుచు, దివ్యాం...గ్యుండు = దివ్యస్త్రీలక్రేగంటి చూపులచేఁ గౌఁగిలింపఁబడిన చక్కఁదనముకలవాఁడు-వారిచూపుల నాకర్షించిన వాఁడనుట. అర్ధాసనంబు = సింహాసనమునందు సగభాగము. 117. వీడుపట్టు = బస, మందారవిపినవీథి=మందారవృక్షముల తోఁటలవరుస, ప్రతిష్ఠఁజేసి = నిలిపి, ఆఖండలుండు = ఇంద్రుఁడు. 119. త్రిదశాంగనలు = అచ్చరలు, నీర...కాండంబు=విష్ణువుతొడ, ఉద్భవంబు = పుట్టుక, అంభోనిధానంబు=సముద్రము, అపోశనముగొన్న=పుడిసిటఁబట్టిన, కలశసంభవుఁడు=అగస్త్యుఁడు, వసుధ=భూమి,

ప్రాణవల్లభ=ప్రియురాలు, కట్టి=విలువైనచీరకట్టి, తొడి=నగలుధరించి, పూసి = చందనాదుల నలఁదుకొని, కైసేసి = అలంకరించుకొని, కొస = కొంగు, నీలిపుట్టంబు = నల్లనివస్త్రము, అర్జునావాసము = అర్జునుని బస. 120. సుధాంశు... వేదిక=చంద్రకాంతమణులతో నిర్మితమైన తిన్నె, సుఖ...కము=సుఖమైన గాఢనిద్ర, మొగిడ్చి=మూసి, అంబుజాక్షుభావమున = విష్ణునిరీతిని, పార్థుఁడు = అర్జునుఁడు. 121. ఇందుబింబాస్య = చంద్రబింబమువంటి ముఖముకలది - ఊర్వశి, ప్రమద...ధీనుఁడు = సుఖముగా నిద్రించువాఁడు, పంకేరుహంబులు=పద్మములు. 122. అభివాదనంబుసేసి=నమస్కరించి, వినమ...మాంగుఁడై = వినయముతో వంచఁబడిన తలగలవాఁడు. 123. నడికిరేయి=అర్ధరాత్రి, విచ్చేసియుండుము=కూరుచుండుము. 124. ఎల్లి=రేపు, రేపాడి=ఉదయము, చంద్ర...యొనర్చి = శివుని పూజించి, ఉపాయనంబు=కానుక, చూచుచునుండఁగ=తలఁచుచుండఁగా, ప్రాగ్భవంబునఁ=పూర్వజన్మమునందు. 125. మత్తా...ఖండు=మదించిన శత్రువులను నశింపఁజేసినవాఁడు. శీతాం...సంబు = చంద్రవంశపురాజులలో నుత్తముఁడు, తోయా...పతి=సముద్రము మొలనూలుగాఁగలభూమికి భర్త, ముత్తోవు=ముత్తయిదువవు, మోహంబు=ప్రేమ-వాత్సల్యమనుట. 126. ఊరువు=తొడ, నీరుడప్పి = నీరుకోరిన దాహము, మచ్చెకంటి=చేఁపకనులవంటి కనులుగలది-అందకత్తె, చేతోభవుఁడు=మన్మథుఁడు. 128. నీడఁబడ్డ=మఱుఁగుపడిన, వావులు=బంధుత్వములు, గుద్దలింప=త్రవ్వగా. 129. వాసవుడు=ఇంద్రుఁడు, అంగజసన్నిభుఁడు = మన్మథునితో సమానుఁడు, పుష్పబాణాసనుఁడు = పువ్విలుకాఁడు - మన్మథుఁడు, నివహములు=సమూహములు, ఆస=కోరిక. 130. ప్రమదము=సంతోషము, అగలార=అధికముకాఁగా, భామ...త్వంబు=స్త్రీలవిషయమున చేసినప్రతిజ్ఞ, పాడి=ధర్మము-ఆచరణీయము. 131. తగులము=అనురాగము, తెగువ = సాహసము, తామముఁబొందంగ=వ్యర్థముకాఁగా. 132. ప్రతత = అధికమైన, నిశాత = వాఁడియైన, నిష్కృప=దయలేని, కృపాణ=కత్తిచే, విదారితదేహులు=నఱుకఁబడిన శరీరములు కలవారు-యుద్ధమున మరణించినవారనుట, ఐదుపదిసేయక=నమస్కరింపక-ప్రార్థింపకయే, ఏఁచెదవు=బాధించెదవు. 133. వేసాలఁబోకు=ఇష్టముండియు, లేనట్లు నటించి సాకులుచెప్పకుము, పులియుట. 134. అచ్చరలేమ = అప్సరస, అపాంగంబు=క్రేగంటిచూపు, తొంగలింప = వ్యాపింపఁగా, తోరంబుగా = అధికము కాఁగా, కెంగే...లంబు = ఎఱ్ఱనిహస్తమునందలి విలాసపద్మము, త్రసరేణు విసరంబులు=కంటికి గోచరములగు అణువుల సమూహములు, ధారాస్యందంబు=ధారల స్రావము, చింద=కారఁగా, పురందరనందనుఁడు=అర్జునుఁడు; వ్రేసె = కొట్టెను,

చిత్త...ణంబు = మన్మథుని సమ్మోహనాస్త్రపుదెబ్బ, కిరీటి=అర్జునుఁడు, మిసిమం తుండు=చలించినవాఁడు, ఏపా...రాక=కలఁతపాటుపొందక, రాకాచంద్రబింబంబు=పున్నమనాఁటిచంద్రబింబము, చిక్కని= దృఢమైన అనుట, మనంబు పక్కు=మనస్సుమార్పు, కావక...వెన్నెల=అడవిలోఁగాసిన వెన్నెల, మిన్నక= ఊరక, పొలిపోయిన=వ్యర్థముకాఁగా, నరుఁడు=అర్జునుఁడు, నాన=సిగ్గు, గంటు వెట్టుకొని=ముడుచుకొని, అరిష్టము=కీడు, హిమగభస్తి=చంద్రుఁడు, విరహ...మానస=విరహవ్యథచే మిక్కిలి బాధపడుచున్న మనస్సుకలది, మైత్రావరుణజనయిత్రి=ఊర్వశి, విభావరి=రాత్రి, త్రిభాగావశేషంబు=మూఁడవవంతు మిగిలినది - రాత్రిలో నాల్గవజాము ప్రారంభము. 135. పల్లవంబులు=చిగుళ్లు, పుంస్కోకిలములు=మగకోకిలలు, కంధరా...టిక=మెడలోని హారమందలి బంగారుగంట, వేల్పుటేనిక=ఐరావతము, ఉషర్విధి=ప్రాతఃకాలవిధులు - ఉదయముచేయవలసిన పనులు, నీలాలకములు=నల్లని ముంగురులు, ఆమ్నాయఘోషము=వేదపారాయణ ధ్వని, పంచితిలుచు=మూత్రమువిసర్జించుచు, (ఇచట 'కామధుగ్గవిచ్చు హుంకారమెచ్చె' అనుటకుబదులు "కామగవిసేపువచ్చి హుంకారమిచ్చె" అను పాఠము సమంజసముగాఁ దోఁచుచున్నది. గోవులు చేపువచ్చునపుడు మూత్రించి, దూడలకై యఱచుట స్వభావసిద్ధము) విభుధలోకంబు=స్వర్గలోకము, వేఁగుఁబోక = తెల్లవాఱుజాము, 136. వజ్రి=ఇంద్రుఁడు, విభావరి=రాత్రి, వేఁగుఁబోక=తెల్లవాఱుజాము. 137. మాటుగా=చాటుగా, మాంజిష్ఠతెర=పచ్చపట్టువలువతెర, పంజామంచము=మణిమయమైన పడకమంచము, మొకరిమట్టెలు=ధ్వనిచేయుమట్టెలు, కన...గాలు = బంగారుగుబ్బలుగల పావుకోళ్లు, వేనలిముడిచి = జుట్టు ముడివేసి, అలసభావము=మందత్వము, అలవోక = అలక్ష్యము, నికేతనాభ్యంతరములు = ఇండ్ల లోపలిభాగములు. 138. అమ...శనుల్ = అమరావతి దేవతలు, ప్రథమ సంధ్యావేళ=ప్రాతస్సంధ్యాకాలము, మధ్యమలోకంబు=భూలోకము, దీవ్యదంశువులు = ప్రకాశించు కిరణములు, నీహారప్రతానంబు = మంచుమొత్తము, మిన్నుఁ బ్రాఁకెఁ=ఆకాశముపై వ్యాపించెను, ఉదయగ్రావము = తూర్పుకొండ. 139. పౌలోమి=శచీదేవి, కోకము = చక్రవాకము. అలఁతియీరెండ=కొంచెపు లేఁతరెండ, అట్టు=మెడ, తుఱఁగలింప=అధికముకాఁగా, పూర్వదిశ=తూర్పు, కరకర= తీవ్రముగా, ప్రొద్దుపొడిచె=సూర్యుఁ డుదయించెను. 141. కల్యాచారములు=ఉదయమునఁ జేయవలసినవిధులు, కడఁక=పూనిక, కౌరవ్యశార్దూలుఁడు=కౌరవవంశమున సత్తముఁడు-అర్జునుఁడు, భ్రాజిష్ణుఁడు=ప్రకాశించువాఁడు. 142. బలవ...నత=బలవంతులగు శత్రువుల సమూహముయొక్క గొప్పబలమును నశింపఁజేయఁగల

భుజబలమున ఒప్పిదమగు విలాసప్రకాశము, బలసూదనుఁడు=ఇంద్రుఁడు. 143. ఫల్గునుఁడు=అర్జునుఁడు, అఫల్గువాత్సల్యము=పొలివోని ప్రేమ, గూహనము=ఆలింగనము, జంభభేది=ఇంద్రుఁడు. 144. ఈశానుఁడు = శివుఁడు, ఇమ్మడిగాఁగ = ద్విగుణమగునట్లుగా, పురవైరి = శివుఁడు, నిర్జరులు = దేవతలు, అధికరించితివి = సంపాదించితివి, అస్మదాచార్యకంబున=నాగురుత్వమున, కుంభజుఁడు=ద్రోణుఁడు, నైజంబుగా=స్వాభావికముగా, చాపనైపుణంబు=విలువిద్యయందలి నేర్పు, చంక్రమము=తిరుగుట, గరిమ=గొప్పతనము. 145. వేరీ=ఎవరున్నారు? సాహసిక్యము=సాహసము. 146. అని=యుద్ధము, విశ్వంబు=సమస్తప్రపంచము, వదలకు = విడువకుము. 147. ఏపు=బలము, ప్రాపు=ఆశ్రయము, సుపర్వులు = దేవతలు, నాపనిచినపసుపు = నేనాజ్ఞాపించినయానతి. 148. ఘోరదానవుల్ = క్రూరరాక్షసులు, నీరధిగొంది=సముద్రమందలి మఱుఁగుచోటు, కుండలి = నాగులు, కలంగెడు = కలఁతపడుచుండును. 149. అసమానబలుల్=సాటిలేని బలముకలవారు, సుర...కుల్=దేవతలకు విరోధులు, అవధ్యులు=చంపఁదగనివారు, నిర్జరాళి = దేవతల గుంపు, ఏడై...యంగ=సామర్థ్య మతిశయింపఁగా. 150. సునాసీరుండు=ఇంద్రుఁడు, సమారాధనంబు=గౌరవము. 151. తొడిన=తొడిగిన-ధరించిన, దాఁచి=ఛిద్రపఱచి, కడంకన్=పూనికతో. 152. అనూరుసవర్ణములు=అనూరునితో సమానములైనవి, అయుతంబు=పదివేలు, అయదము = శుభమునుకలిగించునది. 153. అసురలోకంబు=రాక్షసులసమూహము, ఎదలోన=మనస్సులో, అడరుపెంపున=మిక్కిలి ఆధిక్యమున, నిర్జరులు=దేవతలు. 154. శుంభ...ద్ధత్యుఁడు=ప్రకాశించు గొప్పగర్వము కలవాఁడు, శతాంగము=రథము, విరిర్వుఖేంద్రుఁడు=దేవేంద్రుఁడు, ఆజినిస్తంద్రుఁడు=యుద్ధమున ఆలస్యములేనివాఁడు, అరదంబు = రథము, ఎగిచె=తఱిమెను, గోత్రవిభేది=ఇంద్రుఁడు, పరి...బలుఁడు, శత్రువులనెడి పెద్దమేఘములకు వాయువైనవాఁడు, మాయించె = నశింపఁజేసెను, పాకదైతేయుఁడు = పాకుండనెడి రాక్షసుఁడు, స్యందనంబు=రథము, ఏపు=బలము, మాపెన్=నశింపఁజేసెను, నముచి...శ్రేణి=నముచి మున్నగు రాక్షసులగుంపు, అమరవిభుఁడు = దేవేంద్రుఁడు, ఓర్వము=ఓడింపుము. 155. అతిరభసంబున=మిక్కిలివేగముగా, కరి...భ్రమంబు=కరి మకరముల శక్తిమంతమగు పూత్కారములవలని నీటితుంపురుల సమూహముచే నింపఁబడిన ఘనాభోంతరాళమున ఎడతెగని - అకాలసంభవమైన చుక్కలగుంపనెడి భ్రాంతికల్గించునది, ఘన...మాన=గొప్ప వర్షకాలపుమేఘముచే త్రాగఁబడిన, ఆవర్త=సుడిగుండము, మంథానకధర=మంథరపర్వతము, అమల=నిర్మలమగు, డిండీరపిండ = నురుగుముద్ద, అఖండ = ఎడతెగని, పాండుర్య =

తెల్లదనము, సాంద్రచంద్రికా=దట్టమైనవెన్నెల, వితత=ఎక్కువైన, విద్రుమ లతానికుంజ = పగడపుతీగలపొద, సముద్ధిరంజిత = బాగుగా రంగుపూయఁబడిన, చరమసంధ్యా=సాయంసంధ్య, రాగంబు = ఎఱుపురంగుకలది, కమఠ=తాఁబేలు, ఝష=చేఁప, కుళీర=ఎండ్రి, సంపాత=పడుట, విలీన=అణఁగిపోయిన, నిఖిల... కంబు=సమస్తప్రాణుల ధ్వనులుకలది, తట = ఒడ్డు, వికిరత్ = చెదరిన, కుసుమ మంజరీ = పూలగుత్తి, లతావిభవంబు = నాట్యసంపదకలది, పక్షభూభృత్ = ఱెక్కలుగల పర్వతము-మైనాకముయొక్క, అవి...లంబు=ఎక్కువైన ప్రచా రముచే భయంకరమైనది, అమేయవాహినీ=లెక్కలేని నదులు, దగ్గఱి=సమీపించి, ఉదరము = లోభాగము. 156. అనర్ఘ...ధము = విలువైన రత్నములుతాపిన బంగరుసౌధములుకలది, అసాధ్య...సాలము = అనన్యసాధ్యమగు శిల్పము కల గొప్ప ప్రాకారముకలది, విశాలతరాట్టము = మిక్కిలి విశాలమగు అట్టడికలది, ఉద్భ...ర్జనము = ఉద్ధతులగు శత్రువులకు భయంకరమైనది, సురద్విషదుజ్జ్వలి తంబు=రాక్షసులచేఁ బ్రకాశించునది. 157. ఆకంపించె = మిక్కిలి వణఁకెను, యాదోనిధుల్=సముద్రములు, డిందె=తొట్రుపడెను, సురేంద్రలోకములు = దేవ లోకములు, వినియోగంబులు=ఉపయోగంబులు, వ్రీలెన్=బ్రద్దలయ్యెను. 158. యుగవిగమసమయ=ప్రళయకాలము, ఘనఘనాఘనము=వర్షకాలపు గొప్పమేఘ ము, నిర్ఘాత=పిడుగు, భైరవంబు=భయంకరము, కనలి=కోపించి, హల=నాఁగలి, ముసల=రోఁకలి, దండ=కఱ్ఱ, కోదండ=విల్లు, కుంత = బల్లెము, కులిశ = వజ్రా యుధము, భల్ల=బాణము, కర్తరీ = కత్తెఱ, కఠార = బాకు, కుఠార = గొడ్డలి, లవిత్ర=కొడవలి, తోమర=ఇనుపగుదియ, ఖట్వాంగ=మంచపుకోడు, చంద్రహాస= కత్తి, తదీయస్యందనంబు=అర్జునుని రథము. 159. వనధుల్ = సముద్రములు, ఘూర్ణిల=ఘోషింపఁగా, వాసవి=అర్జునుఁడు. 160. వాలిక...దూపులు=వాఁడియై మెఱయుబాణములు, నాళీ...అంధి = శ్రీకృష్ణునిమఱఁదియగు అర్జునుఁడు, నలి = మిక్కిలిగా, కంకపత్రములు=ఒకవిధమైన బాణములు. 161. అలుక=కోపము, ఒక్కయుమ్మడి=ఒక్కపెట్టున, కలహాక్షోణి = యుద్ధరంగము. కాండప్రకాండం బులు=బాణముల గుంపులు, సమాకంపింప=మిక్కిలి చలింపఁగా, భూతావళుల్= ప్రాణులసమూహములు. 162. త్రిదశసారథి=మాతలి, ధృతి=ధైర్యము, తాన= తానే-అర్జునుఁడే, పరిమార్చె = చంపెను. 163. దుర్జయవిక్రమము = ఇతరులు జయింపలేని పరాక్రమము, సమరదోహలత = యుద్ధమునందలి యుత్సాహము, దోఃఖర్జూభరంబు = ఎక్కువైన భుజములతీఁట, సార...త్యము=రథముగడపుట లోని ఆసక్తి-నేర్పు. 164. ఉద్ధతి = దర్పము, ఉద్దండించి = వ్యాపించి-

విజృంభించి, ఏచి = చెలరేఁగి, పఱపించిరి = వ్యాపింపఁజేసిరి, అవఘళించు = ప్రతిఘటించునట్టి-ఎదిరించు, శుక్రశిష్యులు = రాక్షసులు. 166. జంభారిప్రభవుఁడు = అర్జునుఁడు, జ్యానాదసంరంభ = వింటినారిధ్వనియొక్క యార్భాటము, భ్రామిత = త్రిప్పఁబడిన, ప్రసరత్ = వ్యాపించుచున్న, కుంభద్రోణములట్లు = ఎడతెగక - కడవలతో ముంచినట్లు, బిట్టు = అధికముగా. 167. విద్యావైయాత్యము = మాయావిద్యయందలి నేర్పు, వర్షాస్త్రంబుల్ = వర్షము కురియు నస్త్రములు. 168. వడువు = విధము, ముసరి = వ్యాపించి, వార్వాహంబుల్ = వారివాహములు - మేఘములు, వెడవెలుపు = ఎడతెఱపి. 169. మారుతాస్త్రంబు = వాయవ్యాస్త్రము, జలవాహంబులు=మేఘములు, అక్షయ్యప్రతాపంబుక్షీణింపని పరాక్రమము, అశ్మములు=రాళ్లు, ఉగ్రస్వాంతులు=కోపించినవారు, కులిశాస్త్రము=వజ్రాస్త్రము. 170. అనల...స్త్రములు=ఆగ్నేయ, వాయవ్యాస్త్రములు, బెరసి=కూడి, విస్ఫులింగముల్ = అగ్నికణములు, క్రాల = ప్రకాశింపఁగా, పావక శిఖల్=అగ్నిజ్వాలలు, వెస = వేగముఁగా, మహాశుగంబులు = గొప్పబాణములు. 171. తెమలె=నశించెను, దిశావివేకము=ఇది యేదిక్కు-అనెడి జ్ఞానము, సురేంద్రసారథి=మాతలి, ప్రతోదము=కొరడా. 172. రథ్యములు=అశ్వములు, మిథ్యాభిమతంబులు=కోరిక నెఱవేఱనివి, సమిద్రథ్యుఁడు=యుద్ధమునందు రథికుండగువాఁడు, ధనంజయుఁడు=అర్జునుఁడు. 173. భయో...న్యంబు=ఎక్కువ భయమును గల్గించునవి, జన్యంబులు=యుద్ధములు, వర...తులు=వరమువలనఁగల్గిన పరాక్రమముచే గర్వించినవారు, సంప్రహారంబు = యుద్ధము, ఫల్గునుండు=అర్జునుఁడు. 174. జంభధ్వంసి = ఇంద్రుఁడు, మహాసారము = గొప్పబలముకలది, తమస్సంభారంబు=కటికచీఁకటి, వైశద్యంబు=వెలుఁగు, దితిజుల్=రాక్షసులు. 175. జవము=వేగము, దైత్యతనువుల్=రాక్షసుల దేహములు, సర్వంసహాపీఠి=భూభాగము, ధనుఃప్రకాండ=గొప్పవిల్లు, అవనీధ్రంబులు= పర్వతములు, నింగి=ఆకాశము, అద్రువన్=అదరఁగా. 176. నిరవశేషులు=మిగతలేనివారు, (ఇచట 'నారీసమాక్రందనంబు' అనునది లేకుండుట మేలు.) 177. హట్ట...తము = మేడలతోను, తిన్నెలతోను ప్రకాశించునది; నిర్జరవిభుండు = ఇంద్రుఁడు. 178. త్రిదశ...సారథి=మాతలి, నిర్జరేశ్వరుండు = ఇంద్రుఁడు, వనరాశి = సముద్రము, సృజియించెను=నిర్మించెను, దేవావలి = దేవతల గుంపు, ఉండన్ = ఉండుటకు, దనుసూనులు = రాక్షసులు, రాజీవభవుఁడు = బ్రహ్మ. 179. ఇంద్రా...వరులు = ఇంద్రుఁడు మున్నగు నుత్తమ దేవతలు, పెనకువ = పోరాటము, క్రిందుపడకుండ=అపజయము పొందకుండ, అఖిల...త్స్నతన్=సమస్తలోకములను నశింపఁ

జేయునాసక్తితో. 180. వాసవుండు=ఇంద్రుఁడు, కొలంది=అవధి, ప్రస్తుతించి=కొనియాడి, క్రమ్మఱించె=మళ్లించెను, భవ్య...త్ముండు = గొప్పతేజస్సుచే చూడ శక్యముకానివాఁడు. 181. పొలుపు = అందము, ఉజ్జ్వలంబులు = ప్రకాశించుచున్నవి. 182. ఘనతపోవిపినంబు=గొప్ప తపోవనము, విస్మయంబు=ఆశ్చర్యము. 183. అత్యుగ్రనియమంబు=మిక్కిలి ఘోరమైన నియమము, పద్మగర్భుఁడు = బ్రహ్మ, కామగమనంబు=కోరినట్లు పోవునది, దనుసుతులు=రాక్షసులు = ఆహవంబు=యుద్ధము, త్రిదశులు=దేవతలు, తేరువఱపుము=రథము నడపింపుము. 184. సంవర్త...శ్వమ్ము=ప్రళయకాలమందలి వాయువులను, మనస్సును జయించు వేగమునఁబరుగులిడు నశ్వములుకలది, నేమిఘోషంబు = రథచక్రపుటంచుయొక్క ధ్వనికలది. ఉప్పరవీథి=ఆకాశమార్గము, వెస=వేగము, శతాంగములు=రథములు, షష్టిసహస్రకంబు=అఱువదివేలు, వెరసి=కూడి, అనుబుద్ధి= అనెడియభిప్రాయము, అశ్మం...బులు=ఱాళ్లను, వృక్షములను పుట్టించునవి; తద్రథాళి = రాక్షసుల రథ సమూహము, గతినిరోధంబు = మార్గమున కాటంకము. 185. అంతరిక్షంబు = ఆకాశము, ఎగసిన = ఎగురఁగా, నిశిత...తంబు = వాఁడిబాణముల పంజరమును ప్రయోగించుట, ఊర్ధ్వగతినిరోధంబు=మీఁదుగాఁబోవుట నడ్డగించుట, అన్యప్రకారంబున=వేఱువిధమున. 186. భావించి=ఊహించి, తొడి=తొడిగి, త్రిదశశత్రువులు=దేవతలవిరోధులు-రాక్షసులు. 187. తరక్షు=సివంగి, కుంజర=ఏనుఁగు, ద్యుచర=ఖేచరులు, గ్రసించె=మ్రింగెను, సురారివీరులు=రాక్షసవీరులు. 188. గీటడంచి=చంపి. 189. తద్దయు=మిక్కిలి, త్వరితపడుచున్నవారలు=తొందరపడుచున్నవారు. 190. కదనము=యుద్ధము, ప్రతి=సాటి. 191. ద్రోణసుతుండు=అశ్వత్థామ, రణక్షోణి=యుద్ధభూమి, భవదిషుప్రహతి=నీబాణములదెబ్బ! అత్రాణులు=రక్షణలేనివారు, దురంబు=యుద్ధము. 192. అవనీభువనంబు=భూలోకము, అగ్రజులు=అన్నలు, ప్రణమిల్లి=నమస్కరించి, ఉపలాలించి=ఊఱడించి, 193. అగ్రజన్ముఁడు=అన్న, ప్రమదము=సంతోషము, పాలింపించెన్=పాలించునట్లు చేసెను. 195. వ్యాపారి...వాయ!=గొప్పవర్తకులవంశమునఁ బుట్టినవాఁడా! తర్పిత=తృప్తిపొందింపఁబడిన. 196. అర్థి...ప్రద!=యాచకుల సమూహము కోరినకోరికల నిచ్చువాఁడా! సార్థవహ=వర్తకుఁడు, యశోవర్ధనార్థ = కీర్తిని వృద్ధిపొందించు సంపదకలవాఁడా!. 197. అచల = పర్వతము, నిర్జర=దేవతలు, ప్రమోది=సంతోషించువాఁడు.

---

చెన్నపురి: 'శ్రీరామా' ప్రెస్సున ముద్రితము—1958.

# పద్యకావ్యములు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| అచ్చతెనుఁగు రామాయణము ... | 2 | 8 |
| అనంతుని ఛందము, (ఛందోదర్పణము) ... | 2 | 0 |
| అనిరుద్ధచరిత్రము, అబ్బయామాత్యునిది ... | 1 | 0 |
| అనుభవసారము, పాలకుఱికి సోమనాథ ప్రణీతము ... | 1 | 0 |
| అప్పకవీయము, క్రొత్తకూర్పు ... | 5 | 0 |
| ,, శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారి విమర్శ ... | 0 | 12 |
| అంబరీషోపాఖ్యానము, సటీక ... | 0 | 8 |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) సటీక ... | 8 | 8 |
| అన్యవాదకోలాహలము, ద్విపద, లఘుటీక ... | 0 | 12 |
| ఆంధ్ర భాగవతము, పద్యకావ్యము 2 సంపుటములు ... | 15 | 0 |
| ఆంధ్రమహాభారతము:— | | |
| ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు ... | 1 | 8 |
| ,, టీక ... | 8 | 0 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| ఆదిపంచకము | 11 | 4 | భీష్మ ద్రోణపర్వములు ... | 4 | 0 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | 7 | 8 | కర్ణ శల్య సౌప్తిక స్త్రీపర్వములు | 4 | 0 |
| శాంతిసప్తకము | 7 | 8 | శాంతిపర్వము | 4 | 0 |
| ఆది సభాపర్వములు | 4 | 0 | ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమ | | |
| ఆరణ్యపర్వము | 4 | 0 | వాస, మౌసల, మహాప్రస్థానిక, | | |
| విరాటోద్యోగపర్వములు | 4 | 0 | స్వర్గారోహణపర్వములు | 4 | 0 |

| | | |
|---|---|---|
| ఆనందరంగరాట్ఛందము ... | 1 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు (నిఘంటుత్రయము) కాలికో ... | 2 | 0 |
| ఆంధ్ర శ్రీమద్రామాయణము—శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారిది, 3 సంపుటములు ... | 15 | 0 |
| ,, 7 సంపుటములు ... | 18 | 0 |
| ఆంధ్రచంద్రాలోకము, సటీక ... | 1 | 4 |
| ఉత్తరరామాయణము, చక్కని కూర్పు ... | 6 | 0 |
| కవిజనాశ్రయము ... | 1 | 0 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవి ... | 1 | 4 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| కవికంఠోక్తి ... | 0 | 4 |
| కవిజనాశ్రయము ... | 1 | 0 |
| కవిసంశయవిచ్ఛేదము, అడిదము సూరకవి ... | 1 | 4 |
| కవిరాజమనోరంజనము ... | 1 | 4 |
| కవిజనరంజనము ... | 0 | 12 |
| కళాపూర్ణోదయము, సూరనామాత్యునిది ... | 4 | 0 |
| డిటో టీకతో ... | 6 | 0 |
| కృష్ణదండకము ... | 0 | 3 |
| కవిగజాంకుశము ... | 0 | 4 |
| కృష్ణరాయవిజయము ... | 1 | 0 |
| కాశీఖండము, శ్రీనాథకవిది ... | 3 | 8 |
| క్రీడాభిరామము, శ్రీవల్లభరాయప్రణీతం ... | 1 | 8 |
| కుచేలోపాఖ్యానము, సటీక, (భాగవతము) ... | 0 | 8 |
| డిటో గట్టుప్రభుకృతము ... | 0 | 12 |
| కుమారసంభవము, నన్నెచోడకృతము ... | 5 | 0 |
| గజేంద్రమోక్షము, సటీక ... | 0 | 10 |
| గద్యపద్యసంగ్రహము, విద్వాన్ జ. వే. సుబ్రహ్మణ్య శర్మగారిది ... | 1 | 0 |
| ,, గొర్తి సూర్యనారాయణశాస్త్రిగారి ... | 1 | 0 |
| గయోపాఖ్యానము, రామనామాత్యునిది ... | 0 | 12 |
| గయోపాఖ్యానము, ద్విపద (కృష్ణార్జునసంవాదము) గోపమంత్రిది ... | 0 | 8 |
| గరుడాచలము-యక్షగానము, పెద్దన్న ... | 1 | 4 |
| గణికాగుణప్రవర్తనతారావళి ... | 0 | 4 |
| ఛందోదర్పణము (అనంతునిఛందస్సు) ... | 2 | 0 |
| జైమినిభారతము ... | 3 | 0 |
| తెనుగుసమస్యలు ... | 0 | 4 |
| దసరాపద్యములు ... | 0 | 3 |
| దండకరామాయణము, చక్కనిశైలి ... | 3 | 8 |
| దేశింగురాజుకథ (జంగంకథ) ... | 0 | 8 |
| ధనాభిరామము ... | 0 | 12 |
| ధర్మఖండము, స్కాందపురాణాంతర్గతము 1, 2 భాగములు ... | 5 | 0 |
| ధ్రువోపాఖ్యానము, సటీక ... | 0 | 12 |
| నరసభూపాలీయము, సటీక (కావ్యాలంకార సంగ్రహము) ... | 3 | 0 |
| ,, 3-వ ఆశ్వాసము, వెల్లాల సదాశివశాస్త్రిగారి వ్యాఖ్యానము | 3 | 0 |
| నలోపాఖ్యానము, సటీక ... | 0 | 12 |
| నలచరిత్ర, ద్విపద, క్యాలికోబైండు ... | 2 | 4 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| నాచికేతోపాఖ్యానము, మల్లికార్జునకవి ... | 1 | 0 |
| నిర్వచనోత్తరరామాయణము ... | 2 | 8 |
| నిరంకుశోపాఖ్యానము ... | 0 | 12 |
| నీతిపద్యసంగ్రహము, సటిప్పణము ... | 0 | 6 |
| నీలాసుందరీపరిణయము ... | 0 | 12 |
| నృసింహపురాణము, ఎఱ్ఱాప్రగడది ... | 2 | 8 |
| పంచతంత్రము, నారాయణకవిది ... | 2 | 8 |
| డిటో వెంకటనాథరాజకవికృతము ... | 2 | 8 |
| పల్నాటివీర చరిత్రము ... | 3 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, పింగళిసూరన ... | 2 | 8 |
| పరమయోగివిలాసము, ద్విపద, తాళ్లపాక తిరువేంగళనాథుడు ... | 2 | 8 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు ... | 1 | 0 |
| ,, సాంధ్రటీకాతాత్పర్యము ... | 5 | 0 |
| బ్రహ్మోత్తరఖండము ... | 3 | 0 |
| బసవపురాణము, ద్విపద, చిన్నసైజు ... | 4 | 8 |
| బిల్హణీయము ... | 1 | 4 |
| బేరీజుపద్యములు ... | 0 | 4 |
| భగవద్గీతా కందార్థములు ... | 1 | 4 |
| భగవద్గీత, పద్యకావ్యము, శ్రీగోపీనాథ వెంకటకవికృతము ... | 1 | 4 |
| భారతసావిత్రి ... | 0 | 2 |
| భీమేశ్వరపురాణము శ్రీనాథునిది ... | 3 | 0 |
| భోగినీదండకము ... | 0 | 4 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము ... | 4 | 0 |
| మల్లభూపాలీయము, నీతిశతకము, ఏలకూచి బాలసరస్వతి, వేదము లక్ష్మీనారాయణశాస్త్రి టీకతో ... | 1 | 8 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 4 | 0 |
| మొల్లరామాయణము ... | 1 | 8 |
| యయాతిచరిత్ర, పొన్నిగంటి తెలగనార్య ... | 2 | 0 |
| డిటో అకొండి వ్యాసమూర్తిగారిది ... | 0 | 3 |

☞ ఇవిగాక మావద్ద సంస్కృతాంధ్రగ్రంథములు, నాగరిలిపి గ్రంథములు, అరవగ్రంథములు, ఇంగ్లీషుగ్రంథములు దొరకును.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

పోస్టుబాక్సు 1372. 292, ఎస్ప్లనేడ్, మద్రాసు. 1